ఆ॥ విఘ్నతతికి మాఱు విఘ్నంబుచేసి ని, ర్విఘ్నముగ నొనర్తు ♦ వేల్మి మీకు
బాలు మాట మాని ♦ బయలుదేఱుండు మీ, వెంట నిపుడ నేన ♦ వెడలవత్తు. ౧౧౯

సీ॥ పరమేష్ఠి సృష్టికిఁ ♦ బ్రతిసృష్టి చేసిన, కౌశికుఁ డతఁ డనా ♦ క్యమ్ము వినుచుఁ
బెను కిన్కతో లేవ ♦ విబుధులు ప్రళయ మం, చును కాదనుచు శంకఁ ♦ జొచ్చినారు
రవి మండలం బంబ ♦ రంబున మఱుఁగయ్యెఁ, గలఁతనొందినవి జ ♦ గంబులెల్ల
దిక్కులఁ దిమిరంబు ♦ నిక్కెఁ గాపులు గప్పెఁ, గుల పర్వతంబులు ♦ చలనమొందె.

తే॥ మునికిఁ గనుబొమల్ నొసటిపై ♦ ముడులువడియెఁ, బెదవు లదరెను జేగుఱు ♦ బెరసి కనుల
నిప్పుకలు రాలె సభయెల్ల ♦ నిలుకడ చెడె, తోడనే సర్వ సైతము ♦ దోఁచెనంత.

తే॥ ఇంతయును వసిష్ఠుఁడుగాంచి ♦ శాంతిఁబొందుఁ, డనుచు గాధేయు వేఁడి జ ♦ నాధుతోడఁ
బలుకు సుతుసఖుఁ బొందింప ♦ నలుసికాసి, మేల్లు వచ్చుకాలము నాఁప ♦ మేరయగునె?

తే॥ వానకురియంగ వెల్లువల్ ♦ పరువులెత్తి, యంబునిధిఁ జేరుచందాన ♦ నలవిలేని
యఖిలవిద్యలు తమయంత ♦ నరుగుదెంచి, నీకుమారుఁ జేరెడి వేళ ♦ నేఁడు కలిగె.

తే॥ అనుడు కులగురు వాక్యంబు ♦ లాలకించి, యాజి విజయశీలుం డాజి ♦ యరిగి రాముఁ
బిలువుఁడన భటు లేతెంచి పిలుచునంత, బుద్ధిమద్వర్యుఁ డరుదెంచి ♦ పొంత నిలిచె.

## రామలక్ష్మణులు కౌశికువెంటఁ జనుట.

ఉ॥ తమ్మునితోడ వచ్చు గుణ ♦ ధాముని రాముని చూపి మౌని ర
త్నమ్మ! మదీయ పుత్త్రులకుఁ ♦ దండ్రివి మేలగు తల్లివీవె ప్రే
మమ్మున నొప్పగించితిని ♦ మానుగఁ గావుఁడు వీరిచేత మీ
కెమ్మెయి కార్యముల్ వలయు ♦ నెల్లను గైకొనుఁ డంచు నిచ్చినన్. ౧౨౦

చ॥ విమలచరిత్రుఁడైన ముని ♦ వీరుఁడు భూవరుఁ డొప్పగించు నా
సుమతులఁ గాంచి మున్ను మదిఁ ♦ జొన్పిన కోపము వీడి ప్రేమతోఁ
దమిఁగొని దీవనల్ సలిపి ♦ దగ్గఱి పుత్త్రికులార! మేటి జ
న్నము మన మౌని పూరితి యొ ♦ నర్తమ? యంచుఁ జనం దొడంగినన్.

చ॥ జగములఁ గాచు రాముఁడు ని ♦ శాత కృపాణము సవ్యపార్శ్వమం
దు గడఁకఁ దాల్చి గొప్ప మల ♦ దోయిని పోలిన యున్నతంపు దో
ర్యుగమున సత్యధర్మముల ♦ యొప్పు వహించి కొలంతకాని యా
శుగ యుత తూణముల్ చెరివి ♦ నూటిగఁ దాల్చె జయిష్ణు చాపమున్.

తే॥ తన్ను పోలిన తమ్ముఁడుఁ ♦ దాను జనకు, తీపిప్రాణముల్ వెలిబైలు ♦ దేఱు కరణి
నియతు గాధేయు వెన్నంటు ♦ నీడ వోలెఁ, గాంచనమయ దుర్గంబులఁ ♦ గడచి చనిరి.

చ॥ వరములు వెల్తివో ప్రకత • పం బొనరించెడు వారు చేరు ని
ర్జర నగరంబులుల్ సవతు • రాని పురంబును దాఁటి నృత్య మం
దిర నట దంగనా పద వ • నేజ రట ద్వర కింకిణీ సమా
భ్యురు రుత హంసయుక్త సర • యూనదిఁ జేరిరి వార లంతటన్. ౩౨౪

సీ॥ చెఱకులు గాలికి • నొరయఁ దగిలి పోఁక, క్రమాకులఁ గాఱిన • మధురసంబు
గనిమలఁ బారలు పూ • గానులఁ దిరుగాడు, హరిణాక్షులును కృశో • దరలునై స
ఖాలఁతులు పోలుచొర • ముడిచి యల్లిన దీర్ఘ, కుంతలములఁ బోలు • కొమరుఁ దేంట్లు
వసియింప నిరవైన • వనమొండు గని యందు, తపసి యారాత్రిరి • విడిసి యవలఁ.

తే॥ బెను మొగుళ్ల తండములు కొ • మ్మనను గలిగి, ముఖపటముగల దంతినా • మొనయు నుదయ
శిఖరి శిఖరంబు మీఁదికిఁ • జిలుకరంగు, వాజు లేపెక్క నది దాఁటి • పయన మైరి.

చ॥ క్రతుభుజులెప్డు నాలుకలఁ - గైకొను నాహుతిసేయ నిమ్ముగాఁ
గ్రతుముఖమందు లేచు పొగ - క్రమ్మిన యొక్క వనంబుఁ గాంచి స
న్మతిఁ బురుషోత్తమోత్తముఁడు - క్ష్మాపతి పుత్త్రుఁడు రామచంద్రుఁ డో
యతివర! యీవనం బెవరి - దర్మిలి నాకు నెఱుంగఁ జెప్పవే. ౩౨౬

## ౭. తాటకవధ పటలము. (౨౬)

కవిరాజ విరాజితము.

అనవుడుఁ గౌశికుఁ డిట్లను మారుఁడొ - కప్పుడు మోహనబాణము నీ
శుని పయి నేయఁగ నాతని నిప్పులు - జొబ్బిలు నేత్రమునుండి మహా
శని క్రియ లేచిన యగ్నిదహింపఁగ - సొరగు వాని శరీరము మం
డిన యదికోలె ననంగుఁడె యయ్యెఁ గ - డింది మగండగు కంతుఁ డిటన్. ౩౨౭

తే॥ భవుఁడు మదనుని దహియింప • వానియొడలు, బూదియై యిటఁ జిందుటఁ • బోలిచె నిద్ది
యంగదేశంబనెడిపేర • సార్థకముగ, విశ్వవినుత సుగుణచయ! • వేదనిలయ! ౩౨౮

ఉ॥ ఆశయుఁ బాశముల్ మొదలి - కంట నశింపఁగ జన్మదుఃఖముల్
నాశమునొంద దత్త్వము న - నారత చింతనసేయు జ్ఞానులే
యీశు భజింతు రట్టి యగ - జేశుఁడె యిందు తపించె నన్న నీ
దేశ మహాత్మ్యసంపద ను - తింపఁగ నెవ్వరికేని శక్యమే? ౩౨౯

చ॥ అని ముని పల్క నచ్చటికి • నచ్చెరువందుచు నేగి సంతసం
బున నెదురైన సచ్చరిత • ముఖ్యధనంబుగఁ గల్గు మానులన్
గని మది సంతసించి గుణ • గణ్యులతో నట నాఁడు పుచ్చి వే
ఘనునుఁ డుదయాద్రి నెక్కుతఱి • నేగి మరుస్థలిఁ జేరి రొక్కటన్. ౩౩౦

## మరుభూమి వర్ణనము.

మానిని॥ భానుఁడు మేదిని సారము పూర్తిగ - బాగుగ లాగఁ దలంచి పనిం
బూని జయధ్వజమెత్తి చరించెడు • పోఁడిమి గ్రీష్మమె కాక మఱే
దేని ఋతుస్థితి లేమి నిటన్ జ్వాలి • యించు మహాతాపనుఁడే మొగి నా
హీన పరిస్థితిఁగాంచ నెదం దపి - యించును నీర్వెడుచుం గనులన్. 331

కవిరాజ॥ ఉడుకును జిహ్వాయు నచ్చటి వేఁడిమి • నొయ్యనఁ బూర్తిగఁ జెప్పినచో
నుడుకును పర్విన చీఁకటి, యండము - లుప్పర మారట మొందును వే
యుడుకును సూర్యుఁడు పుట్టినచో మఱి - యుక్కును మించులు పిడ్గులు పై
నుడుకు సమస్తము సన్న మటెయ్యది • యుత్తల మందక యుండు మహిన్?

చ॥ కదనమునందు శౌర్యమున - ఖడ్గ శరాదిక సాధనంబులం
బొదలుచు బాణ వర్షమునఁ - బోరెడి నేరుపు లేని వంచకుల్
గదురుచు కుట్రచేఁ బరువు • గర్వముఁ గోల్పడు వీరవర్యు నె
మ్మది బలెఁ దాప మాఱకయె • మండుచునుండు సఖంబు నచ్చటన్ 333

ఉ॥ అవ్వన భాగమం దరయ • నాకులు రాలి మొదళ్లు, భూతముల్
నవ్వెడి నోరు విప్పుకొను • చాడ్పునఁ జీలిన వృక్షరాజముల్
చివ్వున వంశముల్ ప్రిదులఁ - జిందిన ముత్తెములున్ ఫణిస్ఫటల్
నెవ్వడి ప్రేల నివ్వటిలి • నిండిన కెంపులు నుండు చండిగన్. 334

మ॥ ధరణీదేవియుఁ బోవఁజాల చెటులున్ • దత్స్థానమున్ వీడుచుం
బరువుల్ వాఱ దరణ్యదేవతయు నా - భంగంబులంబొందు నం
బర వీథిన్ రవితేరు పాఱ దటఁ బ - ర్వం జాలవున్ మేఘముల్
నెరయంజాలదు చల్లగాలియు నసం • జిత్రంబు కాదద్యొడన్ 335

ఉ॥ ధారణి బీఁటవోఁ గనుల - దంష్ట్రలనుండి విషాగ్నిఁ గ్రక్కు శే
షోరగ శీర్ష రత్న కలి - కోత్కర కాంతులు బీఁటనుండి తో
ల్కారు మెఱుంగు లట్లు వెడ - లం గనుపట్టె ధరిత్రి దేవికిం
దీఁటని మేనిపుంట్ల వెలి - దేఱెడి యెఱ్ఱని నీచ్చుకై వడిన్ 336

చ॥ అడఁపఁగరాని యాఁకట మ - హావ్యథనొందెడు పెద్దపాము తా
నెడముగ నోరువిప్పఁగ, ది - నేశుని తీక్ష్ణ మయూఖపాళిచే
నుడికిన దంతియొండు తల - నొక్కట దాఁచుకొనం దలంచి పే
రడలున గీఁక పెట్టుచుఁ ద - నంతఁ జొరంబడు నీడ య న్మతిన్ 337

చ॥ అనుపమ తీక్ష్ణ మూర్తియగు - నగ్ని మహాశయుఁడేలు నయ్యెడా
రిని గల కాకముల్ కరులు - ప్రేలుచు నాశిలి నల్లబొగ్గులై

పానుపడి యుండుటల్ గనఁగఁ - బోలు నభస్థ్సలమెల్లఁ బర్వి యే
ర్చిన బడబాగ్నిఁ గాలి యిలఁ - ద్రెళ్లిన మబ్బుల తున్కలో యనన్ ౩౩౮

ఉ॥ అమ్మరుభూమి సంచరిలు - నట్టి మరీచిక గుంపు లారయన్
గ్రమ్మిన వేఁడి యందడరి - గ్రాసి నభస్థల మంటునేని స్వ
ర్గమ్మును మాఁడునంచు నను - కంప సురావళిపైఁ గదించి తా
నిమ్ముగఁ బశ్చిమాధిపతి - యేపున డగ్గిన రీతిఁగన్పడున్ ౩౩౯

ఉ॥ వేఁడిమి నుండి తోఁచి పెను - వీఁకను పర్విన యెండమావు లా
పాడరి మండుచున్న వన - పాలుఁడు వేసఁగిఁ గూరుచుంటకై
వోఁడిమిఁ జర్చచేసి వడిఁ - బూన్చిన బంగరు కోడు లెత్తుగాఁ
గూడిన స్ఫాటికాసనము - కోరిక నిల్పిన శేవ దోఁచెడున్. ౩౪౦

చ॥ కడు వగ నింప హేతువగు - కర్మములం దిగఁద్రోచి యవ్వలం
గడవఁగరాని ముప్పగలు - గండగు కోటలదాఁటి మోక్షముం
బడయఁగ నెంచువాని మది - భాతిఁ బసిండి పణంబు గోరు రో
పడఁతుల శూన్య మానసము - వైఖరి ధారణి సారహీనమౌ. ౩౪౧

ఉ॥ ప్రేలిన పక్కులా ల్లైనసి - బీఁటలు వాఱిన యీయెడారి పా
తాళము దాఁక త్రోవవడి - తక్కక పెద్దగఁ గానవచ్చుటన్
వాలిన యెండఁ దాళుకొన - భారము దోపఁగ నాగరత్న భో
గాలి చెలంగు శేషు నిల - యంబు చొరం దగియుండు నెప్పుడున్. ౩౪౨

ఆ॥ ఇట్లు సెగలులేచి - యెడరిచ్చు మరుభూమిఁ, జేరినంత వాని . వీరు గొప్ప
శక్తిమంతు లయ్యు - సౌకుమార్యము గల, వారు గానఁ గష్టపడుదు రనుచు.

ఆ॥ ఎంచి వారిఁ గాంచ - నింగితజ్ఞులు ముని, యంఘ్రి పంకజముల - నాశ్రయింప
బ్రహ్మసృష్టియైన ♦ పరమవిద్యలరెంటి, వారి కపుడు నేర్పె ♦ వాంఛతోడ. ౩౪౪

క॥ మనమున వానిని వారలు, మననం బొనరించు నంత ♦ మరుభూమియుఁ జ
ల్లని తేటనీట నడచిన, యనువయ్యెను రాముఁడిట్టు ♦ లను సన్మునితోన్. ౩౪౫

ఉ॥ కౌశిక మౌనిచంద్రమ! త్రి ♦ కాల విదుండవు తెల్పుమయ్య యీ
దేశము శేలపూవులను - దివ్యనదిన్ జటఁ జుట్టినట్టి గౌ
రీశుని యగ్ని నేత్రమున ♦ నిట్టులు వాడగునేమి? దుష్ట భూ
మీశుని నేల కన్న నిది ♦ యెక్కువ నాశిల హేతువేదొ కో? ౩౪౬

తాటక వృత్తాంతము.

ఉ॥ నావుడుఁ గౌశికుండు రఘు - నాథుని ప్రేమను గాంచి యిట్లనున్
భూవరపుత్త్ర! సత్పురుష! ♦ ముఖ్యులఁ జంపి భుజించి వేయి నా

గావలి చేవగల్గి జను • కంటకు భయంకర రూపమొంది దు
ర్భావముతోఁ జరించు నొక పాపపు టింతి చరిత్ర చెప్పెదన్. ౩౪౭

చ॥ జగములు వింతనొందు బల • శాలి కుబేరు కులంబువాఁడు మ
త్తుగలుగ నుండువాఁడు గజ • దోర్బల యుక్తుఁడు వహ్నివంటి ని
క్కగలుగువాఁడు జంతువయి • నం బనుకంప యొకింతయేని లో
నగపడకుండువాఁడు భువి - యందు సుకేతుఁడనం బ్రసిద్ధుఁడై. ౩౪౮

ఆ॥ సంతులేని చింత • మంతనమ్మున సుకే, తునకు నలము కొనఁగ • మొనసి మూఁడు
మూర్తులందు మొదటి • మూర్తిఁ బద్మాసను, గూర్చి చేసెఁ దపము • కోరి తడవు

తే॥ శాస్త్రవిశ్రుత సంపన్న! • సజ్జనాభి, రామ! ప్రాఁజదువులగని • బ్రహ్మ యతని
యెదుటి కేతెంచి నీకోర్కి • యేది యనినఁ, బుత్రహీన దుఃఖమును దీ • ర్పుమని వేఁడె.

చ॥ కొమరులు నీకుఁ గల్గరొక • కూఁతురు గల్గును లేఁతనెమ్మి మై
కొమరు వహించి లక్ష్మివలె • గోముసనొప్పుచు వేయి మత్తనా
గముల బలంబుగల్గి త్రిజ • గంబులఁ బేరువహించు నంచు నా
కమలభవుం డొసంగి మఱుఁ - గం జనియెన్ దన యిమ్ము చేరఁగన్. ౩౪౯

చ॥ వనజభవ ప్రసాదమున - వానికిఁ గల్గిన పుత్త్రి లక్ష్మి శే
వను క్రమరీతి గోముగను - వర్ధిలి పెండిలి యీడు నొంద నొ
ప్పిన వరుఁడెవ్వఁ డబ్బునని - పేరిమి నారసి తండ్రి, సుందుఁడన్
తనకులమందు మేటి గుణ - ధన్యుని కచ్చెలిఁ బెండ్లిసేసినన్. ౩౫౦

తే॥ మేటి రతి మన్మథులఁ బోలు - మిథున మిద్ది, యనఁగ సుందుఁడు మోహిని - నెనయు సుదతి
తాటకయు రేయుఁ బవలు మొ - దలు తుదియును, లేదనఁగఁ గూడి తేలిరి - మోద జలధి.

తే॥ చాల దినములు గడవ నా - చానయంతఁ, గాంచె మారీచు బలుమాయ - కాని నవలఁ
బడసె గిరినిభ బాహు సు - బాహు మల్లు, వీరు జగముల ప్రాణులు - భీతి నొంద.

ఉ॥ వారలు మేటి మాయయును - వంచనయున్ దులలేని యుద్ధసం
చార చణత్వమున్ గలిగి - చాతురిఁ దల్లికిఁ దొమ్మిదంతలై
మీఱినవారికే నెఱుఁగ - మేవడి చాలనిరీతి వర్ధిలన్
దేఱిన మేటి సుందుఁడు మ - దించెను సంతసమంది యుబ్బుచున్. ౩౫౧

చ॥ చెడుగులు మేరమీఱి వెసఁ - జేయు సురారుల యొవ్వరాని దుం
డుడుకులు మూలముట్టుగను - దోరఁగ నంబుధి తోయమంతయుం
బుడిసిటఁ బట్టి త్రావిన త - పోధను నాశ్రమవాటిఁ జేరి య
క్కడి తరుజాలము ల్వ్రేఱికి - కాసట బీసట చేసి యంతటన్. ౩౫౨

మ॥ రమణీయ స్థితిఁగూర్చి వాటికి మునీం - ద్ర ప్రేమకం బూర్ణపా
త్రములై యొప్పెడు కృష్ణసార రురు సా - రంగాదులన్ సాధు జీ
వములం జంపి భుజించి సుందర తరు - వ్రాతంబు భంజింపఁ గో
పమునం గుంభజుఁడట్టి చూడ నతఁడున్ - భస్మంబయ్యె నాశిలన్. ౩౫౭

తే॥ సుందుఁ డీల్గుట యాతని- సుదతియైన, తాటక యెఱింగి యగ్ని వి - ధాన మండి
యమ్మునివినాశమొనరింతు-ననుచుసుతుల, బిలుచుకొంచుఁదదాశ్రమ-స్థలికిఁజనియె

చ॥ పిడుగుల తో లయాగ్నియును - భీకర వాయువు బెగ్గడిల్లఁగా
వడఁకి సురాళి మోములును - వాడ రవీందులు త్రోవఁదప్ప మిం
చడరు మొగుల్లు సంచలన - మంద ధమీా యని యండగోళముల్
బెడియుచు బీఁటలెత్త వడిఁ - బేర్చుచు నార్చుచు డాయనంతటన్. ౩౫౯

ఉ॥ ద్రావిడమన్ సముద్రము ను ♦ దారమతిం దయచేసి నాతఁడా
పావక సన్నిభుండు నిడు - పాఱు క్రుధాగ్ని మిడుంగుఱుల్ వెసన్
గ్రోవుల పోల్కి వెల్వఁతెచి - క్రూరులు మీారలు దైత్యులై చెడం
జావుఁ డటంచు వజ్రనిభ- శాప వచస్సుల నాడి నంతటన్. ౩౬౦

ఉ॥ రాగి కరంగి వెల్వడిన - రాణ బయల్వడు కోపవహ్నితో
నేగి జగంబులం గలఁచి - యేర్చి నరాసురకోటిఁ గూల్చుచున్
సాగి సమస్తజీవులను - చంపి భుజించుచుఁ గ్రూరకర్ములై
క్రాఁగి చరించు నీచులగు ♦ రక్కసులైరి రయాన మువ్వురున్. ౩౬౧

తే॥ అట్టులమ్మునిశాపంబు ♦ నధిగమించి, క్రియకుఁ బ్రతియొనరించు శ ♦ క్తియును లేమి
నేగి వారు సుమాలితో - నేము నీకుఁ, జెలిమి కొడుకులమని వావి ♦ చేసికొనిరి.

ఉ॥ తప్పుడు చెయ్వులం జలుపు ♦ తాటకపుత్త్రులు వానితోడఁ బెం
పొప్ప రసాతలంబునన ♦ యుండి, దశాస్యుఁడు గాంచి కూరిమిం
గుప్పుచు మామ లంచుఁ దము - గొప్పగ మిక్కిలి గారవింప, వా
రెప్పటి హింసతోడ భ్రమి - యించిరి పెన్ సుడిగాలి పోలికన్. ౩౬౩

తే॥ గొప్ప బలవంతులగు కొడు - కులను వీడి, ముని కినుక నెంచి మండెడు ♦ మనసుగలిగి
త్రోవలెల్ల జ్వాలాగ్నికి - తావులైన, యిప్వనముఁ జేరెఁ దాటక ♦ యేపుతోడ. ౩౬౪

సీ॥ ఇలయెల్లఁగినుకతో ♦ నెత్తంగ వలసిన, జలధి నీటెసి ఁ - వలసిన యెడఁ
గోరి స్వర్గముఁ జీలఁ ♦ గొట్టంగవలసినఁ, జేసి ముగించు నా - చెడుగు జోట
ఎన్న నలవికాని - హింసలు ముద్దయై, యురువొందె నన నొప్పు- నువిద మేను
రెండుకొండల తోడ ♦ మండెడు ఁషముతోఁ, బిడుగుల మించు న - ఖ్కుడులతోడఁ

తే॥ ప్రళయ వహ్నితో నర్ధ చంద్ర ద్వయంబు, నొంది సడతెంచు కడలి యొం-డుందునేని
బెడిదముంగూర్చు సద్దాని -యొడలితీరు, కొంత యూహింపఁబోలు నీ• కువలయమున

సీ॥ కాంచిన పురుషులుం - గామినీత్వముఁ,గోరు, భుజ సుందరత్వంబు- పొసఁగు రామ!
బెడిదంపు శూలంబు - పెనుపాప కడియంబు, చేఁదాల్చియుండు నా- చెడుగుజోటి
యివ్వనంబున వసి - యించుచు నుండు నా, టకటాంకుపేరు తా - టక యటంచ్రదు
మనసున బంధ మింఁగని లోభ మొక్కటి, మాత్రముండిన లెక్క-- మాలిసట్టి

తే॥ సద్గుణావళి నాశంబు - సలుపుకరణి, నలవి యిడరాని కొడిమ బు • ద్ధుల వలంతి
చెడని పంటలుగలుగు నీ • క్షేత్రభూమి, వట్టి మరుభూమిగా మార్చి • పాడుచేసె

తే॥ నీలమేఘ సుందరదేహ! నీరజాక్ష!, రావణాజ్ఞ చే నాచేయు - క్రతువు నెపుడు
పర్వత బలంబుతో వచ్చి - పాడుచేయు, నంగదేశ వంశంబు ల - డంగఁ దిరుగు. 3౬౮

చ॥ జగములఁగాచి ధర్మమును - జాఁగెడి జీవులఁదన్ను పోలెఁ బెం
పుగఁ దలపోయు భూపసుత! - బూటక తాటకఁ గూర్చి నీకుఁ బె
క్కుగఁ బలుకంగనేల? యిటు - కొన్ని దినంబులు సాఁగనేని యీ
జగతి సమస్త జీవులను - చంపును నింపును పొట్టలోపలన్. 3౬౯

## తాటకవధ.

తే॥ ముని యిటులు పల్క విని శంఖ-మున్ ధరించు,చేత విల్లుదాల్చినవాఁడు-చిందుతేనె
గంద మలరు మాలిక సిగఁ-గదలుచుండ, నెట వసించు నయ్యాది వచి-యింపుఁ దనియు

చ॥ అనవుడు నాని మాలి విజి - తాక్షముఁ డిట్లను హస్తయుగ్మముం
గొనిన గిరీంద్రమున్ వయసు - కోడెను పోలిన రాముఁగాంచి యీ
వనమగు దానికెల్లయని - పల్కియుఁ బల్కక మున్నె మండుచున్
దనుజయు నంజనాచల వి • ధంబున వచ్చె ధరిత్రి దద్దఱన్. 3౭౦

ఉ॥ కొండలు గజ్జెలం జొనిపి • కూర్చిన కాళ్ళ ధరన్ దిగంబడన్
గండుగఁ ద్రొక్కి లొక్కివడు • గాతములందు పయోధి తోయముల్
నిండఁగ నిప్పుకల్ చెరుగు - నేత్రముత్రొప్ప జముండు భీతిమైఁ
గొండ గుహల్ చొరన్ గిరుల - కూటమి తన్నెయిదన్ గడున్ వడిన్.

చ॥ ఎలయుచు నిక్కి కొంత చలి • యించు బొమల్ నెలవంకఁబోలు దం
ష్ట్రిలు పెనుమూఁతగల్గు గుహ • చాడ్పున నొప్పిన బాకి నోటితోఁ
బొలఁతుక నిండు సంద్రమునఁ • బొల్చిన వార్వపుటగ్గి రెండు పా
యలు గొని నిర్గమించు క్రియ • నగ్గి బయల్వడ విచ్చెఁగన్నులన్. 3౭౧

ఉ॥ తోరపు మత్త దంతులను ♦ తొండము తొండముతో ముడించి మేల్
పేరుగఁ దాల్చుటం గవలు ♦ పెన్నడుముం గల దైత్య గట్టిగా
నాఱిచె నన్ని లోకములు ♦ నన్ని దిశల్ మఱి యన్నిచోట్లు దా
ర్మ్రోఱయి కాడ్పడన్ బిడుగు ♦ రావముసైతము పుల్లగిల్లఁగన్. ౩౨౩

తే॥ పిడుగు వానలఁ బోలిన ♦ బెడిదపురాలు, గర్జనముచేసి వారిని ♦ గాంచి వగచు
వాఁడి శూలమున్ కాలుని ♦ పాఱఁజూచి, పండ్లు గీఁటుచు గుహఁబోలు ♦ వాయి దెఱచి.

చ॥ కడిమి నజేయమౌ బలము ♦ గల్గిన నా యురు రక్షణ స్థలిన్
గడఁక సమస్త జీవులను ♦ గ్రచ్చుఱఁ జంపితి నోర! మీరలే
కడుకొని వచ్చినార లిటఁ ♦ గమ్మని మాంసము నాకు లేమినో?
చెడువిధి త్రోవఁ జూపనో కో? ♦ చెచ్చెర నం చదలించి సవ్వుచున్. ౩౨౪

ఉ॥ అంబుద సంఘముల్ నుఱుము ♦ లై పడఁ గన్నులు విచ్చి చూచి యు
ల్లంబును మండ గొప్పమల ♦ లం బొడియై పడఁ గాలఁ దన్నుచున్
డంబగు బాలచంద్రు మెయిన ♦ డాల్గల కోఱలఁగీటు చార్చుచున్
బంబిన కిన్క ఱొమ్ములను ♦ బ్రచ్చెద నంచుఁ ద్రిశూలముం గొనన్. ౩౨౫

చ॥ అరిది తపోధికుండు ముని ♦ కద్ది యభీష్టమయ్యు సద్గుణా
కరుఁడగు రాముఁడా వనిత ♦ కంఠము ద్రుంచెదనంచు వింటవే
శరమును పూన్పఁడయ్యెఁ దము ♦ చంపుటకే బెడిదంపుఁ జెయ్వులన్
జరపుచునున్న దయ్యు నది - చానగదా యని యెంచె జాలిమై. ౩౨౬

ఉ॥ వెల్లని పండ్లు నెఱ్ఱనగు ♦ నింద్రుకలుంగల తాటకాఖ్య త
న్నెల్ల విధంబులం బొడువ ♦ నెంచి త్రిశూలము గొన్నఁ జంపఁగా
నొల్లకయున్న రాఘవుని ♦ యుల్లము దిట్టమెఱింగి వేదవి
త్తల్లజుఁ డిట్లనున్ మదిని ♦ తత్తఱ మందుచు రామచంద్రుతోన్. ౩౨౭

చ॥ ఇలఁగల పాప సంఘముల ♦ నెల్ల నొనర్చి రసంబులేని ప్రా
ణుల మని నిశ్చయించి మము ♦ నుగ్గుల నూచముచేసి మ్రింగఁగాఁ
దలఁకొన కుండ వీడినది ♦ తా నొనరింపక వెల్తియె యిదే
కల దిఁక నేమనం గలదు ♦ కామిని యే యన దీనిఁజెల్లునే? ౩౨౮

మ॥ త్రపయే ముఖ్య గుణంబుగాఁగలుగు కాం ♦ తా మాత్రముం జంపఁగా
నపహాస్యంబగుఁగాని వీర్యబల శౌ ♦ ర్య స్థైర్య తేజోయుతుల్
విపరీతస్థితి నొందువా రతివ పే ♦ ర్వెన్నంతనే భీతులై
చెప్పుమా మెచ్చుటఁ బౌరుషంబు నిలువ ♦ న్జేకూడు నీమీఁదటన్? ౩౨౯

తే॥ మఘవుఁడోడె సైన్యంబులు • మడియ దేవ, దైత్యులోడిరి దీని దో • ర్దండయుగము
మందరముఁ బోలునన నీక • మగతనమున, మగలయందు దీనికి భేద • మగునదేమి?

క॥ ఇఁక నీకుఁ జెప్పవలసిన, దొకటిగలదు వినుము • రఘుకుల • లోత్తంసమ! ము
న్నొక కాలంబున నడచిన, ప్రకటక్రమ సిద్ధియనుచుఁ • బలికెద మరలన్. ౩౮౨

చ॥ భృగుముని భార్య ఖ్యాతియను • పేర్గల వాలుగకంటి మానసం
బుఁ గరఁచు ప్రేమనూని దితి • పుత్త్రుల కొక్కెడ గొప్పసాయ మొ
ప్పుగ నొసరింపఁగా నెఱిఁగి • పూర్ణమతిం దన చక్రధారచేఁ
దెగఁ గొనె నామె ప్రాణములు • తెంపున దైత్య విరోధి యయ్యెడన్. ౩౮౩

తే॥ దేవ భూలోకములఁగల • జీవసమితి, యుల్లఁదనకు నోరెంబని • యెంచు కుమతి
కుమతియను పేరిదాని స • య్యామరవిభుఁడు, కులిశధారచేఁ దలఁద్రెంచి • కూలఁద్రోచె.

తే॥ అఖిల జగదభిరామ! క • ల్యాణధామ!, రామ! విష్ణువునకు దేవ • రాజునకును
వర్ణనీయమా కీరితి • వచ్చెఁగాక, దాన నొకనింద గలిగెనే • తలఁచిచూడుము. ౩౮౫

ఉ॥ నీరజలోచనా! విమల • నీరజమిత్ర కులాబ్ధిచంద్రమా!
సారమతిన్ నిజంబుగ వి • చారణసేయ బుధాళితో మహా
వైరముపూని ప్రాణివధ • పాటిగఁ జేయుచు ధర్మనాశముల్
దారుచు దానికిన్ మగత • నంబును గావలెనే వచింపుమా? ౩౮౬

చ॥ అరులకుఁ గాలుఁబోలు నని - హాస్తమునం గల వీర! బ్రహ్మ దే
ర్పఱచిన మాయువుం దెలిసి - పాడి మెఱింగి సమీక్షతోఁ గృతం
బరయుచు జీవసంతతుల - నావలి లోకము చేర్చువాఁడు గా
కెఱచికి దీనిఁబోలెఁ బసి- యెద్దినఁ జంపెడు కాలుఁడుండునే? ౩౮౭

తే॥ పెక్కుప్రాణులఁదనపొట్టఁ - బెట్టుకొనెడి, దుర్గుణముకంటెఁ జెడుగేది - దొరయఁగలదు
జడగలది మీసలేనిది - మడఁతి యనుచు, దీనిఁ దలఁచుట యవివేక - మే నిజంబు.

ఉ॥ న్యూనత నాశముం గనని - యుద్ధృత ధర్మము చెప్పినాఁడ నే
దీని వయిం జలంబుగొని - తీరుగఁ జెప్పెడివాఁడఁగాను నీ
మానసమందు జాలిపని - మానుము చక్కటికాదు రక్కసిన్
మానిని నాక యింకఁ బరి - మార్పుమ యంచు మునీశ్వరుం డనన్. ౩౮౯

చ॥ మునివచనంబు విన్న రఘు- ముఖ్యుఁడు వాకొను సత్యరూప! మీ
మనమున సందియంబు లేక - మానఁడు ధర్మ విరుద్ధ కృత్యమై
నను తగఁజేయ నాజ్ఞయిడ - నర్మిలి మీ నుడి వేదమంచు మే
ల్మిని పానరించు టేకద చ - లింపని ధర్మపథంబు మాకగున్. ౩౯౦

ఉ॥ భామిని రూపుఁదాల్చి దవ - వహ్నిని పోలిన తాటకాఖ్య గం
గా మధురాంబు పావన జ - గంబగు కోసలదేశమేలు రాట్
సోముని పుత్త్రుయత్నము క - డుర్ మదిఁగైకొని కీన్కఁ గన్నులన్
బ్రామిడి దూఁకు మంటలును - రాఁజఁగ శూలము ద్రిప్పివైచినన్. ౭౯౧

ఉ॥ క్రొత్త యముండసం దగిన ♦ కోమ్మ మనం బెరియంగ వైవఁగా
నెత్తిన శూల నామక ల ♦ యాగ్ని కడంక మునీంద్రు నాజ్ఞచే
జిత్తము నిశ్చలత్వమునఁ ♦ జెందఁగ నిల్చిన రామచంద్రుపై
కెత్తును నిండు చంద్రుపయి ♦ కేగెడు రాహువు పోల్కి నేగఁగన్. ౭౯౨

చ॥ ఇనకులవీరుఁ డా యదన - నే శరమెత్తుట కూర్చుటల్ శరా
సనమున నారి లాగుటయుఁ - జయ్యనఁగాంచిన వారులేరు కా
లుని కడనుండి లాగికొని - లోఁగక తాటక యేసినట్టి ము
మ్మొనలు గలట్టి వాలు పలు - ముక్కలఁ జూచిరి నేలపైఁబడన్. ౭౯౩

తే॥ ఇరులు మొగులును గలరంగు♦పరఁగు పడఁతి,యొక్క పలుకాడు సంతలో-నుదధినిండఁ
జేయు పెనురాలవాన వ-ర్షించె నదియు, రామ కోదండముక్త వ-ర్షమున నడఁగె. ౭౯౪

శా॥ నీలాంభోదనిభుండు రాముఁడు వడి - న్నిర్ణిద్రతన్ ఘోర శా
పాలాపంబును పోలు శాతశర మే - యన్ వజ్రశైలాంతర
స్థూల ప్రసరరీతి నొప్పు చెలి వ - క్షోదేశముం జొచ్చి వె
హేలాలీలను దుష్ట మూఢులకు జ్ఞా - నీంద్రోపదేశక్రియన్. ౭౯౫

చ॥ కనక నగేంద్ర ధీరుఁడగు - కార్ముకవీరు నిశాతసాయకం
బునఁబడి తాటకాఖ్య భువి - ద్రుంగుట దోఁచె యుగాంతకాల సం
జనిత మరుత్తతుల్ విసర - జంతు లయంబుగ నాకసంబు గ్ర
మ్మిన పెనుమేఘపుల్ పిడుగు - మించులతో భువిఁ బడ్డకై వడిన్. ౭౯౬

సీ॥ దుమ్మునిండిన యవ్వ - నమ్మొల్లర క్త ప్ర, వాహమ్ము లతిశయిం - పంగఁ బడిన
మెఱుపులకై వడి - మెఱసెడి కోఱలుఁ, బోట నోరును గల - తాటకాఖ్య
భువన విజయుఁడయి - పొలుపొందు రాక్షసే, శ్వరునకు మొదటి దు - శ్శకున మగుచు
నా దినంబున భూమిపైఁ దెగిపడ్డ సాం, పైన జయధ్వజ - మనఁగ నొప్పె

తే॥ అడవి మార్పడి కడలియా - నట్టురమున, శరముగాఁడి దూసిన త్రోవ - జాతి నల్ల
సంజనెత్తురౌ మిన్నూఁత - జాతి యవని, బడినదియుఁ బోలె వనమెల్లఁ బర్వెనప్పుడు.

సీ॥ కలికి క్రొవ్విరిదమ్మి - గద్దెనెక్కిన వానిఁ, బోలు కౌశికునాజ్ఞఁ - బూని నడపు
రత్నకాంచన భూషి - రాముని కన్నె క, య్యమున సాయుధహస్తు - లైన దనుజ

కులమువారల యసురుల నాశ భయపడి, సిగ్గిలి మఱి యాస - చిగురుత్త్ర
భ్రమయుచు నుండిన- జముఁడును నాఁడొక, మాత్ర చొక్కపు రుచి -మఱఁగినాఁడు
తే॥ మా నివాసంబులు మరల - మాకుఁదక్కె, క్రతువు నీకగు దివ్యాస్త్ర - తతు లితని
కిమ్మనుచు మునితో వచి - యించి సురలు, దండి గురిసిరి విరులు కో - దండిపైని.

౮. యాగపటలము. (౫౯)

ఉ॥ తీరగు దీవసల్ సలిపి - దేవత లేగఁగఁ బుష్పవృష్టిచే
మీఱి ప్రశాంతమై మరు - మేదిని దాఁటుచు లేమి పందనం
బేరు వహించు*దాసగుణ - పీరు సమోఘు మహార్థయుక్త వా
గ్ధారకు దీటుగల్గు విశి - ఖంబు లొసంగెను మూని వారికిన్ ౩౯౯

ఉ॥ శాంతుఁడు జ్ఞాని కౌశికుఁడు - సన్మతినిచ్చిన దివ్యబాణముల్
సంతత శుద్ధ మానసుఁడు - చక్కఁగఁజేసిన సత్కృతంబు జ
న్మాంతరమందు డోసి తన - యంతట వానిని చేరునట్లు సు
స్వాంతుని రాఘవుంగదిసెఁ - జయ్యన వేడ్క మదించి పైకొనన్. ౪౦౦

శా॥ వీరాగ్రేసర! నిన్ను చేరితిమి ని - స్వేడంగ లే మెప్పుడున్
గారామార విధించు కార్యములు చ - క్కంజేసి నీయొద్దకే
చేరన్ వచ్చెదు నీదు తమ్ముని క్రియన్ - జేయంగ నూల్కొందు మం
చారం బల్కు మహాస్త్రసంతతుల శ్రీ-మాంగుండు నెమ్మిం గొనెన్. ౪౦౧

తే॥ అంతరెండామడలు వార - లరుగ నచట, గొప్పశబ్దంబు వినబడ - గురు గుణుండు
రాముఁడిది యేమి యనఁగఁ గ-ర్మములు నీఁగఁ,దప మొనర్చిన మునిపల్లు-దానిగూర్చి

తే॥ మానసమునఁ బొడమి సర-యూనది యన, నొప్పి నిర్ఘరవినుతుల - నొందు దానఁ
గలియు గోమతి రవమని-పలికి యవలఁ, నడచి భవహారియగు నొక -నదిని చేర. ౪౦౨

—:కౌశికీనది వృత్తాంతము:—

సీ॥ దేవతాస్తుత్యమై - తెలివొందు నినది, వృత్తమేమని రఘు - పేరుఁ డడుగఁ
గౌశికుం డిట్లనుఁ -గమలగర్భుఁడు తొల్లి, పొందిన గౌరవం - బును జయంబు
గొనిన రారాజగు-కుశుఁడు స్వపత్నియం, దమరంగ నల్వురు - కొమరులఁగనె
వారు కుశాంబుఁడు - ప్రథితుఁడౌ కుశనాభుఁ, డాధూర్తజుఁడు వసు - వనెడువారు

తే॥ అందుకౌశాంబియందుకు-శాంబుఁడుండె,సమరేఁగుశనాభుఁడుమహోద-యంబునందు
అలరె నాధూర్తజుండు ధ - ర్మాటవిని గి, రివ్రజంబున వసువు కో - రికను నిలిచె

సీ॥ ఆ భూపతులఁ గుశ - నాభునకుంగల్గి, రలరెడు లలితవా - క్కులు ప్రవాళ
సుందరాధరములు - పొందిన సద్గుణ, వతులు నూర్గురు ప్రియ - సుతలువారు

* తిరువెణ్ణెయ్ నల్లూరి శడైయప్ప వాక్యములను పోలిన యస్త్రములను - అని మూలము.

గోముగా వర్ధిల్లి - కౌమరు ప్రాయమునొంది, యొకనాఁడు విహరించు - నుత్సుకతను
చెలులతోడ వనంబుఁ - జేరి క్రీడింప వా, యువు వారిఁగని మోహ - మొంది కుంది

తే॥ మావి పిందె బోల్కన్నుల - మగువలార!, మరుని గుడుసుపడిన పింటి ♦ మార్గణంబు
మదిని గాఁడి నొప్పించె నే ♦ మఱుఁగు చుంటిఁ, బెండ్లియాడుఁడి మిమ్ము నే ♦ వేఁడుచుంటి

సీ॥ అని వేఁడఁగా వార ♦ లా సమీరణుఁగాంచి, మాతండ్రి వేఁడుము ♦ మమ్ము తాను
దానపూర్వకముగా ♦ దయచేసెనేని నీ, కోరిక యపుడొందుఁ ♦ బార మనఁగ
గంధవహుండంతఁ ♦ గడఁకతో వారి పీఁ, పుల గూను గావించి ♦ పోవుటయును
కర కంకణ స్ఫుట ♦ కాంతులొలయ నడ, వఁగలేక వారలు ♦ పడుచు లేచి

తే॥ తండ్రికడకేగి యమృతంబుఁ ♦ దన్నునట్టి, గొనబు పలుకులతో నోరు ♦ కొతుకువడఁగఁ
బోలఁజెప్పఁగ నోదార్చి ♦ చూళి కొడుకు, బ్రహ్మదత్తున కతఁడు వా ♦ రల నొసంగె.

మ॥ చెలులన్ వేదిక బ్రహ్మదత్తుఁ డెలమిం ♦ జేపట్ట నక్కన్నికల్
లలితాకారము దాల్చి రాతని తపో ♦ లాభప్రభావంబునన్
జెలఁగన్ సూనుఁడు లేమికిన్నెపుఁడెదం ♦ జింతించి పుత్రేష్టి మా
నులచే వేల్పఁగ నందు గాధి కలిగెన్ ♦ బ్రోద్యత్తురంగాళితో. ೪೦౭

చ॥ సలువుగ రాజ్యమెల్లఁ గుశ ♦ నాభుఁడు గాధికి నప్పగించి య
క్కలల నిధి నాకలోకమున ♦ కుం జన గాధి మహోదయంబు స
ద్బలయుతుఁడై ప్రపాలన ము ♦ దారమతిన్ జరుపంగ గాధికిం
గలిగిరి మంతఁ గౌశికియు ♦ గాదిలి పుత్త్రుఁడు నేఁ గ్రమంబునన్. ೪౦౮

తే॥ అవలమాతండ్రి భృగుపుత్త్రుఁ ♦ డైన బుచికు, నకుఁ బొసంగఁ గుమారిఁ గౌ ♦ శికినొసంగఁ
గొన్ని యేండ్లు త్రివర్గముం ♦ గోరి తనిసి, తపముచే సత్యలోకం బు ♦ నందు చేరె. ೪౦౯

చ॥ పతి గగనంబు త్రోవ నడు ♦ వన్ విరహంబు సహింపలేక త
త్సతి నదిరూపుగొంచు భువి ♦ దారిని వెన్దవులంగఁ గాంచి త
త్పతి బుచికుండు భూ జనుల ♦ బాధలఁ దొలుచునుండు మాపగా
కృతిఁగొని యంచు నాజ్ఞయిడి ♦ యేగె విరించిపదంబు చేరఁగన్. ೪౧౦

ఉ॥ సోదరి నిమ్నగాకృతి వ ♦ సుంధరయందు వసించె నంచు స
త్యోదర మొప్పఁ గౌశిక మ ♦ హాముని పల్కఁగ విస్మయంబు స
మ్మోదము నెంది రాఘవులు ♦ ముచ్చటఁ గొంత పథంబుపోయి యం
భోదముఁ గ్రమ్మియుండు వన ♦ ముం గని యెవ్వరి దంచు వారనన్. ೪౧౧

## వామనచరిత్రము

సీ॥ మాని యిట్లను భువి ♦ లోన మానినులకుఁ, బతికంటె గొప్ప దై ♦ వంబు లేద
యనెడు పతివ్రత ♦ మనసుఁ బోలిన పరి, శుద్ధ విషయమిది ♦ శ్రద్ధవినుము

వేద సంతతికిని • విబుధుల బుద్ధికి దక్కనివారి కం • దకయె యుండఁ
గమల నాభుఁడు కొంత • కాలంబు దుష్కర, తప మొనరించిన • తానమిద్ది

తే॥ అమరులును భూజనములు బం•ధములనీఁగ, వాని శ్రీనామమే నోటఁ•బలుకుచుండ్రు
వాని కపటనాటక మెన్న•వశముగాదు, అతని నుతియించు ఫలము శ•క్యంబె తెలియ.

తే॥ కడకఁ దపియించె నూఱు యు•గంబు లిచట, నాదినంబుల భూగోళ•మమరు దంత
ములనుగల పోత్రిఁబోలిన • బలియుఁడైన, బలి వశము చేసికొనియె ది•వంబు భువము

తే॥ శంక యొక్కింత మదిలేక • జరగు జాత, యురు తపశ్శాలి సురలకు • సరిదియైన
మఖము నెఱవేర్పఁబూని సమస్త భూమి, నేల వేలుపులకు నీయ • నిశ్చయించె. ౪౧౪

తే॥ జరుగుచున్నది యెఱిఁగి ని•ర్జరులు హరిని, గలిసి కేల్మోడ్చి ప్రార్థించి•బలి యొనర్చు
కొడిమెలం దొలఁగించి చే•కూర్చు సుఖము, శాంతి యన నతఁడటు చేయ•సమ్మతించె.

ఉ॥ శ్యామల వర్ణుఁడుం మహిత - సాత్త్వికుఁడైన రమేశుఁ డంతఁ ద
త్త్వామలవేది మూఁడు సమ - యంబుల చర్య లెఱుంగువాఁడు దై
త్యామర తాత కశ్యపున - కర్మిలి పుత్త్రికుఁడై జనించి తా
వామనుఁ డయ్యెఁ దింత దలఁపన్ వటబీజము న్యాయ మొప్పఁగన్. ౪౧౫

సీ॥ ఒప్పారుచేష్టలు - ముప్పూరి జందెంబు, మొలయందు మౌంజియుఁ - గలుగువాఁడు
వేదముల్ విస్పష్ట - విధిఁ బల్కు నాల్కయుఁ, గరమునం దగ్నియుఁ - గలుగువాఁడు
జ్ఞానులకే యెఱుఁ - గం దగ్గ తనదు చి, ద్రూపాభ మౌనొక - రూపుదాల్చి
యరుదెంచు వామను - నాగమనంబును, త్రిభువన జేతయు - ధీరుఁడు బలి

తే॥ యెఱిఁగి యచ్చెరువంది ము-న్నెదురువచ్చి, కొంచుఁబోయి పూజించి సద్గుణగరిష్ఠ!
నిన్ను బోల్విప్రులును లేరు - నన్నుఁ బోలు, ధన్యులును భువి లేరని - తనియఁ బలికె.

తే॥ అంత నమిత వివేకియై - యలరు గుజ్జు, యాచకులు కోరుకంటె న - ధ్యధిక మొసఁగు
దీర్ఘభుజ! నీకడకు నేగు - దెంచునట్టి, వారె భాగ్యయుక్తులు; రాని - వారు కారు.

తే॥ అనుచు వచియింప నలరి యా-దనుజరాజు, వలసినది యేది తెలియంగఁ-బలుకుఁ డనిన
నెనరు కలదేని ముయ్యడుగు - నేల వలయు, ననినయంత నిచ్చితి నని - యనుట తోడ

చ॥ కవి కొడు కిట్లు పల్కునిది • కైతవవేషము నమ్మఁబోకు దా
నవకుల చంద్ర! భూసురుఁడు - నల్లని మేఘముఁ బోలు నొక్క మా
నవుఁడని గుజ్జురూపని య - నంజన దెల్ల యజాండ గోళముల్
తవిలి యొకప్డు తుందమున - దాల్చిన యాతఁ డెఱుంగుమా యనన్. ౪౨౦

తరల॥ దనుజదేశిక! మత్కరంబది - తద్దయుం బయిఁ గ్రాలఁగాఁ
దనకు నొప్పనిరీతి మిక్కిలి • తాఁటి యుండును ధన్యుఁగా

నెన యెఱుంగని నీలవర్ణుని ♦ యిందిరేశుని శ్రీకరం
బనఁగ నాకీక నంతకంటె మ - హాత్మ! మేలెది చూడుమా! ౪౨౧

తే॥ వలయువారలు వలవని - వారటంచుఁ, గనక నిర్ణయించిన యీవి-ఘనుల కొసఁగఁ
దగినదని ధర్మ తత్త్వవే - త్తలు వచింతు, రితనికి సమాను లధికు లెం - దేని గలరె?

ఉ॥ ఒత్తుగ మేన వెల్లఁదన - మొందిన వాఁడవు గాన నంటె ని
ట్లుత్తములైన దాతలకు - నొప్పుగ నీయఁగరాని వంచునే
పొత్తమునందు గల్గు నెని! - బొందిని తీయని ప్రాణమైనఁ దా
నెత్తిడి వేఁడు కెగ్గు మఱి - యిచ్చుట లగ్గు తలంచి చూడుమా! ౪౨౩

ఉ॥ చచ్చినవారు లోకమునఁ - జచ్చిన వారలుకారు ప్రాణముల్
నొచ్చి నగంబు చచ్చి కయి - నూల్కొనఁ జాఁచుచు వేఁడువారలే
చచ్చినవారు నిక్కముగఁ - జచ్చినవారలు లేచిరారు పై
నిచ్చినవారు గాక యిల - నెవ్వరు సుస్థిరులో వచింపుమా. ౪౨౪

ఉ॥ పెచ్చు నిరాపనిందలను ♦ పెంచెడువారలు కారు శాత్రవుల్
ఇచ్చెడు వారిఁజేరి తగ ♦ నీయకుఁడీ యను వారె శాత్రవుల్
నిచ్చలునట్టిరే తమకె ♦ నిక్కము చేటొనరించు కొన్న వా
రిచ్చుట మాపుకంటె మఱి ♦ హెచ్చగు పాపములేదు ధారణిన్. ౪౨౫

ఉ॥ పెద్దల వాక్యముం దలఁచి ♦ పెచ్చుగ ద్రవ్యము చేత నుండఁగా
నెద్దడి నొచ్చువారలకు ♦ నిచ్చి యశంబు గడించి ధర్మముం
దద్దయు నాచరించి భవ ♦ ధన్యతఁగాంచెడు వారిఁ జేరి పే
రొద్దిక లోభమున్ విడకుఁ ♦ డో యను దుష్టులె వొడ్డశాత్రవుల్ ౪౨౬

తే॥ నయము లేని యాచార్య!దా♦నమును చెఱచు,కృపణ!యొక్క రొకరికె త్తి♦యిచ్చుచుండ
భంగపఱచుట దగునె? నీ♦బంధు సమితి, కూడు గుడ్డయులేక య ♦ ల్లాడుఁగాక! ౪౨౭

తే॥ అని పలికి మంత్రిదుర్గుణుఁ♦డనుచు నెంచి, యాతనిని లెక్కగొనక మూఁడడుగులిలను
నీవె కొలుచుకొమ్మని చెప్పి ♦ నీటిధార, బలి త్రివిక్రము చిన్ని చే ♦ తులను విడిచె.

చ॥ విమల సరోజలంబు బలి ♦ వీడిన ధార బిరాన చిన్ని హ
స్తములను పడ్డమాత్రఁ దలి ♦ దండ్రులె నవ్వఁగఁదగ్గ గుజ్జు త
న్నమరఁగఁ జూచువారలు భ ♦ యంబును విస్మయమున్ భజింప ను
త్తములకుఁ బ్రేమతో నొసఁగు ♦ దాన ఫలంబు విధాన వర్ధిలెన్. ౪౨౮

ఉ॥ ఊనిన పాదమొందు విపు ♦ లోర్విని నిండుచుఁ బిన్నదిద్దియం
చే నిజ మవ్వలం గడచి ♦ యేగదు; మిన్ను సమస్త మొక్కటన్

బూని యడంచి స్వర్గపద ♦ ముం గొని దానిని దాఁటి యవ్వలన్
మానిత రీతి నేగుటలు ♦ మానెను సుంతయుఁ జోటు లేమిచేన్. ౪౩౦

ఉ॥ రెండు పదమ్ములన్ నెలువ ♦ గించి సమస్త జగమ్ముఁ గొల్చి బ్ర
హ్మాండమునందు మూఁడవ ప ♦ దాశ్రయ మెచ్చట లేమి దానికిన్
నిండు ప్రియంబు గల్గు బలి ♦ నెత్తిమె తావలమయ్యె వింకె కో
దండ ధరాగ్రణీ! ప్రథిత ♦ దైత్యవిరోధియుఁ బిన్నవాఁడె కా! ౪౩౧

ఉ॥ నల్లనిసామి యింద్రునకు ♦ నల్వగుఁ గా కని యీ జగత్త్రియిన్
జల్లఁగ మేటి యేలుబడి ♦ నల్ప నొసంగి జగంబుఁ గొల్చి రా
జిల్లి శ్రమించు పాదములు ♦ చేత రమాసతి తాఁకు రక్తిమన్
జెల్ల మహా గభీరిమను ♦ చెందిన పాల్కడలిన్ బరుండెఁ దాన్. ౪౩౨

చ॥ అరుదగు కర్మపాళి మొద ♦ లంట నశింపఁగఁ జేయు రామ! యీ
పరమ పవిత్రవనా వనము ♦ బాధ రతిం గను వారు జన్మదుః
ఖ రహితులై చెలంగుదురు ♦ కాంచుమ వేద వచోనుయుక్తి నా
కిరవుగ యాగముం జలుప ♦ నిద్దియె యిమ్మ మఱొండు లేదికన్. ౪౩౩

శా॥ ప్రారంభించెద జన్న మివ్వనమునన్ ♦ రండంచు సిద్ధాశ్రమం
బారం జేరుచు విఘ్నముల్ దొలఁచి త ♦ ద్యజ్ఞంబుఁ గాపాడఁగా
మారాకారుల రామలక్ష్మణులఁ బ్రే ♦ మ న్నిల్పి యజ్ఞీయ సం
భారంబుల్ సమకూర్చి కొంచుఁ దొడఁగెన్ ♦ మునీంద్రుఁ డుద్యాతియై

## యాగరక్షణము.

ఆ॥ మన్ను మిన్నుఁ గాచు ♦ మన్నిని కొమరులు, విన్నవారిఁ గూర్చి ♦ యెన్నఁ జేయ
నరిదియైన వేల్మి ♦ నాఱు నాళ్ల రసిరి, గన్నుఁగాచు ఱెప్ప ♦ కరణిఁ గాచి. ౪౩౫

తే॥ తిరుగుచున్న నగంబుల ♦ తెఱఁగుఁ దెలుపు, రాఘవులలోనఁ బెద్ద, స ♦ ర్వజ్ఞుఁడైన
గాధిజుం గాంచి యావిఘ్న ♦ కారులైన, యసుర లెప్పు డిటకు వత్తు ♦ రనుచు నడిగె.

తే॥ మానియై జటి మాటాడఁ ♦ బూనఁ డయ్యె, వీరవరుఁడు రాముఁడు ప్రొక్కి ♦ వినతితోడ
వెనుదిరిగి మిన్ను చూడంగఁ ♦ బిడుగు ప్రోఁత, బిడియపడ వినవచ్చెను ♦ వికటరవము.

తే॥ గుప్పిరేసిరి విసరిరి ♦ నిప్పునీరు, గురిసి రద్రులఁ బెకలించి ♦ దొరలవైచి
రఱచి రదలించి తిట్టిరి ♦ మొఱకులపుడు, పరశువులవైచి మాయలు ♦ పఱపినారు.

తే॥ ఏచి కోపించి యేయఁగా ♦ నెఱచి కఱచు, కొనినయాయుధములు కాల్కొ ♦ గుఱ్ఱుగురియు
కరణి వనమెల్ల విరియ రా ♦ క్షసు లంతఁ, గదలి మింటిఁ గప్పె ననఁగఁ ♦ గ్రమ్మినారు.

చ॥ మెఱసెడి కత్తులుం గదలు - మిక్కిలి వైచుచుఁ బెక్కువాద్యముల్
మొరయఁగఁ జేయుచున్ బిడుగు - మొత్తములంబలెఁ గంటగింపుగా
నఱచుచు దైత్యులేచుట యు - గాంతమునన్ మహి ముంచ నెంచి మి
న్నొరసి పగిల్చి కొంచుఁ దగు - నుద్ధతివచ్చు మొగుళ్లు నాఁ దగెన్. ౪౪౦

ఉ॥ కోఱల జంటలొప్ప మిడి - గ్రుడ్లను ద్రిప్పుచు రక్తరోమముల్
మీఱఁగ వెలుంగ నోడు బిగి - మోకొన నిప్పులు గ్రక్కఁజూచుచున్
బాఱుచు వచ్చువారు ముని - వంద్యుఁడు పల్కిన వారె యంచు నా
వోఱకులన్ రఘూత్తముఁడు - మున్కొని తమ్మున కొందఁ జూపఁగన్.

ఉ॥ కాంచిన లక్ష్మణుండు కడ - కన్నుల నిప్పులు రాల మింట ను
గ్రాంచిత రీతిఁజూచి తన - హస్త శరాసముఁ గాంచి రాఘవా!
మించిన క్రూరరాక్షసుల - మేనుల కండల తుండ్లు గండ్లు గా
న్పించఁగఁ గొండలై పడుట - నిక్కము చూచెదుగాక యిప్డనన్. ౪౪౨

తే॥ అనుడు నీటెలఁ బట్టిన - యసురవరులు, వైచు రక్తమాంసమ్ములు - పడఁగనీక
కాండముల నేసి పైకప్పు - గప్పివైచెఁ, నిండుగా రాముఁడా హోమ - కుండమునకు.

ఉ॥ హాలహాలంబు పొంగి జగ - మంతట మాపఁగ రేగునంతలోఁ
జాల వడంకి నిర్జరులు - చంద్రధరున్ శరణంబు నొందు నా
పోలిక మానులెల్ల భయ - ముం గొని సద్గుణధాముఁజేరి యో
నీలశరీర! యెట్టులును - నీవె శరణ్యము వేఱు లేదనన్. ౪౪౪

చ॥ మదిని కలంక నొందకుఁడు - మానిజనోత్తములార! యిప్డె యి
య్యది తొలఁగింతు నంచభయ - హస్త మొసంగి గుణంబు కర్ణమున్
గదియఁగ లాగి రక్తమయ - కంధిగ భూమి నొనర్చి వీరతన్
గుదులుగఁ గూర్చి రాఘవుఁడు • కూల్చె నిశాచర మూర్ధశైలముల్. ౪౪౫

తే॥ కమలనేత్రుడు దివ్యాస్త్రంబు - కఱకు బెడిదు, రాలు తాటకగన్న పు• త్రకులలోన
నొకని నంభోధిలోవైచె - నొకనిఁబట్టి, విందుగాఁగఁ గాలాంతకు - వీటి కనిపె. ౪౪౬

మ॥ వనమాలా ధరుఁడైన రాముఁడు వడిన్ - బాణావలిన్ దక్కియు
న్న నరాశి ప్రకరంబుపై విడువ నా - నారాచముల్ మిన్నుగ
ప్పినఁ గాకుత్థ్సులు పీన్గు కొండలపయిన్ - వేయెక్కి చంపం గలా
రని చెల్లాచెదరయ్యె దైత్యబలముల్ - ప్రాణంబులం గాచుకోన్. ౪౪౭

క॥ పిడుగుల వలె బెడిదములై, విడువక రామాస్త్రవితతి - వెన్నంటంగా
విడియుచు మొండెము లాడెను, గడుకొని గ్రద్దలు పిశాచ • గణము నుతించెన్.

ఉ॥ ప్రబ్బిన పుష్పవృష్టియట - గ్రద్దల పందిరిఁ జిల్చు క్రౌంచు బ
గ్గాబ్బున రాలె నంబునిధి - ఘోషణముంబలెఁ దూర్యరావముల్
మబ్బులు గ్రమ్మెఁ గెఁ బాకబల - మర్దన ముఖ్యులు గుంపుగూడి పే
ర్వబ్బున వచ్చి రామునకు - నున్నతి నిచ్చిరి మేటి దీవనల్. ౪౪౯

చ॥ పరమ పునీతులైన ముని ♦ వర్యులు గంధ సుమాక్షతంబులన్
శిరములఁ జల్లి దీవనలు ♦ చేసిరి తద్వన వృక్షజాలముల్
విరులను రాల్చె మౌని జన ♦ వీరుఁడు కౌశికుఁ డంత యజ్ఞమున్
గురుతర శాస్త్రపద్ధతిని ♦ గోరిక దీర ముగించి యిట్లనున్. ౪౫౦

చ॥ అఖిల జగంబులన్ మొదట ♦ నావర మొప్ప సృజించి పిమ్మటన్
నిఖిలము కడుపులోపలనె ♦ నించుచుఁ బెంచెడు నీవు పూని యీ
మఖమును గాచుటెచ్చుగునె? ♦ మన్ననతో నిట కేగు దేర నా
సుఖతర భాగధేయ మది ♦ చొక్కము గొప్పది యంచు నెంచితిన్. ౪౫౧

చ॥ అనవుడుఁ బుష్పముల్ ఫలము ♦ లందము గూర్పఁగ వృద్ధిఁ బొందు వృ
క్ష నికరముల్ చెలంగి కడుఁ ♦ జలనయైన వనంబునన్ మహా
మునులను గూడియున్న గుణ ♦ పూర్ణుఁడు రాముఁడు మౌని కౌశికుం
గని యిఁకఁ జేయఁగాఁ దగిన ♦ కర్జము మాకెది తెల్పుఁడీ యనన్. ౪౫౨

ఉ॥ నే నరుదన్న వే యయిన ♦ నీ కరుదైనది యొండు భూమి లే
దైనను గొన్నియున్న యవి ♦ యావలఁ జూతము నీటియేర్వ మా
గానియు చూడ నెల్లెడలఁ ♦ గ్రమ్మిన యమ్మిథిలా పురావనీ
జాని యజించువాఁ డతని ♦ జన్నము చూతము రండు లెండనన్. ౪౫౩

## ౫. అహల్యా పటలము. (౧౬)

సీ॥ మంచి దనఁగ వార ♦ లంచిత గతి మువ్వు, రును మిథిలాపురి ♦ త్రోవఁ జనుచు
సమల రత్నశ్రేణి ♦ యగురు చందనము గం, దంబొప్పు పులిన త ♦ లంబు లనెడి
వక్షోజములును లేఁ ♦ బ్రబ్బలి తీఁగలన్, మధ్యంబు నూత్న సు ♦ మప్రతాన
మనుమేఖలయు గొన♦ బగునల్ల యిసుకయన్, కొమ్మడి శైలంబుఁ♦బమ్మివచ్చు

తే॥ కాల్వలను గజ్జెల రొదలు ♦ గలుగు కాళ్ళు, చెలఁగి చెలువంబుచేత న♦చ్చెరువు గొలుపు
శోణనదియను తెఱవను ♦ చూచివారు, మేరమీరిన రహిఁ దరిఁ ♦ జేరినారు; ౪౫౪

సీ॥ అంత భాస్కరుఁ డుదయ ♦ మాన నిచ్చిన చల్లఁ, దనము జగతి కిచ్చు ♦ తలపు గలిగి
జీవులఁ దపియింపఁ ♦ జేసెడి తనమేని, వేఁడిమి తగ్గించు ♦ వాఁడపోలె
నరుణుని నయనంబు ♦ లరుగుట కంటెను, ముందంజ వైచుచుఁ బోవు హరులఁ
గట్టిన యొంటి చ ♦ క్రపుఁ దేరితో నేగి, పడమటి కడలిలో♦పల మునింగె.

తే॥ జల్లనగు నీటిపట్టుల ♦ జలజగృహము, దళములను తలుపులు మూయఁ ♦ దలరి గండుఁ
దేంట్లు పెంట్లతోఁగూడి యే ♦ తేర ననువు, వెలయు నొక తావి వనమున ♦ విడిసినారు

ఇంద్రునకు దుర్వాస శాపము

తే॥ ఈ వనం బేరిదని పాముఁ ♦ దెలుపు నదుగఁ, గడఁగి గురు తపోధనుల దగ్ధ ♦ కర్ముఁడనియె
మున్ను దితియను కశ్యపు ♦ ముదిత యిచటఁ, దన కుమారులకై కుంది ♦ తపమొనర్చె

శా॥ ఈ లోకంబుల కావలన్ వెలసి మ ♦ మ్మింపారఁగా నేలు మా
లోలుం డున్నెడఁ జేరి సన్నియతిమై ♦ లోలాక్షి విద్యాధర
స్త్రీలం దోర్తు భజింపఁగా నలరుచున్ ♦ శ్రీలక్ష్మి ప్రత్యక్షమై
రోలంబ ధ్వని యొప్పు పుష్పసరమా ♦ ప్రోద్దాలి కిచ్చెన్ రహిన్. ౪౬౭

ఉ॥ ఆ సుమమాల విద్యయకు ♦ నాదటఁ జుట్టి విరించి లోకముం
దాసిఁ గాంచి కట్టెదుట ♦ దయ్యని కిన్కఁ దావలంబు దు
ర్వాసుఁడు లక్ష్మి సన్నిధిని ♦ శ్రావ్యసుగీతము లాలపించు నం
చా సకి కంజలిం జలిపి ♦ హర్షముతో వినుతింప నామెయున్. ౪౬౮

ఉ॥ లోకములన్ సృజించి కృప ♦ లోఁ గొని కాచుచు వెల్వరించు నా
శ్రీకరు వక్షమందున వ ♦ సించి సమస్తముఁ గాంచు తల్లి యా
స్తోక ముదంబునన్ జడను ♦ చుట్టిన మాలిక నా లతాంగి వే
కై కొనుమంచు నామునికి ♦ గారవ మార నొసంగి నంతటన్. ౪౬౯

ఉ॥ వేడుక లోకమాత తన ♦ వేణిని దాల్చిన మాలఁగాంచి నా
పోడిమి దొడ్డదంచుఁ గొని ♦ మోదముచే గరుపారు మేనితో
బోడ జటన్ ధరించి భవ ♦ ముల్ పొనుఁగొంది విముక్తిగాంచు మే
ల్జాడ యిదంచు వేడ్కమెయి ♦ స్వర్గపురంబును డాయఁబోవుచో. ౪౭౦

సీ॥ రజతమయంబయి ♦ రాజిల్లు సుందర, నగముపైఁ గురియు కా ♦ ర్మొగులు వెలసి
చెందామరలు వేయి ♦ చెలువుగా వికసింప, నెఱ్ఱని వెలుఁగుల ♦ నెనయు నినుని
కాంతి నొందినరీతిఁ ♦ గ్రాలుచుఁ బొలుపారు, తనువుతో నైరావ ♦ తంబు నెక్కి
చెలఁగు రుచిని నేని ♦ చేదుగా నొనరించు, లలితవాక్కులుగల ♦ లలనలైన

తే॥ రంభ మేనక మున్నగు ♦ కుంభకుచలు, చిత్తజుని శరావళుల వ ♦ ర్షించు తూణ
ముల నెనయు పదకిసల నూ ♦ పురములులియ, నాడుచును పాడుచును మ్రోల ♦ నరుగుచుండ

సీ॥ బలు నీలగిరి కిరు ♦ వలఁకుల నిలసిల్లు, జ్యోత్స్నయనా నొప్పారు ♦ సురఁటు లొలయ
జాబిల్లి దిగివచ్చి ♦ జానొందె ననఁజెల్లు, ధవళాతపత్త్రంబు ♦ తనరుచుండ

పటహాకాహళ శంఖ ♦ పణవాది రవములు, తెలిచయి వంది గీ ♦ తములు ముంప
వేద చతుష్టయ ♦ నాద ముప్పొంగెడి, యంబుధి ఘోషంబు ♦ ననుకరింప.

తే॥ జగములను మ్రింగ వచ్చెడు ♦ పగిదిఁదోఁచు, నుత్సవ ప్రాభవముఁగాంచి ♦ యుబ్బి యబ్బు
రంబు గొని తానుదెచ్చిన ♦ ప్రసవమాల, కేలఁగొని హరికేయ నుం ♦ కించుసంత. ౪౬౩

తే॥ దాని దోఁటితోఁ గొనుచుఁ జే ♦ దంతి మెడను, నగవిభేది వైచుచును పు ♦ న్నాగమంతఁ
దాడిఁ బోలిన కరముతో ♦ దాని లాగి, కాలితోఁ ద్రొక్కి వేఁడయా ♦ కరణి నలఁచె.

ఉ॥ మున్నె కటూగ్రకోపి తన ♦ ముందటనే యటు లౌటఁ గాంచి తాఁ
గన్నుల నిప్పుకల్ వెడలఁ ♦ గ్రక్క నజాండచయంబు బూదియై
చెన్నఱు నంచు నిచ్చి పఱ ♦ చెన్ సురసంఘము సూర్య చంద్రులుం
దెన్నులు దప్పఁ గప్పఁ దమి ♦ దిక్కులఁ దల్లడ మందె లోకముల్. ౪౬౪

ఉ॥ ఊరుపులందునుండి పొగ ♦ లొక్కట లేవఁ బురారి యట్ల హా
సారవ లీల నార్చి నగె, ♦ యాననమందు బొమ లుమ్మడు ల్వడన్
బారలుగాఁగ నాలుకలు ♦ పర్వెడి యుజ్జ్వలితాగ్నిఁగ్రక్కు ను
గ్ఘోర కఠోర నేత్రముల ♦ తోఁ బురుహూతుని గాంచి యిట్లనెన్. ౪౬౫

శా॥ ఓరీ క్రూర! సురాధమా! తులువ! నీ ♦ యుద్వైభవం బెంత? లో
కారాధ్యుండును లోకనాయకుఁడు లో ♦ కాధారుఁడౌ విష్ణు వ
క్షోరంగంబుననుండు లక్ష్మి జడలో ♦ సొంపొందు నిర్మాల్య నే
నారం బొందితిఁ బూర్వ జన్మ కృత పు ♦ ణ్యప్రాప్తి గర్వాంధుఁడా! ౪౬౬

ఉ॥ నీ యురు వైభవంబు గని ♦ నీకిది తగ్గది యంచు నేఁడు మో
దాయత బుద్ధినై యొసఁగ ♦ నంత యలక్ష్యము చేసినాఁడవే
మాయురె! నీదు పెన్నిధులు ♦ మంగళ సంపద లెల్ల నంబుధిన్
మాయును గాతఁ గుంది యిడు ♦ మ ల్గడు నొందుదు గాక దుర్మతీ! ౪౬౭

మ॥ అని దుర్వాసుఁడు శాప మిచ్చుడును రం ♦ భాద్యప్సరోవర్గముల్
బెను లిబ్బుల్ వెలి మాపు కామగవియున్ ♦ వేగంటి చౌదంతి స్వ
ర్వాస భూజాదికముల్ సమస్తమును సం ♦ రంభంబుతోఁ జేరెఁ బో
ఘన విస్తార తరంగ ఘోష యుతమౌ ♦ గంభీర వారాన్నిధిన్. ౪౬౮

మ॥ కడు కిన్కం గల మౌనిశాపమున స్వ ♦ ర్గంబాది లోకంబు ల
ట్లుడికెన్ లేవడి చీడ పట్టినటులై ♦ యుగ్రత్వముం జూప న
ప్పుడు నాకౌకసు లద్రిజారమణు నం ♦ భోజాసనుం గూడి పా
ల్కడలిం జేరిరి మాధవుం గని మొఱ ♦ ల్గావింప దైన్యంబుతో. ౪౬౯

తే॥ కమలజుండును త్రిదశులు ♦ కఠినుఁడైన, మునివలన నైన కష్టముల్ ♦ వినిచి మాకు
నీచరణము లే శరణముల్ ♦ నీరజాక్ష!, యనుచు వేఁడఁ ద్రివిక్రముఁ ♦ డనియె నిట్లు.

## క్షీరసాగర మథనము.

చ॥ కలఁగక మందరంబు తగు ♦ కవ్వము వాసుకి త్రాడు నిండు జా
బిలి తరిగంబమై తనర ♦ వేలుగ వేలుగ దేవ దానవా
వలి యిరు ప్రక్కల న్నిలిచి ♦ పాల్కడలిన్ జిలుకుండి యోషధుల్
దళముగ వైచి వెన్నపడు ♦ దాఁకను పూనిక వీడకుండఁగన్. ౪౭౧

ఉ॥ మేమును వత్తు మచ్చటికి ♦ మీరు బిరానఁ బదండి యంచు ల
క్ష్మీ మహిళా మనోహరుఁడు ♦ మేకొని పల్కఁగ నింక నెవ్వ వే
యామడ లోఁడి పాతెనని ♦ యానిన నమ్మికచే ముదంబు నె
మ్మోములఁ దోఁప వేలుపులు ♦ పోయిరి పాడుచు నాడుచున్ రహిన్. ౪౭౨

ఉ॥ లీలగ మందరంబుఁ బెక ♦ లించిరి వాసుకిఁ జుట్టినారు జే
జేల పసాదము న్నిలువఁ ♦ జేసిరి కంబముగా మహౌషధుల్
కేలను గ్రల్లగించు కడ ♦ లిం బడవైచిరి చిల్కి రంబుధిన్
నేల చలించె శేషుఁడును ♦ నెమ్మెయిఁ గుంచె సహించలేమిచే. ౪౭౩

చ॥ అరయఁగ ధర్మహీన హృద ♦ యంబులఁ జేరని కేశవుండు మం
దరమును వీఁపుపైఁ దిరుగఁ ♦ దాల్చి బలిష్ఠ ఫణీంద్ర రూపుఁడై
గిరి నిలువంగ మోచి వెయి ♦ కేలు గడల్కొనఁ జేసి మాని యిం
టరమునఁ బోయిపట్టివి క ♦ డంక ఫలింపఁగఁ జేసె నర్తతిన్ ౪౭౪

చ॥ మఱఁగిన సంపదల్ మరల ♦ మమ్ము కృపామతి నేలువానిచే
దొరకెఁ బరస్పరంబు పగ ♦ దోఁచె సురాసురకోటి కంత శ్రీ
వరుఁ డొక మోహినీ రమణి ♦ వాలక మూని సురారులన్ భ్రమం
పఱపుచు మోసపుచ్చె సుధ ♦ వారక మెక్కిరి వేల్పు లంతటన్. ౪౭౫

చ॥ బెడిదపు టాలమున్ శశిని ♦ భీమునకున్ సురభూరుహంబుతో
బెడఁగగు వస్తువుల్ శిఖరి ♦ భేదికిఁ దక్కిన సంపదల్ ప్రియం
బడర సురాళి కిచ్చి కమ ♦ లాలయ లక్ష్మిని కౌస్తుభంబు మై
వడిఁ గయికొంచు మాధవుఁడు ♦ పైనము చేసెను వైనతేయుపై. ౪౭౬

ఉ॥ అంత దురంత చింత దితి ♦ యందుచు నెమ్మది లేక భర్తనే
కాంతమునందు గాంచి తన ♦ హస్తములన్ ముకుళించి నా సుతుల్

వంతల నొందిఁ కుంది వసి ♦ వాడి నశించిరి దేవసంచనక్
బంతముతోడ వారిఁ జెఱు ♦ పం దగు పుత్త్రుని నాకొసంగవే. ౪౬౭

చ॥ అనవుడు కశ్యపుం డను ద ♦ యామతి నీకొక సూనునిచ్చితిక్
జనిగొని భూమి కేగి వెయి ♦ వత్సరముల్ తపమాచరింపు మ
ట్లొనరిచితేని నీదు వర ♦ ముత్కటరీతి ఫలించునన్నఁ బ
త్న్యనుమతి నామె భూమిని మ ♦ హా తపముం బొనరించె నిష్ఠమై. ౪౬౮

చ॥ అది విని వాసవుం డడలి ♦ యామెకు సేవ యొనర్ప నేగి వే
కుదిరి తదీయకార్యమునఁ ♦ గొండొక దోసము గాంచి మెల్లఁగా
నుదరము చొచ్చి యాకరువు ♦ హా యను 'మారుద' యంచు నేడు తుం
డ్లదయతఁ ద్రుంచి తునుకలకు ♦ నొల మరుత్తు లనంగఁ బేరిడెక్. ౪౬౯

తే॥ ఈ స్థలం బిట్టి దచట మ ♦ హేశ్వరునకుఁ, బార్వతికిఁ గల్గి వాయువు ♦ వలన గంగ
వలన భరియింపఁగా రాని ♦ బలియుఁడు గుహుఁ, డడరు శరవణ మది యని ♦ నుడువుచుండ

చ॥ యమ తను కాంతులం దెగడు - నచ్చపుఁ జీకటులం దొలంచి లో
కములను గాచు వేవెలుఁగు - కాంచనచేలుని నాభియందు మొ
ట్టమొదట బ్రహ్మ యుప్పతిల - డంబుగఁ బుట్టిన తమ్మివోలె సం
దము గల తేరితో విలస - నంబుగఁ బుట్టెను నీల నీరధిక్. ౪౭౦

సీ॥ పొసఁగఁ ద్రిమూర్తులఁ - బోలిన గాధిజ, రామలక్ష్మణు లంత - రయము మీఱఁ
గదలి మెట్టని కనుల్ - గల వృషభేశ్వరు, నెక్కిరింతగ మఱి - చక్కముగను
పడసిన శంభు క - పర్దంబునుండి నిం, డిన మకరందంబు - చినుకు రేల
పూల నీడ్చుకొనుచుఁ - మోఁదుచు నిరుదరుల్, వృద్ధియా కతనఁ గా - వేరిఁ బోవు

తే॥ విమల జలపూర్ణ మైన యా - విన్నుఁ బాఱఁ, గాంచి దీని చరిత్ర సా - కల్యముగను
దెల్పవే యని రాముఁ డ - ర్థించినం, నిట్టులనియె విశ్వామిత్రుఁ - డింపు నింప. ౪౭౧

## గంగా వృత్తాంతము.

సీ॥ మీవంశమునఁ బుట్టి - మేదినిఁ బాలించి, తగ నయోధ్యా మహా - నగరమందు
నెగడు విజయశీలుఁ - డగు సగరునకు వై, దర్భియా తొలి కళ - త్రంబునందు
జనియించు నసమంజ - సుస కంశుమంతుండు, కలిగె రెండవభార్య - ఖగ కులేంద్ర
సోదరి సుమతి యక్ - సుదతికి నుదయించి, రఱువది వేవు ర - త్యధిక బలులు

తే॥ తండ్రి కొడుకుల కడిమికిఁ - దనిసి పూని, గొప్ప యశ్వమేధంబు బొ - గొప్పఁ జేయఁ
గినిసి సుమనసుల్ దాని జిష్ణునకుఁ దెలుపఁ, గపిలు వెనుక యాగాశ్వంబుఁ - గట్టెనతఁడు

తే॥ హయము వెంటఁ బోవుచు నున్న - యంశుమంతుఁ,
దెదఁ గలఁగి యింద్రుడు మోసంబు - నెఱుఁగలేక

చెందొవ కంటి యిష్టపడి - చెడ్డ యొనర్చిన పాకవైరికిన్
గ్రందుగ వేయి కన్నులిడు - గౌతమ పత్ని యహల్య నాఁ జనున్. ౫౧౩

ఉ॥ కెంజడ లుల్లసిల్లు ముని - కేసరి యిట్టులు పల్కె విన్న శ్రీ
కంజనివాసినీసతి పతి - స్వర్ణ పద్మ దళాక్షుఁ డిట్లనున్
నెంజలి యిట్టులాట తగ - నెక్కెను పూర్వ కృతాపరాధమా?
యంజక యప్పు డొప్పినన్ - యాంకృతమా? ముఖాఁగాంగఁ బల్కెవే

చ॥ అన విని భూరి విజ్ఞుఁడగు - నమ్ముని యిట్లను సద్గుణాలయా!
విను ముని పుత్రి యూర్ధ్వగతి - పిర్యుఁడు గౌతముఁ డింట లేని వే
ళను హరిణాక్షి చంద్రముఖి - లాలిత లక్షణ లక్షితాంగి యా
వనిత యహల్యతోఁ గలయ - వాంఛ వహించె మనంబులోపలన్. ౫౧౪

చ॥ తొలఁగ నహల్య చూపులను - తూపులు నాఁడ నిశాత సాయకం
బులు మది గాఁడ విజ్ఞతయుఁ - బోవ మదం గల యారటంబుచే
నలయుచునున్న యింద్రుఁ డొకె - యప్పుడు సాహసవృత్తి నా గృహ
స్థులకు వియోగముం గొలిపి - చొచ్చెను గౌతమవేషియై యటన్. ౫౧౫

చ॥ ఇరువురు చేరి కామ మను - నింపగు నాసవ మానుచుండు నా
తఱి నితఁ డింద్రుఁ డంచెఱిఁగి - ధర్మ మధర్మము మానసంబునం
దరయక సమ్మతించి చెలి - యంగజ సౌఖ్యములందు దేల న
త్తరుణము నన్ మునీశ్వరుఁడు - నత్తఱి వచ్చె గృహంబు చేరఁగన్. ౫౧౬

చ॥ విలు పసిలేక మోఘముగఁ - జంపఁ దిట్ట వరంబు లిచ్చి నే
ల్పుల నెకిమీనిఁ జేయఁగల - ప్రోఢుఁడు గౌతమ మౌని చాయ రాఁ
దలఁగక లోక మెల్లెడన - దా చెడకుండెడు నింద గొన్న య
వ్వెలఁది వడంకి నిల్చె బల - భేది చనం గోడఁగెన్ బిడాలమై. ౫౧౭

చ॥ అనుపమ నీతిశాలి యగు - నమ్ముని కన్నుల నిప్పు లుర్లగాఁ
గని కత యంతయుం దెలిసి - కార్ముకవీర! భవ త్కటాక్ష్యుతో
గ్ర నిశిత కాండముం జెనయు - ఖండిత వాక్కులతో శపించె వ
జ్రిని పది నూర్ల యోనుల నీ - గీరము నొందుమ యంచు సత్తరిన్.

తే॥ క్షణములో శాప ఫల మొంది - జంభభేది, యెల్లిదంబగు లజ్జతో - నేగు పిదపఁ
జెలువఁ గని వెలవెలఁది చే - ష్టలను బొంది, నట్టి నీవును శిలవగు - మని శపించె ౫౨౦

సీ॥ మౌని కాళ్లం బడి - మడఁతి యో మునినాథ!, మన్నింపు మీ తప్పు - నన్ను గావు
పిన్నల తప్పులఁ - బెద్దలు సైఁచుట, తగునని నీతివే - త్తలు వచింతు

రని వేడఁ జ్వాలల - నార్చు రుద్రుని - బోలెఁ, గ్రుద్ధుఁడై కను మునీ - ంద్రుండు నంత
నతియెడ దయతోఁ బ్ర - సన్నుఁడై వనమాలి, రాముని శ్రీపాద - రజము సోఁక

తే॥ నీయథారూపమొందుదో - నెలఁతయనియె, నింద్రుఁ గొని నిలింపులు ముని - యెడకు వచ్చి
వేఁడ నతని యోనుల మాన్చి - వేయి కనుల, నిచ్చి పంపె నహల్య రా - యిగను పడియె

సీ॥ ఇది గత వృత్తాంత - మిఁక లోకమున నెల్ల, ప్రాణులు సుఖముగా - బ్రతుకఁ గాక
దుఃఖ కారణమును - దొరయునే? జగములు, నీవు చే విల్లూని - నిలిచి యుండ
కర మహిమంబును - గంటి నచ్చట నంజ, నాద్రిఁబోల్ తాటక - నడఁచి నపుడు
శిల యాచు దిక్కులే - కిలఁ బడిన యహల్యల, మనుప నిచ్చట సంస్థి - మహిమ గంటి

తే॥ అనుచు నిర్మల గుణుఁడు ప ♦ ల్కినది వినుచుఁ, దల్లి! పతి కరుణింప నా ♦ తని భజింపు
గతముదలఁచి చింతింపక ♦ బ్రతుకుమనుచు, నామె కెఱిఁగె రాముఁడు, వార ♦ లవలఁదరలి.

సీ॥ ఘన తపోధనుఁడగు - గౌతము నాశ్రమ, స్థలిఁ జేరఁ దత్త్వవి - జ్ఞాని యంత
నతిథులఁ గని వి - సిత మనస్కుఁడయి, యెదురేగి తెచ్చి స - మ్మదముతోడఁ
గావింపఁ దగిన స - త్కారమ్ము లొనరింప, గాధేయుఁ డాతని - గాంచి పలికె
నంజనాచల లీల - రంజిల్లు మొగల, శ్రీరాము పద రజ - శ్రీ వహించి

తే॥ మాలతీ లతఁ బోలిన - మధ్య నొసఁగె, నా యహల్య పూర్వాకృతి - నందె నీవు
నెద దొసఁగు లేని సతిని గ్ర - హింపు మనఁగ, బమ్మఁ బోలిన యమ్ముని - సమ్మతించె.

చ॥ తమి గొను సద్గుణాళియు ను - దారతయుం గల రాముఁ డంత గౌ
తమునిపదాబ్జముల్ శిరము - దాఁకఁగ మ్రొక్కి ప్రదక్షిణించి యు
త్తమసతి నా యహల్య ముని - తల్లజు కై వసమ్ముం బొనర్చి మో
దమున యతీంద్రుతోడఁ దన - తమ్మునితో నటనుండి పోవఁగన్. ౫౨౮

## ౧౦. మిథిలాదర్శన పటలము. (౧౩౭)

ఉ॥ లక్షణ లక్ష్యమైన కమ ♦ లాసతి కంజము వీడి నా తపం
బక్షయమై ఫలింప నిట ♦ కర్మిలి వచ్చి జనించెఁ గాంచు మో
రాక్షసవైరి! చేకొనఁగ ♦ రమ్మని యమ్మిథిలా పురంధ్రి సం
దక్షిత రీతిఁ జూఁచు తన ♦ చేతుల నంజలియించెఁ జెక్కుముల్ ౫౨౯

చ॥ ఇతరు లనర్హులంచుఁ దగ ♦ వే తగ దౌత్యము సేయ లోక సం
స్తుత సుగుణాకరన్ భువన ♦ సుందరి జానకిఁ బెండ్లియాడ నం
చిత మనుఁడై ఘ రాముఁ డిటు ♦ వచ్చెర వచ్చెడి నంచు నచ్చరల్
జతపడు పుర్ నటించు క్రియ ♦ సౌధములందు ధ్వజంబు లాడెడిన్. ౫౩౦

చ॥ హరి కిరణంబులున్ మఱుఁగు - లై గగనంబును క్షీరవార్ధి యన్
బరుసున గానరా నుపరి ♦ భాగములందు పటంబు లొత్తుగాఁ

గొఱలుచుఁ దెల్లనై మొగులు ♦ గుంపులఁ దాఁకుచు నాని తేమయై
హరువగు ధూప సంతతుల ♦ నాటుట వారలు గాంచి రయ్యెడన్. ౫౨

చ॥ అమృతముఁ గుంచె నద్దుకొని ♦ యంగజుఁ డంగములన్ లిఖించు నే
ర్పమరక చూచి చూచి భ్రమ ♦ మందుట దక్కఁగ నెగ్గలేని సౌ
రమరిన జానకిం బడసి ♦ నందున లక్ష్మి వసించు తమ్మి చం
దమున వెలుంగు న మ్మిథిల ♦ దా సిరి లోనికిఁ జొచ్చి రంతటన్. ౫౭

చ॥ నుడువుల తీ రెఱింగిన ఘ - నుండగు కుంభజుచేతఁ ద్రావఁగాఁ
బడిన మహాబ్ధి చందమున - భంబులు పర్వ నభంబు చాడ్పునన్
బెడఁగు శశాంకఫాలలును - వీరులు వేసటఁ బాఱవై వఁగాఁ
గడసిన భూషణాళి గల - గీముల వీదులఁ బోయి రంతటన్. ౫౮

చ॥ నడచిరి యంకుశంబున క ♦ ణంగని కొండలఁ బోలు నేనుఁగుల్
విడుచు మదాంబుధార లొక ♦ వెల్లువయై తురగాల నుర్వుచే
వడి నొక మార్పు చెంది రథ ♦ వర్గము లెప్పుడు సంచరింపఁగా
నడుసయి దుక్కియై బహు ద ♦ శాంతరము ల్గొను రాజవీథులన్. ౫౯

చ॥ నడచిరి రెండు ప్రక్కల ఘ ♦ నంబగు ప్రేమ మొకింత త్రెంపు లే
కడరి యనంగసంగరము ♦ నందు పెనంగి యలంగు బోట్లకై
వడిసె వియోగ బాధ గల ♦ పల్లవపాణులు కిన్కఁ ద్రెంచు పూ
వడములఁ దేనె యోడిగిల ♦ పంకము నొందిన రాచవీదులన్. ౬౦

సీ॥ కర పల్లవాంగుళు - లొరయ జనించిన, వీణారవము చెవి - విందు సేయ
శ్రావ్యంబుగాఁ బాడు - సరసిజాక్షుల గీతి, కా భావములు మదిఁ - గరఁచు చుండ
గంభీరమగు మృదం - గ ధ్వనుల్ పొందికఁ, జెలఁగి మిక్కిలిగ ఘో-షించుచుండ
హాస్తాభినయమున - కనువుగా నయనాభిఁ, నయము నయంబుగ- నడచుచుండ

తే॥ నయన నటన కుద్దిగను మ ♦ నంబు వోవ, భావ గతులును వెన్వెంటఁ ♦ బరుగులాడ
నున్న వో లేవొ యను కౌను♦లూఁగి యాడ, లలన లాడెడు నాట్యశా♦లలను గనిరి.

సీ॥ పగడాలఁ బోలిన - జగడాలు గెలలును, మరకత చ్ఛాయల - వఱలు బోదె
లలరిన పోఁక మ్రాఁ - కులలోనఁ బొడవుగా, వ్రేలాడుచుండు ను-య్యాలలందు
పాపజన్మముఁ బోలి - వచ్చుట పోవుట, యెడతెగ కుండఁగా - నడరు చుండ
బడతుల సన్నని - నడుములకో యన, భ్రమరముల్ ముసరుచుఁ-బరితపింప

తే॥ యువకుల మనస్సు లల్లె యు - బ్బాఁత లూఁగ, నాకవనితలఁ గాల్ద్రివ్వ-నయముదోఁప
మింటికిం గాళ్లు చాఁచుచు - మీఁటి యెగసి, యూఁగు వారల బాగోగు - లోలిఁ గనిరి

ఉ॥ మేరకు మీఱు రత్నములు - మేలి కడానియు నాణి ముత్తెముల్
వారణ దంతముల్ చమర - వాలము పీలియుఁ దావి కత్తులున్
వారి కృషీవలుల్ గనిమ - వారక పోయు దరుల్ గలట్టి కా
వేరిని పోలు నంగళులు - పెక్కులు గాంచిరి వారు ముందరన్.　　౫౩౪

ఉ॥ కామశరంబు కవ్వము ర - కంబునఁ గాఁడ నసూత్కరంబుఁ బోల్
ప్రేమ గలట్టి కాముకుల - రీతిని భూమిధర ద్వయంబునన్
సామజముల్ పరస్పరము - సంధిలి తొండము లెత్తి కిన్కతో
దీమస మొప్పఁ బోరుటలు - తేఁకువఁ గాంచిరి వార లంతటన్.　　౫౩౫

సీ॥ పడుచులు వాఁడి గో - ళ్లడరు చిగురుఁ గేలు, నొవ్వులఁగ వీణియ - చెవ్వులఁ బట్టి
యొడిసిన కల్లు నా - నొప్పు నరమ్ములు, చాఁగఁ దంత్రుల శ్రుతి - చక్కఁ గూర్చి
హస్తాంగుళుల త్రోవ - నతులు వోవంగ, నతుల దరి హృద - యంబు చనఁగ
వెలిదంతముల కాంతి - వెలువడ శ్రవణపే, యంబుగఁ దేట భా - వంబుతోడ

తే॥ జిలికి గానామృతంబు వ ♦ ర్షించుచుండ, వశము దప్పి యెదలు పర ♦ వశత నొంద
గర్ణ పుటముల సంతృప్తి ♦ గనక త్రావి, నడచి ర మ్మువ్వురును రాచ ♦ నగరి వీథి

సీ॥ కుమ్మరిచే వడి ♦ నిమ్ముగాఁ దిరుగు చ, క్రము వోలె గుండ్రన ♦ గాఁగఁ దిరిగి
పెద్దలతోఁ జేయు ♦ పేరిమి చెలిమి నా, నడుమంతరంబునఁ ♦ గడఁక విడక
జ్ఞానుల తలఁపుల - చందమ్ముగా గురు, మతి నిశ్చలత్వ మే ♦ మఱక గలిగి
బ్రహ్మాంబుభాతిఁ జ - ర్మంపుఁ జతువులకు, నిట్టిట్టిదని సుంత ♦ యెఱుఁగ రాక

తే॥ పైఁడి కట్లైముల్ మొగముట్టు - పట్టు జీను, పిగిలి కుచ్చులుమున్నగు - సొగసులొప్ప
నురుగు లూడ్చుచు నేడ్తెఱఁ ♦ బరుగువాఱు, మేటివారువములఁగాంచి♦మించిచనుచు

ఉ॥ ఊఁచిన యీఁటెలున్ వలపు - రాయని విండ్లు శిలీముఖ ధ్వనుల్
మోచిన నీల కుంతలము - లున్ నులి కొనులు దాల్చి యొప్పెడున్
పైఁచిన కందు నీఁగి మణి - సౌధ గవాక్షములందు సొంపుగాఁ
దోఁచిన చంద్ర బింబములఁ - దూకొని కాంచిరి వార లత్తఱిన్.　　౫౩౬

కవిరాజ॥ పటికపు గిన్నెలఁ బోసిన క్రొత్త సు - వాసన వీచెడు తేట కలున్
దిటముగఁ ద్రావి బయల్పడు నవ్వునఁ-దీరు తడంబడు పల్కులతో
స్ఫుటమయి డాఁగని నెయ్యపు టల్కను - పొల్పుగఁ దెల్పెడి చూడ్కి వగల్
పటువగు కైపు వెలార్చు బెడంగగు - పద్మనికాయముఁ గాంచి రొగిన్.

మానిని॥ కాయ సుఖంబు సమంబుగఁ జెందియుఁ ♦ గాముక పాళి విమోహితులన్
జేయుచుఁ బై వెలయుం గొను వేశ్యల ♦ చిత్త మునన్ స్ఫటికం బనఁగా

నా మెలనాఁగల కాటుక చూపుల ♦ నచ్చము నల్లనివై కయిఁ గొం
జాయఁ దనర్చుచు రంగుల మార్పుల ♦ జానగు బంతులఁ గాంచి రొగిన్.

కవిరాజ॥ కడియము లుంగరముల్ మణి చేరులు ♦ కమ్మలు వీణలు వస్త్రముల్
బడలుగఁ బందెము లుంచి సువాసిత ♦ పాశము లూఁగఁగఁ గుక్క మొగం
బడరెడు స్ఫాటిక శారులు రక్తిమ ♦ నందఁ గరంబులఁ బట్టుచు ను
క్కడమగు నీఁకెలఁ బోలిన కన్నుల ♦ కన్నెక లాడుట గాంచి రొగిన్.

చ॥ నలినము లుత్పలంబులును ♦ నాఁచును తీవియ లాకు లెల్లనౌ
ఫలములు సైకతంబులును ♦ వాలుగ బేడిస మీలుఁ గోకముల్
వెలవెల వోవఁగా దమకు ♦ వే ఉపమల్ తగ లేని యంగముల్
గల చెలు లీఁదు డిగ్గియలఁ ♦ గాంచిరి పెక్కులు వార లత్తఱిన్ ౫౪౨

చ॥ అతి చపల స్వభావమయి ♦ యచ్చటి కిచ్చటి కీడ్చు నింద్రియ
ప్రతతికి లోఁగి పర్విలెడు ♦ భావము భాతిఁ జలించి వింతలౌ
గతులఁ జరించి మైనలఁదు ♦ గందపుఁ బూఁత రవంతయేని సం
చ్యుతి గననీక కత్తులను ♦ వొందఁగఁ ద్రిప్పెడి వారిఁ గాంచుచున్. ౫౪౩

చ॥ ఇన సమ తేజులన్ గొతుక ♦ కిచ్చెడి సారల భర్త కంటె ని
ప్పునఁ బడి లక్కవై కరఁగి ♦ పోవని మారుల విల్లు దాల్చు నె
త్తుని కరముల్ గలారి నుదు ♦ రాజ నిభాస్యల యల్కఁ దీర్చు ప
ట్టునఁ గడు నెత్తునౌ తలము ♦ దుల్ గల వారలఁ గాంచి రంతటన్ ౫౪౪

ఉ॥ చక్కెర పాగుఁ బోలిన వ ♦ చస్సులు చిల్కలతోడఁ బల్కుచున్
మిక్కిలి సిగ్గు నొంది దిసి ♦ మెల్లలు నెత్తెలఁ బాటి సూనముల్
చొక్కటఁ గోయుఁ కేకి మయి ♦ చాయలఁ తొంగుల కంచ లోడి లో
స్రుక్కఁగఁ జూచి తేఁటి గమి ♦ క్రోల్చు వనంబులఁ గాంచి రొక్కెడన్ ౫౪౫

చ॥ అమరులకున్ వసింపఁ దగు ♦ హారి హిరణ్మయ సౌధపాళి య
చ్చమరిన నీడలో దివము ♦ నందము నచ్చటఁ జూపి గంగ చం
దమున గభీరమై యరి వి ♦ దారుని యంతిపురంబు చుట్టు కు
ద్యముఁ బరి గొన్న కందకము ♦ సంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౬.

ఉ॥ పూవుల తావి మేల్ సవురు ♦ పొన్ను మెఱుంగును తేనె తీపు సం
భావిత సత్కవిత్వ సరి ♦ పక్వ రసం బుపమిల్లు రాజక
న్యావలి యున్న యోవరుల ♦ హంసలు గుంపులుగా నటింప సొం
పై విలసిల్లు ముంగిళ్ళుల ♦ నంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౭

## సీతారాముల పరస్పర వీక్షణము

చ॥ పొగడఁ దొడంగుచో బలుకు ♦ బోటి మగండగు బ్రహ్మయాదిఁగా
మిగిలిన సత్కవీంద్రు లుప ♦ మించి వచించెడు లక్ష్మియే స్వయం
బుగ విజయంబు చేయఁ దన ♦ పోణిమిఁ బల్కఁగ నామె దక్క వే
ఱుగ నుపమాన మారసి యె ♦ ఱుంగఁ దరంబె? నుతింప సాధ్యమే? ౫౪౭

మ॥ గిరిజాద్యుత్తమ సాధ్వులున్ దలలు కే ♦ ల్గీలించి మ్రొక్కంగఁ ద
గ్గ రహిన్ సద్గుణరాశియౌ జనక రా ♦ ట్కన్యా విలాసంబు ని
ర్జర వర్యుల్ దిలకించి సౌరు పొలిమే ♦ రం గాంచఁ గాంక్షించియే
తెఱగంట్లైతిమి రెండు కన్నులును బ్రాఁ ♦ తిం గాన లేవంద్రు నూ ౫౪౮

సీ॥ హరిణంబుఁ గూల్చి పే ♦ రందిన కుంతంబు, కొల యలవాలైన ♦ యలుఁగు వాలు
వెనుదీయ నాలుగల్ ♦ వెఱగొందఁ జలియించు, కను గొందు జానకి ♦ కవ్వాపు మల
తిరుగఁ గో యని యార్చు ♦ వర దుగ్ధ వార్ధిలోఁ, గాక యా శుద్ధాంత♦కాంత లచటఁ
గాంచిన యమృతంబు ♦ కరణి నొప్పినయది, యిక్కన్యఁ బోలు వే ♦ ఱొక్క కన్య
తే॥ నొనరుపు మటంచు సురలు వేఁ♦డినను బ్రహ్మ,వలస నీకన్నైన సృష్టింప♦వలనుపడునొ?
అమృతభుక్కులు బతిమాల♦నబ్ధియేని, యిచ్చు సుధ దక్క వేఱెద్ది♦యీయఁజాలు?

తే॥ వలచి వేల్పులు తడవు న♦ప్సరస లెల్ల, సీత మేనియందము గాంచి ♦ సిగ్గుపడుచుఁ
కంది కుందిరి వారి మొ♦గంబు లనెడి, యబ్జ మండలములకు నె ♦ ల్లపుడు పగలె ౫౫౦

తే॥ ఇమ్మగువ పంకజమునుండి ♦ యిలకు రాఁగ, ఘోర తపమాచరించిన♦వారు సురలొ?
జగమొ? విప్రులో? స్వర్గమో?♦తగవొ?యెదియొ?,దీనినిజము నిజంబుగ♦దెలియలేము

చ॥ అరయఁగ వేలు వేలు పను ♦ లందని సుందరు లండ నిల్చి యో
వర మృగనేత్ర! తల్లి! మధు ♦ వా! యరుదౌ నమృతంబ! యంచు సం
బరమున దూరపుం బువులఁ ♦ బజ్జను హార్వగఁ జల్లి నిల్వ న
వ్విరులపయిన్ గమించు నలి ♦ వేణి సుఖంబుగ మెల్ల మెల్లనన్ ౫౫౩

చ॥ మృదులపదంబులన్ బసిఁడి ♦ మించులు గజ్జెలు దాల్చి కౌనునన్
వదులుగ మేఖలన్ మెడను ♦ నాఁడెపుఁజేరులు పూల మాలలున్
ముదితలు కూర్చి కాంచ మెఱు ♦ ముల్ శతకోటులు సేవ సేయ నొ
ప్పిదముగ మించు రాణి ప్రభ ♦ వించె ననం దగి సీత యొప్పెడున్ ౫౫౪

ఉ॥ చంపెడి కుంతమున్ శమనుఁ ♦ జక్కఁగఁ గెల్చును గెల్చునంచు బీ
రంపు నుడుల్ వచింపఁ దగు ♦ రాణ వెలింగెడి కన్నులొండె వ
ర్ణింపఁగ వీలు కాని వవి ♦ నిల్వనఁ గాంచిన పర్వతంబులున్
బెంపగు గుండ్లు గోడలును ♦ పిల్లుఁ గరంగి ద్రవంబుగా నగున్ ౫౫౫

శా॥ ప్రేమానందము గూర్చు నేత్రములకున్ ♦ వీక్షింపఁగాఁ బండువై
యామోదంబును పెంప నెల్లరు జలే ♦ జాతుల్ గనం గౌతుకం
బీమాడ్కిం గలిగించుటన్ జెలులకే ♦ యింపౌ సుధం బోలు కాం
తా మత్తల్లిక సీత రామునకు ♦ నే తాత్పర్యముం గూర్చునో? ౫౫౬

ఉ॥ భూషలు కుండలాదు లవి - మున్ను సువర్ణముఁ బోలి శైత్యముం
బోషణ చేయు చూపు గల - పొల్తులకో సలవడ్డవైన నీ
యోషలమిన్న ధాత్రిసుత - యుప్పతిలన్ భువి సోమరత్నయు
గ్భూషలు మేటి భూషణముఁ - బొందినవై విలసిల్లె నెంతయున్ ౫౫౭

తే॥ ఊహ కరుదైన-సౌందర్య-మొందు సీత, యిట్లు నిలువ నిర్వర కన్ను-లెనసి యొకటఁ
గలిసి యిర్వర తెలువులు - కలఁకవాఁజు, గాంచె రాముఁడు సీతయుఁ -గాంచె నతని

చ॥ జనకజ చూచు చూపులను - శాణ విఘర్షణ కుంత యుగ్మమా
ఘన బలుడైన రాము భుజ - కాండములన్ దగ వ్రాలె ఘల్లనన్
ధ్వనిగాను వీర ముద్దియలు - దాల్చిన రాముని చూపుఁదేంట్లు వ్రా
లెను జలజాత సద్మ లవ - లీ లలితాంగి ముఖాంబుజంబుపై ౫౫౯

చ॥ వలపు వహించు చూపు లను - పాశముచే నిరు మానసంబులున్
బలముగ లోఁగి లాగఁబడ - భాను కులాంబుధి సోము మానసం
బల జనకాత్మజాత యెద - యందు వసించెను సీత మానసం
బల రఘురామచంద్రు నెద - యందు దగుల్కొనెఁ జిత్రవైఖరిన్ ౫౬౦

చ॥ కన నడు మింత లేని జన - కప్రభు పుత్త్రియు శుద్ధ మానసుం
డనఘుఁడు రాముఁడుం గలిసి - యంచితమైన తను ద్వయంబునం
దునిచిన యొక్క ప్రాణమన - నొప్పిరి; మున్ను సుధాబ్ధి శేష శ
య్యను జత వీడి యిప్డు డరు - దందఁగఁ జేరుటఁ జెప్ప శక్యమే? ౫౬౧

ఉ॥ అంతము లేని సుందరత - నందిన రాముని గూడలేని వ్యా
చ్చింతను గుంది సీత యొక - చిత్రపటంబును బోలి యుండెఁ బే
ర్వంతఁ దలంపు బెట్టు చెలు - వంబును దార్ఢ్యము వెన్బడన్ మహీ
కాంతుని పుత్త్రుఁడున్ దపసి - కౌశికు వెంటఁ జనెన్ మఱుంగుగాన్ ౫౬౨

## సీతాపంతాపము.

తే॥ అట్లు వనమాలి కనుమఱుఁ-గై నయంత, నెడఁదయును మదద్విరదంబు-దృఢత యనెడి
యంకుశముఁద్రోచివైచె స్వే-చ్ఛానువృత్తి, సిత యాఁడుఁదనం బెట్టి-స్థితి భజించె?

చ॥ తనకు రఘూత్తముం డెదురు - దార్కొన సీత మనంబు మేను ప
ల్చనిదగు పోఁగు వంటి తన - జానగు కౌనును బోలె నూఁగఁగాఁ

## భరతుఁడు రాముం బ్రార్థించుట

సీ॥ **ఆనాఁడు** కడవఁగా - నవనీపతులు రాజ, బాంధవుల్ మునులును - బలసియుండ
శ్రీరామ చంద్రుండు-చెంత నెయున్న భ,రతుఁ గాంచి వత్స! యీ- హితమునీనుము
జనకుఁ డవ్యయ పదం - బున కేగె నతని యా, జ్ఞానుసారముగ రా-జ్యంబు నీదె
మకుటంబు ధరియించి - మహి నేల కేలిఁ, దపసి వేసము నూనఁ - దగునె? యనుడు

తే॥ నీవు కాఱడవులఁ జేరి ♦ యిట్టులుండ, ధర్మమూర్తు లెవ్వరు? పురి ♦ ధర్మమేది?
పాడి నీకంటె మున్నె యీ ♦ వనము చేరె, దానిఁ బడసి కొంపోవంగఁ ♦ బూనినాఁడ.

తే॥ మనసు సమ్మతింపని వర ♦ మునఁ నెనిన్ను, తగని స్థితి నిల్పియంతట ♦ మగనిఁ జంపి
నట్టి కైకేయి కన్నట్టి ♦ పట్టిగాన, నాకు నీ వేషముచిత మ ♦ న్యంబు తగునె?. ౧౦౮౪

చ॥ జగములు సంతపింప బలు ♦ జాలిని గూర్చిన దుష్టురాలి కిం
బుగ జనియించు పాపగుణ ♦ పూర్ణుఁడఁ గావున నాకుఁ జావఁగాఁ
దెగువయుఁ గల్గ లే దొడలి ♦ తీపియుఁ బోదు తపంబు సేయఁగన్
దెగడిక నుండి తప్పి కడ ♦ తేఱెద నింత యనుగ్రహింపవే. ౧౦౮౫

తే॥ కోలముపాడి వీడిన సతి ♦ గుణము, నోర్పు, పరఁగకుండు తపంబును, కరుణవిడిన
ధర్మమును, పూర్వ వంశ ప ♦ ద్ధతులు నీఁగు, పాలనము కంటె మేలయి ♦ క్రాలునేమి?

చ॥ జననము తోడ నీకుఁగల ♦ స్వామ్యము, వీడఁగ రానిదా సనా
తన కులధర్మమా పదవిఁ ♦ దప్పఁగఁ ద్రోసి తపంబు పూనె దీ
వనునెడఁ బట్టుపట్టి నయ ♦ మాఱిచు ధర్మముఁ ద్రెంచి మ్రింగువా
రిని బలె రాజ్యపాలన వ ♦ రించి చరింతునె నీకుఁ దమ్ముఁడన్? ౧౦౮౭

ఉ॥ మేర యిడంగరాని పెను ♦ మేలిమి కూరిమి తండ్రి ఛావఁగాఁ
గారడవిం జరించుచును ♦ కాయలు మెక్కుచు నీవు పోవఁగా
వేఱిమి తోడ వంచనము ♦ వెంచి ధరాస్థలిఁ గవ్వికొంటకున్
జేరిమి క్రుంగి యున్న తఱిఁ ♦ బేరిచి నాఁచుకొనంగ వైరినే? ౧౦౮౮

మ॥ భువనాధీశ్వర! తండ్రి చేయు పొరపున్ ♦ బోరామి లోకాలకున్
దవులం జేసిన కైక కీడు భువిఁ జెం ♦ దన్ రాక రక్షింపఁ బ్రా
భవ సామ్రాజ్యము నేల రమ్ము జగముల్ ♦ భవ్యంబులం బొంద మా
భవ బంధంబులు డింద నంచు నిటు వి ♦ స్పష్టంబుగా నాడఁగన్. ౧౦౮౯

తే॥ భరతు పల్కులు విని వాని - భావమెఱిఁగి, చింతనము చేసి యతని నీ - క్షించి వత్స!
నాదు పలుకొండు కల్లదు వి-నంగఁ దగును, చాల యోచింప ధర్మసూ-క్ష్మంబు దెలియు

ఉ|| శీలము సత్యముం దగవు ♦ చెల్మియు నీతియు వాంఛనీయమౌ
మేలిమి మున్నుగాఁగలుగు ♦ మెచ్చగు సత్పథవృత్తులెల్ల భూ
పాలుర శాసనంబులకు ♦ బద్ధములై భువి నిల్చుచుండు నే
లీల మనంబు నందు పది ♦ లించి తలంపుము సద్గుణాకరా! ౧౦౯౧

ఉ|| ఉత్తమ శాస్త్రముల్ వినుట ♦ యుత్తమ బుద్ధి గడించుచుండుటల్
ఉత్తమశీలముం గొనుట ♦ యుత్తమవృత్తుల నభ్యసించుటల్
చిత్తము దేవుపై నిడుట ♦ చింతన సేయఁగఁ బెద్దవారె కా
సత్తమ మార్గదర్శకులు ♦ సత్యము నీవుఁ దలంచి చూడుమా. ౧౦౯౨

తే|| ఆమహాత్ము లెవ్వారని ♦ యడుగ వలతె?, యెల్లవిధముల మనసున ♦ నెంచిచూడ
తల్లిదండ్రులు దక్కఁ నీ ♦ ధరణియందు, వేఱెవరు లేరు నిక్కంబు ♦ విమలచరిత!

మ|| జను లభ్యాసము సేయు శాస్త్రముల వై ♦ శారద్యముం గొన్న పా
వన చారిత్రక! తండ్రి యాజ్ఞ గొని సం ♦ భావ్యాన్వయాచిత్యభా
వనతో దానిని సమ్మతించితివి నీ ♦ ప్రార్థించుటం జేసి వీ
డినచో సయ్యది సద్గుణం బగునె? పా ♦ టింపంగ లేవే మదిన్?. ౧౦౯౪

క|| తనయులు తలిదండ్రులకున్, ఘన కీర్తిని కూర్చుటకో? య ♦ ఘంబగు నిందం
బెనుచుటకో నీవచెపుమా? జనియించిన ఫలము సుజన ♦ సన్నుత చరితా! ౧౦౯౫

ఉ|| ఏను దురాశచే జనకు ♦ నీభవమందునఁ గల్ల రీనిగాఁ
బూనిచి ఘోరవంబున గు ♦ భుల్లునఁ ద్రోచి వినోదసౌఖ్యసం
ధానక రాజ్య భోగములఁ ♦ దాల్మిని పొంది రహింపనేరునే?
మానవుఁడైన వాని కిహ – మాత్ర సుఖంబులు సుస్థిరంబులే?

చ|| ధరణి నొసంగి సత్యమునఁ – దప్పక నిల్చిన తండ్రి పల్కుచే
భరత! ధరిత్రి నీదెయగు – ♦ బాలన సేయఁగఁ దగ్గ సత్త్వముం
బొరసిన నీదెయౌ మహిఁ బ్ర ♦ భుత్వపు టర్హత నీకెయున్న దిం
కరమర లేల? యేలుకొను ♦ మయ్య జనంబులు సంతసిల్లఁగన్. ౧౦౯౭

తే|| అనుడు భరతుఁడిట్లను జ్యేష్ఠుఁ ♦ డగుచుఁ బుట్టి, మూఁడులోకంబులను సాటి ♦ మొనయకుండు
నీవ నాదిరాజ్యంబని ♦ యెంచితేని, నీక యొసఁగితి రమ్ము మ ♦ న్నించి మమ్ము. ౧౦౯౮

ఉ|| భూమి సమస్తముం గలఁగి ♦ ముచ్చిరుచుండఁగఁ జూచి చూచి పై
నీమనమందు దోఁచు లలి ♦ నే యొనరింతె? కలంక దేఱఁగాఁ
బ్రేముడి వచ్చి మమ్ము కయి ♦ వీడక ప్రోవుమ యంచు దీనతన్
రామ పదాంబుజంబులు క ♦ రంబులఁ బాయక పట్టెఁ బట్టుదన్. ౧౦౯౯

తే॥ నెనరు మనసున నీ♦యిచ్చ ♦ నేర్చినట్లు, నేల యిచ్చుట కొనుటలు ♦ నీతియగునె?
నిందకై జంకి జనకుండు ♦ నీకునొసఁగ, నాఁడు సమ్మతించిన యేండ్లు♦నేఁడె చనెనె?

తే॥ సత్యమొక్కటి దక్క యీ♦జగము వేఱు, పూతగుణమున్న దని చెప్పఁ♦బూనునేమి?
సత్యమున నుండి జాఱ దు♦ష్కృత్యమయగుఁ,గాని వేఱొండగునె నీవ♦కాంచుమయ్య

క॥ ముదమున జనకుని యానతిఁ, బదునాల్గేండ్లేను వనుల ♦ వసియింపంగా
సదమలమతివై యంతకు, వదలక నాయాజ్ఞ నీవు ♦ వసుధం గొనుమా. ౧౧౦౦

తే॥ తండ్రి యపుడె కిరీటంబుఁ♦దాల్పు మనఁగ, నతని యాజ్ఞ మీఱఁగ జంకి♦యనుమతించి
నాఁడ నదియెంచి నావచ♦నంబు దాఁటఁ, దగునె? పని వినుమింకఁ జిం♦తనమువలదు.

**వసిష్ఠుఁడు రాము నయోధ్యకు రమ్మని కోరుట**

ఉ॥ తేజిత సత్త్వశాలియగు ♦ ధీరుఁడు రాఘవుఁ డిట్లు వల్క వి
భ్రాజిత కీర్తిశాలి ప్రతి ♦ భన్ భరతుండు వచింపఁ బూన నం
భోజభవాత్మజుం డనియెఁ ♦ బూర్వ నిరూఢ పరాక్రమాఢ్యులౌ
రాజుల సచ్చరిత్రములు ♦ శ్రద్ధను విన్మరియాట దీఱఁగన్. ౧౧౦౪

ఉ॥ తొల్లి వరాహమూర్తియయి ♦ తోయజ నేత్రుఁడు కోఱ పంట జా
బిల్లి కలంక మట్లు కన - పింప ధరన్ జలరాశి నుండి యు
త్ఫుల్ల మనంబుతోడ జన ♦ ముల్ పరితోషమునొంద నెత్తి నాఁ
డుల్లసిత ప్రకాశమున ♦ నొప్పుచు నెప్పటియట్ల యుండఁగన్. ౧౧౦౫

మ॥ విల యాంతంబునఁ బంచ భూతములు ని - ర్వీర్యంబులై తేజముల్
వొలియన్ దత్త్వము లెల్ల లీనమగుడున్ ♦భూతేశుఁడౌ విష్ణు వీ
జలరాశిన్ సృజియించి యందు బహు వి ♦ శ్రాంతిం గనంగోరి ని
ర్మలమహా మేటి వెలుంగు రూపమున ని ♦ ద్రం జెందె మఱ్ఱాకుపై. ౧౧౦౬

తే॥ ఉన్నతులగు వేల్పులకుఁ బ్రీ ♦ యూష మొసఁగు, కడలి వంటి నల్లని మేను♦గలుగువాని
నాభియందు పుట్టిన నలి ♦ నంబు నుండి, యఖిల జగముల సృజియింప ♦ నజుఁడుపుట్టె

తే॥ అవ్విరించి జగంబుల ♦ నివ్విధిల్లఁ, జేయుచోఁ గల్గెఁ దొలుత వి - శిష్టమైన
మీ మహాన్వయ మండలి ♦ మేదినీశ, వరులు నెఱి దప్పు వారలీ ♦ వఱకు లేరు

తే॥ శ్రుతులుశాస్త్రములిహపర ♦సుఖములొందఁగఁబ్రగురుఁడైపోషునుఁడుజ♦గంబులందు
తండ్రు లై దుగురం దని ♦ తదజ్ఞు లండ్రు, నిక్క మిదియుఁ గుమారక! నీవెఱుఁగవె?

తే॥ సదమ లాత్మక! యేను శా - స్త్రములు పెక్కు, లెలమి నేర్చిన ఫలము నా♦ కెనయునట్లు
నాదు పనుపు గాదనక వె ♦ న్కకును వచ్చి, రాజ్య భారంబు పూనుము ♦ రామభద్ర!

తే॥ అట్లు పలికిన కులగురు ♦ నరసి రాము, చంద్రుఁడీరీతిఁ బల్కె నం ♦ జలి ఘటించి
సర్వశాస్త్రార్థవేత్తలు ♦ సద్గుణులరు, కలవె మీరెఱుంగని ధర్మ ♦ గతులు ధరణి?

చ॥ అగుదురు గాక సద్గురువు ♦ లౌదురు గాక విధాత సూనులే
యగుదురుగాక దైవతము ♦ లౌదురు గాక యుం దల్లి దండ్రులే
యగుదురు గాక సత్యసుతు ♦ లాడి తొలంగిన కద్దు లాడుటల్
తగునొకొ? మిమ్ముబోఁటి గుణ ♦ ధన్యులకుం దలపోసి చూచినన్?

ఉ॥ తల్లి విధించెఁ జేయుమని ♦ తండ్రియు నుత్తరు విచ్చియయ్యెఁ బైఁ
జెల్లుదునంచు నియ్యకొని ♦ శీఘ్రమునన్ వహియింప కేగు నా
ప్రల్లదు పుట్టుకంటెఁ బడు ♦ పాటుల మంచియుఁ జెడ్డ గాన కే
పొల్లగు లంపటన్ దిరుగు ♦ ముక్కిడి కుక్క భవంబు మేలెకా?. ౧౧౧౩

చ॥ ఎదుట విధించు పెద్దల య ♦ భీప్సితముల్ నెఱవేర్తు నంచు బెం
పొదవఁగ సమ్మతించితి స ♦ మున్నత మానస మందు మీరలా
పదపడి యిట్టు లాజ్ఞ యిడు ♦ వారలు! నేనది చేయు టొప్పగున్
ద్రిదశ మునీంద్రవంద్య! యుప ♦ దేశము సేయుఁడి ధర్మ సమ్మతిన్. ౧౧౧౪

చ॥ అనుడు వసిష్ఠమౌని యిఁక ♦ నాడఁగ నెయ్యది లేదయంచు శం
కను గొని యూరకుండె నటఁ ♦ గైక సుతుండను సట్టులైన మే
దిని పరిపాలనం బలుపు ♦ దిష్టము చిత్తము గల్గు వారలే
గొనకొని యేలనీ; యితనిఁ ♦ గూడి వనంబులనే చరించెదన్. ౧౧౧౫

తే॥ అనఁగ నత్తఱి వేలుపు ♦ లది యెఱింగి, గుంపులై తమ్ముఁడన్నను ♦ కొంచుఁ బోవ
మన తలంపులు సఫలమ్ము ♦ నెనయఁజాల, వనుచుఁ జింతించి యిట్లని ♦ రందఱు విన.

చ॥ వినుత గుణాఢ్యుఁడైన రఘు ♦ వీరుఁడు క్షీరతఁ దండ్రి యాజ్ఞమై
వనులఁ జతుర్దశాబ్దము ల ♦ వారణ రీతిగ నుండువాఁడు స
న్మనమునఁ గైక పుత్త్రుఁడు జ ♦ నంబులఁ బ్రోచుచు రాజ్యమేలువాఁ
డినకుల వార్ధి సోములకు ♦ నియ్యది యుత్తమ ధర్మమై తగున్. ౧౧౧౬

ఉ॥ దేవత లిట్లు పల్క జగ ♦ తీ తనయా వరుఁ డంత నానుడుల్
ద్రోవఁగ రాని వయ్య మది ♦ దొడ్డగ యోచన సేయ వయ్య నే
నీవని నుండు కాల మది ♦ యెంత? పదంపడి వత్తు నయ్య ని
న్నీవిధి వేడికొందు నని ♦ యిచ్చ గ్రహించెను తమ్ము హస్తముల్. ౧౧౧౭

చ॥ ఇటులను నన్నకయ్యనుజుఁ ♦ డిట్లను నేమనువాఁడ నిందుపై
నటులె చతుర్దశాబ్దముల ♦ యమ్మెఱునాఁడె పురంబు చేరఁగాఁ
దటుకున రమ్ము రాకయటు ♦ తప్పిన నీపదమాన సుమ్ము ప్రో
త్కటతర వహ్నిఁ జొచ్చి కడ ♦ గాంచెద నాఁడె సురల్ నుతింపఁగన్

తే॥ అట్లు శపథంబు చేసి హ్రా ♦ దజ్జుఁ డపుడు, నెగులు విడిచెను భరతుండు ♦ పొగడుగుడిచె
నడరు సత్కీర్తి తనకంబెఁ ♦ బొడవుగాఁగఁ, గాంచు రామచంద్రుఁడు సమ్మతించెనంత

చ॥ భరతుఁడు వేఱొకండరుదు ♦ భావన చేసి మహాత్మ! పాదుకల్
స్థిరమతినిమ్ము తత్ప్రతిని ♦ ధిత్వము పూని ధరిత్రిఁ గాచి నీ
కరుణ గడింతు నన్నుఁ బద ♦ కంజములం ధరియించు వాని ని
ర్జరులకు నొందరాని స్థిర ♦ సౌఖ్యము లిచ్చెడు వాని నిచ్చినన్. ౧౧౨౧

ఉ॥ వారక బాష్పధార లొద ♦ వంగల కన్నులతోడ ధూళి యొ
ప్పారిన మేనితోడ నమ ♦ రాది సమస్త జనాళి దుఃఖ ని
స్తారక రామ పాదుకల ♦ సమ్మతి రత్న కిరీట లీలఁ జ
క్కారముగా ధరించి రఘు ♦ కాంతుని వీడ్కొని యంతఁ గ్రమ్మఱన్.

క॥ జనములు బంధులు పెద్దలు, మునులును సచివులును పౌర ♦ ముఖ్యులు తక్కం
జనములు భరతుని వెంటనె, చనియెం జని లేక రామ ♦ చంద్రు నెడయుచున్.

తే॥ ధర్మశాస్త్ర వీరుఁడు భర ♦ ద్వాజుఁ డేగె, మరలె నింగిని కూడిన ♦ సురగణంబు
కూర్మి మిత్రుండుగుహుఁడు వీ ♦ డ్కోలువడసి, భరతు వెంటనెచనె దుఃఖ ♦ భరితుఁడగుచు

సీ॥ ఈపాదములె కదా ♦ యింద్రాది సురల కా, పదవేళ నొదవెడు ♦ పట్టుగొమ్మలు
ఈ యంఘ్రులే కదా ♦ శ్రేయంబు లొసఁగ గూర్చు, పావనగంగకుఁ ♦ బ్రభవ గృహము
ఈచరణములెకా ♦ యింద్రియ జేతలౌ, యతివర హృదయ గే ♦ హముల దివెలు
ఈపదములె కదా ♦ యింతి యహల్య పా, పంబుల మాన్చిన ♦ పరుసవేది

తే॥ అనుచు భరతుండు తననింద ♦ కామకొనిన, పాదుకల మస్తకంబున ♦ భక్తిఁ దాల్చి
గంగదాఁటి పాడై చెడు ♦ కాడుఁబోలు, పురము సాకేతమును చొర ♦ బుద్ధిగొనక.

శా॥ నందిగ్రామమునందు పాదుకల నం - దం బొప్పఁ దాపించె తా
ముందుం బోలెనె రామసన్నిభ సుఖం ♦ బుంబొంది రాజ్యంబు రా
జేందుల్ భక్తిని గొల్వ మోదమున లో ♦ కేశుల్ ప్రశంసింప స
ద్బృందంబుల్ సుఖయింప నేలె భువన ♦ శ్రేయంబు గేయంబుగాన్. ౧౧౨౯

ఉ॥ రాముఁడు చిత్రకూట శిఖ ♦ రంబున నుండెడిఁ జూత మం చయో
ధ్యామనుజుల్ ప్రియంబు మెయిఁ ♦ దప్పక వచ్చుచు నెమ్మనంబు డో
లామతి సేయువారని త ♦ లంచుచు నచ్చటు వీడి దక్షిణా
శాముఖుఁడై యతండు చనె - జానకితో ననుజన్ముతోడుతన్. ౧౧౩౦

అయోధ్యా కాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.

ఓమ్. తత్. సత్.

శ్రీ

# కంబరామాయణము - ఆరణ్యకాండము

## ౧. విరాధ వధ పటలము. (౭౨)

చ॥ మనుజవిభుండు సత్త్వగుణ ♦ మాన్యుఁడు జీవహృదంతరాత్మయై
మననము సేయఁ జేయ మహి ♦ మం బొనఁగూర్చెడు వేదముల్ విరిం
చనుఁడుఁ దపంబుసేసి కనఁ ♦ జాలని సర్వజగత్ప్రభుండు మా
మనమున కందువాఁడె? పలు ♦ మార్గములన్ గమనించి చూచినన్.

ఉ॥ ముత్తియముల్ కుదించి నటు ♦ ముచ్చటఁ గూర్చు స్మితంబు మోమునన్
హత్తిన సీతతో యువకు ♦ లాదటఁ జిత్ర శరాసనంబులన్
జొత్తిలఁ దాల్చి పత్రఫల ♦ శోభితవాటి భవాబ్ధి పారగుం
డుత్తముఁ డైనయత్రి వన ♦ మొప్పుగఁ గాంచిరి వారుముందటన్. ౨

చ॥ గొనకొని భూమి భారము క ♦ కుప్పల నిల్చి వహించు మత్తవా
రణములఁ బోలె వారు ముని ♦ రాజు వనంబునఁ జొచ్చి ముప్పగన్
దునిమి ప్రశాంతిమైఁ దపము ♦ తొట్టఁ గఁ జేయు మునీంద్రుఁ గాంచి వం
దన మొనరించి నిల్వఁ బ్రమ ♦ దంబును పొందె నతండు పొంగుచున్. ౩

ఉ॥ బందుగులెల్ల గీమునకు ♦ వచ్చినచో గృహమేధి సంతసం
బందు విధాన సత్రి ముద ♦ మంది కుమారకులార! మీర లి
ట్లొందఁగ దర్శనం బొనఁగ ♦ నొక్కట దేవతలున్ జగంబులున్
బొందుగ వచ్చి నట్లడరెఁ ♦ బుణ్యుఁడనైతి నటంచు మోదిలెన్. ౪

ఉ॥ ఆతనితోడ నాఁడచట ♦ నర్మిలిమై వసియించి సాధ్వియున్
బూత చరిత్ర యత్రిముని ♦ పుంగవు దేవ్యనసూయ సీతకుం
బ్రీతి నొసంగు గంధ ఫల ♦ వస్త్ర సుభూషణరాజిఁ గొంచు రా
మాతిలకంబు రా విబుధ ♦ మాన్యులు దండకఁ జేరి రంతటన్. ౫

సీ॥ మదవారణంబులు - పదునాఱు నంత రెం, డంతల సంఖ్య పం - చాననములు
పదునాఱు శరభముల్ - గుదిగాఁగఁ గూర్చిన, ముమ్మొన వాలు చేఁ ♦, బూన్చి పట్టి
జుంజుఱు జేగుఱు - జొంపంపుఁ దలవాఁడు, విషగిరి నడచె నా - వెలయువాఁడు
క్రొమ్మొగుల్ వసియించు♦కొండలు కాలఁద్రొ,క్కుడు దూదివలె లేవ-నడచువాఁడు

తే॥ వ్రణము లట్లు ప్రకాశించు-కనుల నుండి,మిడుఁగుఱులురాల రవిశ్రుంగ-మిన్ను వడఁక
నవనియును దద్దఱిల్ల మహాబలిష్ఠుఁ, డైన యముని చేవయును కా -ర్యంబు నొంద.

సీ॥ సింహాసంఘము ప్రవే - శించి గర్జించెడు, శ్రవణ కందరముల - ప్రక్కలందు
నెల్లదిశల విల - సిల్లెడు మేరు శి, ఖరములు పోఁగుల - నొరయు చుండ
మొగుళులసందునఁ - బొడసూపు నెత్తుని, యాకసమోయన - నతిశయిల్లి
నల్లచేఁ దడిసిన - నల్లని కాయంబు, చందన సిక్తస్తనా - చందమొప్ప

తే॥ వీరులను తురంగమముల - వారణముల, నరదములను సింగంబుల - వ్యాఘ్రములను
చిక్కవాని నెల్లను కొండ - చిలువలందు, గూర్చు దండలు కుత్తుకఁ-గొమరుమిగుల

ఉ॥ కొండలఁ బోలె శూలమునఁ - గ్రుచ్చిన యేనుఁగులం గరంబు లొం
డొండుగ నంది యీయఁగ మ - హోన్నత పర్వత కందరంబు నా
నుండెడి బాకినోట నొక - యొరను ముడ్చి మెదించి మ్రింగుచుఁ
మెండగు నాఁకటం దనిసి - మేకొనకుండెడు బొట్టపొట్టతో. ౮

ఉ॥ పన్నగరాజ రత్నముల - బంధురలీలఁ బొదింగి వానితోఁ
బ్రన్నన రాహు పాశమునఁ - బట్టి దిగీశ విమాన పంక్తులఁ
గ్రన్ననఁ గూర్చి ఋక్షములఁ - గట్టిన మాలికలోన గాములఁ
మన్ననఁ జేర్చితాల్చు జయ - మాలిక వక్షమునఁ రహింపఁగఁ, ౯

ఉ॥ సంజను వహ్నిఁ బోలి పరు - సం బయి యెఱ్ఱఁ దనంబు మీఱు నా
జుంజులు వెంద్రుకల్ విరియ - శోభన వారణ కుంభమట్టు లు
బ్బంజను ఫాలభాగమున - వాసవ సామజ ఫాల పట్టముఁ
రంజిలు పొన్ను పొన్ను రద - నంబులు చొక్కముగా వెలుంగఁగన్. ౧౦

తే॥ నలుపు మీఱంగఁ గ్రూర గు-ణంబుపొంగ, నలుకఁ దగియున్న కొఁడిమెవి-పొగ్నులట్లు
పొలయఁ దామసమను నిరుల్-పూఁతగాఁగఁ, బూసికొనివచ్చుకలికాల-మోయనంగ.

ఉ॥ చంపిన వేఁగిచర్మములె - సన్నని వల్వగ దంతి చర్మముల్
జంపగు నుత్తరీయముగఁ - జాలగు దిగ్గజ మస్త ముక్తముల్
పెంపగు నందుకంబులుగఁ - బెన్చిన లావగు కొండ చిల్వలే
సొంపగు కాసెగాఁ గయిఁద్రి - శూలము దాల్చి హరుండు నాఁడగన్. ౧౨

తే॥ ఫణి ఫణామణి ఖచిత కం - కణము లొప్ప. చేతులందున వలమురి - చింద మమరఁ
జేయు కడియంబులును దాల్చి - జీబులైన, మీసములఁ గిల్లువాసన-మిగులఁ గొలుప.

శా॥ కైలాసంబును మేరు భూధరము ను - గ్రస్ఫూర్తిఁ జెండ్లంబలెఁ
దూలందన్ను బలిష్ఠ పాదములతో - దుర్వార వేగంబుతో
వేలావేష్టిత భూతలంబు తనతో - వెన్నంటి రా నాదితే
యాలోకంబుల నంతరంగముల న - ల్లాడించు రౌద్రంబుతో. ౧౪

ఉ॥ స్థూలములైన భూతములు - చొక్కముగా నొకరూపమందెసన్
పోలిక వాఁడు మేఘరవ - మ్ముం దలపించు నెలుంగువాఁడు గి
న్లాలసుఁ జిచ్చునిచ్చు నొక - లక్షయు నిర్వదియైదువేల నా
గాలి బలంబు గల్గిన య - జాండ భయంకర దుష్ట కర్ముఁడున్. ౧౫

చ॥ పెసిదములైన గుంపు మగ - పిడ్గులఁ బోలిన క్రూరకృత్యముల్
నడపెడువాఁడు కూళుఁడు చె - నంటి విరాధుఁడు డాసి వృక్షముల్
పెఱయుచుఁ జెల్ల గిల్లఁ బృథి ♦ వీ ధరముల్ వడి వ్రీల రేఁగి మం
దుడుకున దొడ్డ పిండ్లు గల - దోర్బలవీరులఁ గాంచి కేరుచున్. ౧౬

ఉ॥ కోఱలఁ జూపుచున్ బలుపు ♦ కొండ గుహాంబలె నోరువిప్పుచున్
మీఱి యదల్చి నిల్మనుచు ♦ భ్రమింగెడు పోలిక వచ్చి తెప్ప ల
ల్లాఱుచు నంతలోన నిక ♦ చాంబుజ మందు వసించు హంసి నా
సౌరు వహించు సీతఁగొని ♦ చయ్యన వ్యోమ పదంబు ముట్టఁగన్. ౧౭

మ॥ పురుషశ్రేష్ఠులు వానిఁ గాంచి మిగులం ♦ బొల్పారు కోపంబుతో
శరముల్ పింజ్లను గూర్చి వెంటఁ జనుచున్ ♦ జా వేఁడి యుల్లల రా
జరుగంజూచెదు రాక్షసాధమ! యికే ♦ చందాన నీవేగినన్
బరియల్ సేయక వీడఁ బోము నిలుమా ♦ పందా! యనన్ దైత్యుఁడున్.

మ॥ తొలి వేల్పిచ్చు వరంబుచేత నసువుల్ ♦ ద్రుంగింపలేరెవ్వరున్
బలిమిన్ ముజ్జగ మొక్కటై యెదిరి నన్ ♦ భంగింపఁగా లేదు నే
'నిల నేకైదువు లేకయే యెసఁగి మా ♦ యింతున్ సమస్తంబు మీ
కెలమిం బెట్టితిఁ బ్రాణ భిక్ష చనుఁడెం ♦ దే నీ చెలిన్వీడుచున్. ౧౯

మ॥ అన శ్రీరాముఁడు దంత కాంతు లొలయన్ ♦ హాసంబు గావించి యా
దనుజుం డెన్నఁడు పోరెఱుంగఁడు భుజో ♦ త్సాహంబు దర్పంబు నొ
క్క నిమేషంబున నూఱడిల్లి సమయుం ♦ గాకంచు లోనెంచి ని
స్వన పూర్ణంబుగ నారి లాగుచు ధను ♦ ష్టంకారముం జేయఁగన్. ౨౦

## విరాధయుద్ధము

తే॥ విరిసి యూర్ధ్వని సాగర ♦ వేష్టితంబు, కుధర భరితంబునైన యీ ♦ కువలయంబు
నమర నాగాది లోకంబు ♦ లధిగమించి, యశనిపాతంబు చందాన ♦ నతిశయిల్లె. ౨౧

తే॥ వంచక బిడాల వదన గ ♦ హ్వరము నందు, చిక్కి తపియించు చిల్కనాఁ ♦ జెలఁగుసీత
నిలను వదలి దైత్యుఁడు నంత ♦ చలితుఁ డగుచు, నంజనాద్రిఁ బోలినరాము ♦ నడరి[illegible]

శా॥ బేతాళాదుల యాఁకలిం దనుప వి ♦ ద్విడ్బృంద కీలాలముల్
జేతః ప్రీతి నొసంగి వారి వినుతుల్ ♦ చేకొంచు నాదిత్య హృ
ద్భీతిం గూర్చుచు బాడబానల శిఖా ♦ దీవ్యత్ప్రభాయుక్తమై
చేతం దాల్చిన శూలముల్ విసరె నా ♦ శ్రీరాముపై నుద్ధతిన్. ౨౩

ఉ॥ దిక్కులు దిక్పతుల్ సురలు ♦ దిక్కరులున్ భువనంబు సర్వమున్
దిక్కటి వెక్కసంపడ ను ♦ దీర్ణ హాలాహల మట్టురాగ, స
మ్యక్కులశైలమట్లు కన ♦ కాచల మట్లు వెలుంగు చాప మం
దొక్క యలుంగు గూర్చి చెవి ♦ యొందఁగ లాగుచు రాముఁ డేయఁగన్.

తే॥ అసుర కుల మెల్ల నేఁడె పొం ♦ గారె ననఁగఁ, బట్ట పగలు నక్షత్రముల్ ♦ పడియె ననఁగఁ
దుండ్లు తుండ్లయి శూలంపుఁ ♦ దుంట లెల్లఁ, జువ్వలట్టులఁ బఱచుచుఁ ♦ జొచ్చె దిశల.

చ॥ సురలకు మృత్యు హేతువగు ♦ శూలము త్రుంగుటఁ జూచి రక్కసుం
డురవడిఁ జేతులన్ మలల ♦ నూడ్చి రఘూత్తము పైనవైవ న
గ్గిరులను వజ్ర సన్నిభ ని ♦ కృంతన భల్లము లేసి త్రుంప నా
పరియలు వానిపై మరలఁ ♦ బాఱి శరీరము నొవ్వఁ జేయఁగన్. ౨౬

తే॥ దైత్యుఁ డంతట నొక మహా ♦ తరువు వెఱికి, విజ్ఞు లెవ్వని తత్త్వంబు ♦ వేడ్కఁ గాంత్రు
ధర్మ ముద్ధరింపఁగ నేఁడు ♦ ధరకు దిగియె, ప్రణవ మంత్రార్థ మెవ్వఁడా ♦ రామునేసె.

క॥ వీరుఁడు రాముఁడు నాలుగు, నారసముల దానిఁ ద్రుంచి ♦ నాటించెను నా
ఱాఱు శిత శరము లసురుని, పేరురమున బాహువులను ♦ భీకర లీలన్.

తే॥ కంటకములు వేధింప ముం ♦ గాళ్ల తోడఁ, దీయనెంచి సంకటపడి ♦ దేహమును వి
దిర్చికొను నేదువలెఁ దన్ను ♦ దివిరి నొంచు, ములుకులూడ మేనిని వాఁడు ♦ ముడిచి విడ్చె.

ఉ॥ నిప్పుల వంటి ముల్కు లవ ♦ నీవిభుఁ డేయఁగ నవ్వి మేనిపైఁ
గప్పక దూఱి దూయుటయుఁ ♦ గష్ట విచేష్టితుఁడైన కూళయున్
గుప్పున మేనినుండి వడి ♦ గ్రొచ్చిన గంటుల రక్త ధారలన్
దొప్పఁగఁ దోఁగి సత్త్వమును ♦ త్రుంగఁగఁ దెల్వి నశించి నిల్వఁగన్. ౩౦

చ॥ పిడికిటి పోరునందు బహు ♦ విశ్రుతవీరులు రామలక్ష్మణుల్
చెడని వరంబు గొన్న బల - శీలి యితండు శరాళిచేతఁ జా
వఁడు మరలన్ రణంబునకు ♦ వచ్చు నటంచు నరాసి దూసి కే
లెడయఁగఁ ద్రుంతమంచు ♦ ననురేశు భుజంబుల నెక్క నాతఁడున్. ౩౧

తే॥ పొంగిపాఱెడు శోణిత ♦ పూర మొప్ప, నంత దెలిసి భుజంబుల ♦ శూరవరుల
నొక్క నడక పదింతలు ♦ ఖిక్కటముగ, గగన వీథిని పఱచెన ♦ గ్గలిక మొఱయ. ౩౨

తే॥ కనక గిరిఁ జుట్టు చంద్ర భా ♦ స్కరులఁబోలి, యిరువురొప్పారనసురయుం ♦ బరమునందు
ర క్తకాయంబు తోడను ♦ ర్విక గదించి, దిరిగె గిరగిర శరధి మం ♦ దరము మాడ్కి.

ఉ॥ బంగరు చాయ వాఁడసిత ♦ వారిద వర్ణము వాఁడు బాహులన్
రంగరుచుండ మింటికిఁ ద్వి ♦ రక్ నెగయంజను సోఁకు చూడఁగా
సంగడి నన్నలం గొనుచుఁ ♦ జయ్యన మింటికి నేగు పాడి రూ
పుంగొని యొప్పు పక్షికుల ♦ పుంగవుఁ దార్క్ష్యుని బోలె నత్తఱిన్. ౩౪

క॥ కరుణాకరుఁడగు తనపతి సురరిపుచేఁ బడఁగ సీత ♦ ♦ సుకి వడి హాంసన్
దొరఁగిన హాంసిం బలె వా, డొరసిన సుమవల్లి వోలె ♦ నుర్వర వ్రాలెన్. ౩౫

తే॥ పదముపడి లేచి వేపోండు ♦ పలుకఁ దోఁప, కునికి నడు మసియాడ నా ♦ దనుజునంటి
చనుచుఁ దల్లి బోలిన దయా ♦ గుణుల పేడి, తన్ను భక్షింపుమని సీత ♦ ధరణిఁగూలె.

తే॥ పనవి పలుకులు తడఁబడఁ - బ్రాణములును, వాడఁ జేష్ట దక్కిన సీత - పగిది యెఱిఁగి
యన్నఁ గనుఁగొని లక్ష్మణుఁ - డార్య! దేవి, పరితపింప నిట్లుండుట - పాడియె? యన.

చ॥ జరుగఁగఁ దగ్గ త్రోవ యిటు - సాగుట మేలె యటంచు నెంచితిన్
దొరకొని వీనిఁ జంపుటది - దొడ్డయె? యంచు హసించి రాఘవుం
డురుతర పాదఘాతమున - నుర్విఁ గూలఁగఁ దాఁప వాఁడు పెం
దరువు ప్రభంజనాహతికి - ధారిణిఁ గూలిన పోల్కిఁ గూలుచున్. ౩౬

చ॥ ధరఁబడి రోఁజుచుండఁ గని - దైత్యుని రాజకుమారు లిద్ద ఱు
ద్ధురతర బాహుమూలములఁ - ద్రుంచుచుఁ దూఁక విరాధుఁ డుగ్రుఁడై
యురవడి సూర్యచంద్రుల స - ముద్ధతి మ్రింగఁగ వచ్చు రాహు వ
ట్లిరవుగ రామలక్ష్మణుల - నెత్తుగడం గబళింప వచ్చుడున్ ౩౭

చ॥ వ్రణముల నుండి యోడిగిలు - రక్తము పైపయి వృద్ధినొంద దు
ర్గుణుఁడగు దైత్యు ప్రాణములు - గ్రుంగమి రాముఁ డెడంద నెంచి ల
క్ష్మణుఁగని గుంట ద్రవ్వుము ని - శాచరుఁ బూడ్చుట యుక్తమన్న స
ద్గుణయుతుఁ డొక్క పల్లమును - ద్రొచ్చెను బాణబలంబునన్ వడిన్

చ॥ నదుల జలంబునందు జత - నంబున దోపిని పాచితంబుకై
వదలక ముంచునట్లు రఘు - వర్యుఁడు త్రోవఁగరాని దొడ్డ యం
గదలఁ దొలంచు భక్త జన - కామదమైన పదంబు తోడ నా
మదయుతుఁడైన రక్కసుఁడు - మ్రంగఁగ బల్లమునందు త్రోవఁగన్

చ॥ తొలుతను బ్రహ్మయై నెగడి ♦ దొడ్డ యజాండము సృష్టిచేసి యం
దుల వడిఁ దానొకఁడుంగను ♦ తోఁచిన రాముని కాలి తాఁకుచే

నలఘుఁడు సోఁకు పూర్వ మల ♦ కాధిపుఁ డిచ్చిన శాపశక్తిచేఁ
గలిగిన ఘోరరూపమును ♦ గ్రక్కున వీడి గమించె మింటికిన్. ౪౨

తే॥ ఎగిరి గంధర్వుఁడై నిల్చి ♦ యింద్రియముల, విషయములకు వశంబయి ♦ వీఁగుబుద్ధి
మాఱు సుజ్ఞానియై భక్తి ♦ మనసు నందు, గలుగ రాఘవు వినుతించె♦గౌరవమున. ౪౩

విరాధుఁడు రాముని వినుతించుట.

చ॥ శ్రుతులు నుతించు నీదగు వి ♦ శుద్ధ పదంబులు సర్వలోక సం
గతములు గాఁగ వ్యాప్తిగొనఁ ♦ గాఁ గడ మంగము లెట్టి వ్యాప్తివో?
రతనపుఁ డెంకి యందునఁ ది ♦ రంబుగఁ గాక యొకండొకంటితో
నతుకని పంచ భూతముల ♦ యందును నిల్చిన నిన్ భరించునే? ౪౪

మ॥ గజనాథుండు జలగ్రహ గ్రహణ దుః ♦ ఖంబంది కేలెత్తి యో
త్రిజగద్వంద్య! ముకుంద! దేవ! శరణా ♦ ర్థింజూడవే ప్రోవవే
భుజగాధీశ్వర తల్ప! యంచుఁ బిలువం ♦ బూర్ణాను కంపామతిన్
నిజ సంశీలత దంతిఁ గాచితివి ని ♦ ర్ణిద్రాప్ర మేయాకృతీ! ౪౫

తే॥ ఇహపరంబులు గన నడు ♦ నెడను నిలిచి, స్థిర కృపాకటాక్షంపు వీ ♦ చికలఁబరపు
దేవ! నీవొకో! ధర్మము ♦ స్థితిని మనుప, నొంటరిగ గాలిపడగ నా♦నొలయుచుంటి. ౪౬

ఉ॥ పుట్టుట గిట్టు టాటలుగఁ ♦ బూన్చిన దేవ! విరాగ పూరుషుల్
పుట్టిన వారి పూర్వగతి ♦ పోవునె? తక్కినవారి కై వడిన్
బుట్టుదు రేమి? తొల్లి తమ ♦ పొందిన సంస్థితిఁ బొందు టబ్రమే?
యిట్టుల మైన సద్యశము ♦ నెల్లెడ నించిన రాఘవేశ్వరా! ౪౭

చ॥ భయమును కూర్చునట్టి భవ ♦ వారిధి దాఁటఁగ నాశ్రయంబుగా
నయగతిఁ బూను సర్వమత ♦ నాయకులట్టి మతాధిదేవతల్
నియమిత తత్త్వరూపివయి ♦ నీవు జగంబుల నుల్ల సిల్లనే
జయ మహిమంబు లొందుదురు? ♦ సల్పున దెయ్యది? రాఘవేశ్వరా! ౪౮

తే॥ బ్రహ్మ మొదలుగ నెల్ల ని ♦ ర్జర వరులకుఁ, దక్క ప్రాణులకు మొదలి ♦ తండ్రివీవ
యైనచో లోక ధర్మంబు ♦ ననుసరించి, కాంచి పెంచెడు తల్లిగాఁ♦గాలు లెవరొ? ౪౯

ఉ॥ నీవె పరాపరంబు, గతి ♦ నీవె, సమస్త మహాండ జాలముల్
నీవె, చరాచరంబులును ♦ నీవె, విచారణ చేయఁ దేఱుటల్
నీవె, మతంబు లన్నియును ♦ నీచరణావధులే, యిటేల మా
మావిధిఁ గ్రీడసేయ వల ♦ పా? మఱి ద్రొంగ విధంబు లేల్లొకో! ౫౦

ఉ॥ రాసరుదైన వాని క్రియఁ ♦ గ్రాలుచు వచ్చు మహేశ! ధేనువుం
గానని దూడ వత్సమును ♦ కానని గోవును లేవు; లోకజా
లానకుఁ దల్లి నీవయిన ♦ లాలిత రీతి నెఱుంగు దెల్లయుక్
గానఁగఁ జాల దీ జగము ♦ గాంచిన తల్లి నిదేమి మాయయో?   ౫౧

చ॥ జనములు పెక్కు దైవముల - సన్నుతి సేయఁగ నిచ్చగింతురై
నను నినుగాక యన్యమగు - నాయకదైవము గల్గునంట స
జ్జనుల కనర్హమా; కమల - జ త్రిపురాంతక నిర్జరావళుల్
వినుతి యొనర్చ్రి నిన్నెయని - విజ్ఞ సమూహ మెఱుంగ కున్నదే?   ౫౨

తే॥ శ్రీనివాస! రమేశ! నిద్ర! జగతిఁ, బలుమతముల దైవములు ద్వంద్వములఁదగులు
వారివలెఁ దపించు; ని - ర్ద్వంద్వుఁడైన, యీవు నిద్రింప కేవేమ - మేలకొంటి?.   ౫౩

తే॥ మోయుచున్నాఁడ వహివయి, భూవరాంగి, నెత్తుచుంటివి పోత్రివై - యెలమితోడ
గ్రుక్కగొందు వొక్కొకపరి-కొలుచుచుందు, విద్ది శ్రీదేవి యెఱిఁగిన-నెరియకున్నె?.

తే॥ నీవు పుట్టించు జీవులు - నిజము నెఱిఁగి, కొలల దానిచే నికింత - కొదువ పడునె?
శర్వునకు నిచ్చు భిక్షచే - శంకపడిన, వారు మర్త్యు లమర్త్యులి - ప్పటికిఁ గలరు.   ౫౪

మ॥ భువనోద్ధారణ! హంసవై నిగమముల్ - బోధించి తా బ్రహ్మకే
య్యవి నీకెవ్వరు మున్ను నేర్పి? రలవా - రంతంబు పాటించిరే?
భువి జీవాత్మల వేఱయి యొకటియై-పొంకంబుగానుండు నం
భవ మవ్వానిని వీడియో? విడకయో? - భావింప నేమాయయో?.   ౫౬

చ॥ అసదృశమూర్తి! నీవు తొలి - నాదటఁ బండిన పాలవెల్లిఁ బా
ప సకిన మంచము స్వీకరించి - పాపుని దాసుని గాచుకై కృపా
రసము వహించి వచ్చి తమ - రక్ష భవసాగర మీఁదఁగంటి నిం
పొసఁగు భవత్పదాబ్జ మహి - మోన్నతి నేమని సంస్తుతింతునో?   ౫౭

తే॥ ఇట్లు వినుతించు నతని సీ-తేశుఁడరసి, యిట్టిజన్మంబు రాఁగత - మేమి తెలుపు
మనుడు నాతఁడసత్య జీ - వనము తొలఁగ, జ్ఞానమొసఁగు పదాంక! నా-చరిత వినుదె?

తే॥ అలకవాసిని తుంబురుఁ - డనెడు వాఁడ, రంభ నాట్యగానంబు లా - రంగఁ గాంచి
వలచి కలియుటచే శ్రీద-వలన నాకు, నిట్టిజన్మంబు సిద్ధించె - నేమి సెప్ప?   ౫౯

తే॥ తొడఁగి జ్ఞానంబు మొదలంటఁ-ముడిచివైచు, కామరుజనన్ను వెన్నంటఁ-గలుగుకతన
కరుణ మాని కుబేరుండు - కఠిన దైత్య, రూపి వగుమని తిట్టనీ - రూపువచ్చె   ౬౦

క॥ ఈశాప ముక్తి తెలుపఁగ, దే శంకరమిత్ర! యంచునే - వేఁడ భవత్
పేశల పద తాడనమున, నీశాపము దీఱునంచు - నెఱిఁగించె దయన్.   ౬౧

క॥ స్వర్గపదం బెల్లెడల స, నర్గళ గతిఁ దిరిగి వేఁచు - నరహంతకుఁడై
దుర్గముఁడై దానవకుల, మార్గుఁడగు కిలింజునకుఁ గు - మారుఁడనై తిఁక. ౬౨

క॥ మంచియుఁ జెడుగు నెఱింగెడు, నంచిత మతిలేక చెడుగె - యార్జించితిఁ గా
న్పిం చిన ప్రాణుల పీడక, వంచి విఱిచి పొట్టఁబెట్టు - వంచనకతనన్. ౬

తే॥ నన్ను సద్గతికిం ద్రిప్పు - నున్ననాము, పూర్వకృతపుణ్యమున నిట్లు - పొగడఁదగిన
నిగమ నిశ్శ్రేణిగల పద - నీరజములఁ, బొంది తేఱితి నెప్పటి - పొలుపు గొంటి. ౬౪

తే॥ నన్ను భ్రంశించు పాప గ - ణంబులడఁచు, నిన్ను వెడఁగనై నేఁచేయు - నేరములను
మన్నన యొనర్చి ప్రోవు స-న్మాన్య! యనుచుఁ, గ్రన్న సెలవంది దివ్యువెు-గంబునొందె.

తే॥ సాధువుల బాధ సేయు వి ♦ రాధుఁ డీగ్గె, ననుచు నలరిన విమలాంగి ♦ జనకజాతఁ
గూడి వేడుక వనములఁ ♦ బాడుచుండు, పక్షి రుతముల వినుచు న ♦ వ్వారుచనిరి. ౬౬

తే॥ కాలుఁ బోలు శరంబులు ♦ కరములందు, గలుగు రామ లక్ష్మణులు నాఁ ♦ డెలమి మిగుల
వేదములె రూపునొందిన ♦ విధిని వెలయు, మునుల వనముల మసలిరి ♦ ముదితతోడ.

## ౨. శరభంగ ముక్తి పటలము. (౪౪)

క॥ ఆరాత్రి వికచ సుమలత, సొగసుగల మహీజ తోడ - సౌఖ్యంబుగ న
య్యారామమందు కడపి శు, భారంభకులు శరభంగు - నరయఁగఁ జనుదున్. ౬౭

క॥ సునిశిత శరసంపన్నులు, ఘను లచటికిఁ జేరునంతఁ - గలునల దొర పు
ట్టిన ముదుఁగని తమ్ములఁ బో, ల్కను లోకవెయి గలుగు ప్రోడ - గానఁగనయ్యెన్.

క॥ తెలిపిట్ట నడకగల వే, ల్పుల చెలువలు దాల్చినట్టి ♦ భూషణకాంతుల్
మిలమిల మని మిన్నున మెఱు, పులు మెఱయఁగ వాని నడుమఁ ♦ బొలుపుగొలుపుచున్

చ॥ పెలుచగు నీలదేహమున ♦ వేల్పు పడంతుల యాస్య పద్మ కో
మల వన చారులోనయన ♦ మంజుల భృంగ సహస్రకంబుతో
గలహ సుఖాశిచే మహతి ♦ క్రమ నినాద మధుద్రవంబు ని
మ్ములఁ జవిచూచుచుండు శ్రుతి ♦ పుష్పలిహంబులతో ముదంబుతో.

తే॥ శాస్త్ర సమ్మతముగఁ గ్రతు - శత మొనర్చి, నట్టి మేటరి; మూర్త్రిత - యంబుదక్క-
దక్కు వేల్పుల మకుటము.ల్దాఁకు నట్టి, గండ పెండరములు కాళ్లఁ - గలుగు వాఁడు.

తే॥ జలజవాసినిఁ బోలిన - శచిని గూడి, ముమ్మదంబుల చౌదంతి - నెమ్మినెక్కి-
వెండికొండపై నగజతో - వేడ్కనుండు, లోకనాథుని శంభుని - జోక నెనసి. 23

తే॥ ఏను కలిగి వ్యర్థంబని - యెంచి విధుఁడు, బిడియ పడి కాంతి హీనుఁడై - వెల్లఁ బాఱ
స్వర్గమే గొడుగయి తన - పైన నిలుచు, డంబు పంబు శ్వేతాతప - త్రింబుతోడ. 24

తే॥ దిక్కరుల మదమును బట్టి - దిక్కుఁ జుట్టి, యవరముల యందు ధృతిచెడి - యడలి పాఱు
సురవరుల కీర్తులఁ బట్టి - యంటఁగట్టె, నట్టులున్న వింజామర - లండ బెరయ. ౭౫

తే॥ అరుణ కిరణంపు నిల్చిన - యట్టులున్న, మేటి బొమ్మి డికెము తల - మెఱయువాఁడు
కౌస్తుభంబు కైవడిని ప్ర - కాశ మమరు, రత్న హారంబు లొమ్మునఁ - గ్రాలువాఁడు

తే॥ భాను సంకాశ రంజిత ♦ వజ్రఖచిత, కవచ మవయవంబుల మీఁద ♦ గలుగువాఁడు
విజయలక్ష్మి మందస్మిత ♦ విధము దోఁచు, హార కేయూర భుజములొ♦ప్పారువాఁడు

తే॥ లెక్కలేక రత్నంబులు ♦ చెక్కినట్టి, నగల జిగియెల్ల నొక్కటై ♦ నెగడి చిత్ర
ఫక్కి వెలుఁగంగ నింద్రచా♦పంబుతోడి, మొగులుకుప్పనాఁ దగి జాలు♦మునుముువాఁడు.

తే॥ సకలజగములఁ బరవు వా ♦ ననలు గలుగు, మధువు చిందెడు క్రొవ్విరి♦మాలవాఁడు
మీాల గెలిచిన వేలుపు మెఱుఁగుఁ బోండ్ల, కనులఁ బోలిన ఖడ్గంబు♦గలుగువాఁడు. ౭౭

తే॥ భువన కంటకుఁడగు పది ♦ మోము లతని, మీఁద వైవఁగ వరిముక్కు ♦ మేరయేని
మొక్క వోవక కాంతియుఁ ♦ బొలియకుండు, పవిని చేపట్టు నింద్రుండు ♦ పజ్జనిలిచె.

తే॥ ఉరు తపోధనుఁ డెదురేగి ♦ యుపచరించి, వచ్చుపనియేమి యన వజ్రి ♦ పలికెనిట్లు
నీతపంబును మెచ్చి య ♦ బ్జాతభవుఁడు, తోడి తెమ్మన వచ్చితిఁ ♦ దోడరమ్ము. ౮౧

తే॥ ప్రస్తు మీకిచ్చె నాతని ♦ సత్యలోక, మీారు వేంచేయ ధాతయు ♦ నెదురువచ్చు
శ్రేష్ఠ లోకంబనుచు దానిఁ జెప్పవలెనె?, యీార లెఱుఁగరే యన నాతఁ ♦డిట్టులనియె.

తే॥ కదలఁజాలని బొమ్మల ♦ కరణినుండి, చెడెడు సత్యలోకంబు నేఁ ♦ జేరఁగలనె?
బాధ తపమూని పెక్కు క ♦ ల్పములు గడచె, నీవెఱుంగవె? యల్పంబు ♦ నిచ్చగింప.

తే॥ ఇట్టివార్త సీవును వచి ♦ యింపఁ దగునె?, బ్రహ్మలోకంబు పడసియు ♦ ఫలముగలదె
బహుళ భావలఁ కేల? త♦పః ఫలమ్ము, వొందు కాలంబు డగ్గఱె ♦ భువనవంద్య! ౮౪

తే॥ సుస్థిరంబయి నిలుకడ ♦ చొప్పు చెడక, పెరుఁగక నశింపక గుణము ♦ వేఱుపడక
సకల భూతముల్ నశియింప ♦ సమయకుండు, మోక్ష పదవిని నేనిప్డు ♦ పొందువాఁడ.

## రామలక్ష్మణులు శరభంగుని చూడవచ్చుట

తే॥ ఇట్లు శరభంగ ముని వచి ♦ యించు నెడను, దృఢధనుర్ధరులటువచ్చి♦యెదుటఁగలుగు
కలకలంబును విని యేమి ♦ కత మొయనుచుఁ, దమ మనంబుల యోచించి♦దాసి కొంచి

తే॥ బలితమై వజ్ర ఖచిత సం♦బములు వెలయు, నాల్గు రదనముల్ గల సిత♦నాగముఁగని
యింద్రుఁ డిమ్మునీంద్రుని గన ♦ నేగుదెంచి, యుండునని మదిఁదలపోసి♦యుత్సహించి

క॥ హరిణాక్షిని తమ్ముని ముని, వరు నాశ్రమ వనముబయట ♦ వదలి యొకండే
హరివలె వృషభమువలె రఘు, వరుఁ డట కరుదెంచె వర త ♦ పస్విం గాంచెన్

క॥ సురలోక నాయకుండీ, ధరనాలుగు వేదములకుఁ - దథ్య ఫలంబౌ
వరమూర్తి రామభాస్కరుఁ, బరుఁగాంచె సహస్రనయన-పద్మము లలరన్. ౮౯

తే॥ కాంచి మదినొచ్చుకొని తన్ను ♦ గాచుఁ దెలిసి, బ్రహ్మవిద్వరులకు నధి ♦ పతియునైన
రాము సలితంబు మ్రొక్కి శిరంబుతోడ, భుజములను వంచి సాష్టాంగ♦ముగ నెఱంగె.

సీ॥ జయకేతనం బెత్తి ♦ శత్రులఁ బరిమార్చి, వేదార్థముల నేర్పి ♦ విశద ఫణితి
సద్ధర్మమును సదా ♦ సన్మార్గముఁ ద్రిప్పి, సంపదనొసఁగి మో ♦ క్షంబు నిచ్చి
శరణాగతులకు వ ♦ జ్ర కవచ మయ్యును, ప్రాణంబులయ్యుఁ ♦ దపంబు నయ్యు
నయనంబులయ్యు సు ♦ జ్ఞానంబు నయ్యు వే, ల్పడక రక్షించు శ్రీ♦రాముఁ జూచి

తే॥ యధిక సమ్మోద భరమున♦సవశుఁడగుచు, మనసుకరఁగిఁ బజ్జనునిల్చి ♦మఘవుఁ డంత
నేమి తెలియని కరణిఁ దా♦నెఱిఁగి నంత, తెలియఁ బలుకుచు నిట్లు స్తు♦తింపఁదొడఁగె

## ఇంద్రుఁడు శ్రీరాముని స్తుతించుట.

సీ॥ ఎల్ల వస్తువులందు ♦ నేకరూపం బంది, యంటి యంటకయుండు ♦ నాత్మరూప!
నిన్నంగ నియత ము ♦ ని ప్రవరాధార! వేదాంత విద్యావి ♦ వేక వేద్య!
కరుణాసముద్ర! ర ♦ క్షణకార్య నిర్నిద్ర!, తల్లియు నీవ మా ♦ తండ్రి నీవ
దాసులమగు మేము ♦ దైత్యులచేఁ బడ, రాని పాటులు పడి ♦ దీనులమయి

తే॥ త్వత్పదంబులఁజేరి కా ♦ పాడవేఁడ, నాఁడొసంగిన యభయంబు ♦ నేఁడుపూర్తి
సేయ నిట్టులే తెంచిన ♦ చిన్మయుఁడవు, నీపదాబ్జాతముల భువి ♦ నీతినొందె. ౯౨

సీ॥ క్షీరసాగర శయ ♦ నా! రమాలోల! నీ, కెవరు మిత్రులు? శత్రు ♦ వెవరు? రేయి
యెయ్యది? పగలెది? ♦ యెందు గలవు బాల్య, తారుణ్యవార్ధక్య ♦ దశలు నీకు
నెదియాది? యెదిమధ్య? ♦ మెదియంత, మగుఁగాంచ? లింగవచన నామ ♦ లీలగలదె?
ముందేది? వెనుకేది? ♦ సందేది? యెడమేది? ♦ పొందేది? యెడయేది? చందమేది?

తే॥ అట్టి నీవిట్లు పురుషమై ♦ మానుఁడవగుచుఁ, జేతఁ గోదండమూని మా♦చేతములును
నొవ్వ నడవకుండిన నీకు ♦ నెవ్వగలదె?, చిత్తరంజన! మఱుమేలు ♦ చెందఁగలదె? ౯౩

సీ॥ నీనాభిఁబొడమిన ♦ నీరజోద్భవుఁడు వి, లయ కాలముల నెల్ల ♦ లలితరీతిఁ
గొలత కట్టఁగఁజేసి ♦ పలుకల్పకాలముల్, గొలిచినఁదఱుఁగని ♦ గుణగణాఢ్య!
మున్ను మేదినికుంభ ♦ ముగ నీరుపెరుఁగుగా, మందరగిరి తరి ♦ భ్రమానుగాఁగ
నీహస్త పద్మంబు ♦ లోహటింపక నొవ్వఁ, జిలికి పీయూషంబు ♦ చిక్కఁదనుకఁ

తే॥ దాని మాకు మాత్ర మొసంగి ♦ దైత్యవరుల, మోసగించితి వలపక్ష ♦ మూసఁజేసి
దాసులము మేము వారు శా ♦ త్రవులె నీకు?, ధర్మవైరంబు నడఁగించు♦తలఁపుగాక

చ॥ ఎదుట నొకండవై కిసల ♦ యోత్తమువై తుది నొక్క చా లన
త్పర! గుణాతిత్త్వ భూజ నవ ♦ పల్లవ! మాకు వెత దీర్చునాయకా!
కదియుచు సజ్జనావళులఁ ♦ గాచెదు దుష్టులఁగోపగింతు; దు
ర్మద మొనరించు దుష్కృతియు ♦ వహాయురె! నీవగు సృష్టియే కదా! ౯౫

శా॥ మాయాబా వేష్టిత చిత్స్వరూప! జనము నీ ♦ మాయచేఁ బ్రభిన్నింప నీ
వే యధ్యాత్మ్య వటంచుఁ గాదనుచు ను ♦ ద్యోలాడు డెందంబులన్
నీయాధిక్యము సన్ముమల్ భృగునిచే ♦ నిక్కంబుగాఁ జూచు నో
నీయొయ్యారిత్వ మెలర్పఁ జేసితి జగ ♦ న్నిర్మాత వంచేర్పడన్. ౯౬

తే॥ ఇట్లు మహాభాగులను నుతి ♦ యించి యింద్రుఁ, డచటిమునికగు భాగ్యంబు ♦ నరసియంత
వర మునీంద్రుని యానతి ♦ వడసితాను, వచ్చుదారిని మరలి ది ♦ వంబుచేరె. ౯౭

సీ॥ తరలిన యింద్రుని మది బుషి, వరుఁడు జెలిసిరాముకడకు ♦ వచ్చిన నతఁడ
ప్పరమ మునీంద్రుని పదముల, కెరఁగి ముదశ్రువులు పులక ♦ లెగయఁగ నతఁడున్. ౯౮

క॥ సుకముగ వర్ధిలుమని జా, నకితో లక్ష్మణుని రమ్ము ♦ నన్ వారలు కౌ
తుకముస వచ్చిరి రాముఁడు, స్వకీయ పూర్వ సుఖ నిభ శు ♦ భంబులఁ దేలన్. ౯౯

క॥ రాముఁడు సీతయు లక్ష్మణుఁ, డామాపమ్మని వచించు ♦ న్యాయము లెల్లన్
బ్రేమమున వినుచుఁ గడపిరి, భాముం డుదయించు దనుకఁ ♦ బ్రమదాలసులై. ౧౦౦

తే॥ పరవి యుఅనగు కాంతులఁ ♦ బరఁగు భానుఁ, డొక్కటిగ నల్లుకొని యున్న ♦ దిక్కుడుంగ
మందు కరముల నాతప ♦ మను నరాసిఁ, గొని తమంబను తీఁగలఁ ♦ గోసివైచె. ౧౦౧

శరభంగుఁ డగ్నిం బ్రవేశించి శాశ్వతపదంబు నొందుట.

తే॥ తత్త్వవిజ్ఞాని! శరభంగ ♦ తాపసేంద్రుఁ, డతని యెదుట నగ్నిని చేర ♦ నాత్మ నిశ్చ
యించి విధ్యుక్తముగ వహ్ని ♦ యేర్పఁడించి, నాకు సెలవిండనుచుఁ దన్మ ♦ నంబునిల్పె

ఉ॥ చాప విశారదుం డపుడు ♦ శాస్త్రవిశారదుఁగాంచి పల్కెనో
తాపసచంద్ర! మీరిట ను ♦ దంబునఁ జేసెడు కార్యమేది? మా
కోపికఁ దెల్పుఁడన్న నతఁ ♦ డొయ్యన నిట్లను రామచంద్ర! నే
దీపిత వహ్నిఁజొచ్చి ముగి ♦ తిం గొననెంచితి నాఁ గృపాళుఁడున్. ౧౦౩

తే॥ తాపసేంద్ర! నేవచ్చిన ♦ తరుణ మండె, చేయుటేల? యను క్షమార ♦ సింహుఁగాంచి
మారజితుఁడైన తపసి రో ♦ మములు నిక్క, నిట్టలంపు మోదంబున ♦ నిట్టులనియె.

తే॥ విజయ శీల! నేనిచ్చట ♦ వేవిధములఁ, దపము సేయుచున్గంటి నీ ♦ దర్శనంబు
గలుగునను నమ్మకంబుతోఁ ♦ గలిగె నేఁడు, ద్వంద్వములునశియించెనేఁ ♦ దలఁతుము క్తి.

తే॥ నిన్న మాపున వేల్పు మ ♦ స్నీఁడు వచ్చి, బ్రహ్మమీాకిచ్చెఁ దన సత్య♦పదము రండ
నంగఁ బరమపదంబు నొం♦దంగఁ గోరి, యచటి కేగక నిలిచితి♦నయ్య! యనుచు.

చ॥ మనసునకున్ వచస్సులకు ♦ మానిత నైగమ శాస్త్రపాళికిన్
దనరఁగ నందకుండు పర ♦ తత్త్వముఁ గాంచిన మానిచంద్రుఁ డిం
పునఁ గరుణింపుమంచుఁ దన ♦ పొల్తుకతో ననలంబుఁ జొచ్చి తా
ననుపమ మోక్షభాగ్యరమ ♦ నందె జనంబు వెఱంగు పొందఁగన్. ౧౦౭

ఉ॥ భావియెఱుంగు పంకజ భ ♦ వ ప్రభృతి త్రిదశాలిచేత వి
జ్ఞావలిచే మమత్వము న ♦ హంకృతి పూర్తిగ నుజ్జగించి ద్వం
ద్వావధి వీడి చేరఁదగు ♦ నట్టి మహాపదమున్ భజించె న
ప్పావని తత్త్వవేత్త శర ♦ భంగుఁడు పెన్నిధి రాము సన్నిధిన్. ౧౦౮

మ॥ ఒకచో నాడిన యాటవస్తువులఁ దా ♦ నుత్సంగ మందుంచు బా
లికపోల్కిన్ సకలాండ జాలముల నో ♦ లిం గర్భముం జేర్చు న
య్యకలంకేశుని నామ సంస్మరణ పు ♦ ణ్యంబెన్నఁగాదన్న, నా
యక శ్రీరాముని గాంచువారు కను భా ♦ గ్యంబద్ది సామాన్యమే? ౧౦౯

## 3. అగస్త్య పటలము. (౩౯)

తే॥ అట్లు శరభంగుఁడంతంబు ♦ నందఁగాంచు, కతన వ్యాకులతఁ బొంది ♦ ఘనగభీరు
లతని యాశ్రమస్థలి వీడి ♦ యవలి కేగి, రవనిజం గూడి విసుఁగుతో ♦ నాదతోడ. ౧౧౦

క॥ వనములు వృక్షంబులు నదు, లును గిరులును కొండచఱియ ♦ లును మనమలరన్
గనుచుఁ గుసిగుంపు వడయక, చని రమ్మువ్వురును దాఁటి ♦ సమ్మదలీలన్. ౧౧౧

తే॥ వలువమనువులు వాలఖి♦ల్యులునుమాన,యఁతులు బోడలుజటిలులు♦యతివరులును
దండకారణ్య వాసు లౌ ♦ తపసులెల్ల, ముదమునంది రాముని గన♦నెదురుకొనిరి.

క॥ క్రూరగుణుల రాకాసుల, పోరుపడఁగ లేక క్రుంగి ♦ పొనుఁగు పడిన య
వ్వారలు రాముఁగనిరి జల, ధారలఁ గనినట్టి మ్లాన ♦ తరువులఁ బోలెన్. ౧౧౩

క॥ పెలుకుఱి రాకాసుల పే, రులు తడఁబడఁ బలికి దుఃఖ ♦ రోగులయిన మా
నులు మ్రందు నడవి వెలువడి, తలఁ గను క్రేపుల విధానఁ ♦ దనిసి రెడఁదలన్. ౧౧౪

క॥ రాక్షసులు సేయు బాధల, మోక్షము గనలేక కుందు ♦ మునివరు లబ్ధిన్
రక్షింప నౌక రా నుప, లక్షించిన పగిదిఁ గని తొ♦లంచిరి కలఁకన్. ౧౧౫

క॥ తమ తపమే పండయి గా, రమున నెదురు వచ్చు పగిది ♦ రాముఁడు రా మో
దమున మునులు భవ కారా, విముక్తి గను యోగులట్లు ♦ విలసిల్లి రటన్. ౧౧౬

క॥ కోరిన వారికిం గోరిక, కోరిక లిడు తపము నూని ♦ గురుశాంతులునౌ
కారణమున రాకాసుల, పోరుపడగ లేక కష్ట ♦ ములం బడి రోర్మిక్. ౧౧౭

క॥ లేచిరి వచ్చిరి మేఘము, పూచిన ఘనంబోలు రాఘ ♦ వుని డాసి రతం
డేచిన భక్తిని మ్రొక్కిన, నోచిన ఫలమొందు వరుస ♦ నొసఁగిరి జయముల్

తే॥ వారిఁ గొనిపోయి చక్కని ♦ పర్ణశాల, నొసఁగి యాతిథ్య మిడి తమ ♦ యునికి కేగి
యవల సోఁకులవలన సంభవములైన, తొందరల నంతరలఁ దెల్పఁ ♦ దొడఁగి చనిరి

ఆ॥ వచ్చు మునులఁ గాంచి ♦ చెచ్చెరఁ గూర్చుండఁ, జనిచి యాజ్ఞయడుగ ♦ వారు తనిసి
చక్రవర్తి తనయ! సమకుజేనట్టి మా, నొగులు వినుమ యనుచు ♦ నుడివిరిట్లు. ౧౨౦

చ॥ కనికర మింతలేని మది గల్గిన రక్కసిమూఁక పాప వ
ర్తనమునఁ గష్టపెట్టి చెడు ♦ దారులఁ దీసి తపంబు పాడుగా
నొనరిచి చేయరాని కడు ♦ నొప్పములం బొనరింప మాతపో
ఘనపథ ముజ్జగించి కడ ♦ గండ్లను పొందుచు నుంటి మిచ్చట్. ౧౨౧

తే॥ పులులవనమున జింకల ♦ పోల్కి మేము, రేయిఁబవలు గగ్గోలొంది ♦ కృశతనంది
చితికి ధర్మపథంబు వీ ♦ డితిమి మాకుఁ, దలఁప ముక్తి యుఁగలదె కో ♦ దండపాణి!

ఉ॥ కాము తపోనియుక్తులము ♦ కాము శ్రుతుల్ చదివించు వారముం
గాము పఠించువారమును ♦ కాము మఖంబులు వేల్చువారముం
గాము పరార్థ చింతకులు ♦ కాము నియామక కార్యనిష్ఠులుం
గాము గురుత్వవర్తనులు ♦ కామికి బ్రాహ్మణులున్ రఘూత్తమా! ౧౨౩

తే॥ ఇంద్రుఁడో దానవుల యాజ్ఞ ♦ యొడఁదయందు, శిరమునందును తాలిచి ♦ చెలఁగువాఁడు
కాన మాతండ్రి! మాకడ ♦ గండ్లఁ దీర్చు, వారులేరు మాభాగ్యాన ♦ వచ్చితీవు.

తే॥ రాజరాజ సుతుండవు ♦ రాత్రివంటి, దుఃఖమున నేమి యెఱుఁగక ♦ దొరలుచుండఁ
దివిరి రవివోలె నీవరు ♦ దెంచి తయ్య, అభయమంటిమి కరుణామ ♦ యాత్మ! కావు.

శ్రీరాముఁడు మునుల కభయ మిచ్చుట.

తే॥ జనకజాజాని యిట్లను ♦ దను జవరులు, నన్ను శరణొందలేని యెం ♦ దున్న నేమి?
మచ్ఛరాసన నిర్ముక్త ♦ మార్గణముల, నేలఁ గూలు వారలు దుఃఖ ♦ మేలమీకు?

ఉ॥ తండిరినాకమేగఁ, బిన ♦ తల్లి వరంబులు గోర, నాదు త
మ్ముండును నిందకై యడల ♦ భూరిగుణాఢ్యులు పౌరులేడ్వఁ, గో
దండము నూని సీతయును ♦ తమ్ముడుఁ దోనరుదేర, నిట్లు నే
దండకఁ జేరుకొన్న మదు ♦ దాత్త చిరంతన దిష్టమే సుమీ. ౧౨౭

ఉ॥ ధర్మపథానువర్తుల యు ♦ దార మహాత్ము మెఱుంగలేని యా
దుర్మతులన్ వధించి మహిఁ ♦ దోరపు ధర్మము నిల్పనేని నేఁ
గార్ముకమున్ ధరించి వృథ ♦ గాదె జగంబున సంచరించుటల్?
నిర్మల భాగ్యమన్న మాకు ♦ నెక్కానునే యితరంబు నాకికిన్? ౧౨౮

తే॥ ఘన తపస్వులరగు మీరుఁ - గష్టులైన, రక్కసుల సంబంధములు నశ ♦ రనము సేయ
ధనువుమోసిన నాశాహు - దండములును, దగిన విశ్రాంతి నొందుత - ధరణియందు.

తే॥ గోవులను విప్రులను దీన-కోటి శరణు, చొచ్చువారి రక్షణముకై - చచ్చువారె
వేలుపులు గూడ గనుతింప-జాలినట్టి, దేవతా శ్రేష్ఠులగుదురు - దివమునందు. ౧౩౦

తే॥ తారకారి త్రిపురవైరి - దనుజవైరి, వచ్చికాచిన, నెవరు దు-ష్టుపథులు వారి
వారివారిని తుదముట్ట - వచ్చువాఁడ, శంకమాని సుఖంబుండుఁ-డింకమీరు. ౧౩౧

క॥ అనిన విని మదిని ముదమం, దినవారు త్రిదండములను - త్రిప్పుచుఁ బన్నా
లను పఠియించుచు నర్తన, మొనరించుచు నిట్టులనిరి - ప్రోత్సాహమునన్. ౧౩౨

క॥ లోకేశ! నీవు కినియఁద్రి, లోకంబులఁ బోలు కోటి - లోకము లెదురై
తాఁకిన నేమగు? నిక్కపు, సాకిరు లీ శ్రుతులు తపము - జ్ఞానము తగవున్. ౧౩౩

క॥ కావున నీగడువగు నేం, డీవనమున నిలిచి మాయ - భీష్టార్థంబుల్
కావింపు మనఁగ రాఘవ, భూవిభుఁ డందుండ మోద - మున నీకొనియెన్. ౧౩౪

ఆ॥ వారలటఁ బదేండ్లు ♦ వసియించి యుండిరి, మునులు పిదప దీర్ఘ ♦ ముగఁ దలంచి
యుద్ధగుణుఁ డగస్త్యుఁ ♦ డెలమి వసించు న, వ్వనముఁ జేరఁడన్న ♦ వారలేగి. ౧౩౫

సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుం గాంచుట

ఆ॥ భీటలైన చోట్లు ♦ వెదురులు గలచోట్లు, పొదలు దట్టమైన ♦ పదములందు
చనుచు వడి సుతీక్ష్ణుఁ ♦ డను బ్రహ్మతేజస్వి, తపమొనర్చుచున్న ♦ తలము గనిరి. ౧౩౬

ఆ॥ గర్వ రహితులైన ♦ కాకుత్స్థ వర్యుల, మ్మునికి మ్రొక్క నతఁడు ♦ ముదముతోడ
నిట వసింపుఁ డనుచు ♦ హితమతిఁ బల్క వా, సిత సుగంధ వని వసించినారు. ౧౩౭

క॥ శ్రీరామునకుం దగు నుప, చారమ్ములు చేసి వత్స! సమ్మద మారన్
మీరిట కరుదేరఁగ నే, సారిన నాతప మదెంత ♦ యతిశాయి యొకో!. ౧౩౮

క॥ అనవుడు రాఘవుఁ డిట్లను, మునివర! బ్రహ్మన్వయమునఁ ♦ బొడమిన ఋషులన్
మునుకొని మీవలె ఘనతప, మొనరించిన వార లెవ్వ ♦ రుత్తమ చరితా!. ౧౩౯

క॥ సాధుజన దర్శనంబున, నేధన్యుఁడనైతి నని ము ♦ ని ప్రవరుఁడు ప్రే
మాధికత విందగు నొసఁగె ద, పోధన మఖిలంబు గొనుమం ♦ పూత చరిత్రా!. ౧౪౦

క॥ అను మునికి రాముఁ డిట్లను, ఘనతపమునఁ గల్గె నిమ్మహాత్ముని యనఁ గని వనమున నగస్త్యుఁ డుప్పొంగి యాదరించె దయన్. ౧౮౦

క॥ రామా నీ తెలంచితి, యేమును నిను గాంచి ధన్యులము నెమ్మదితో వా మహాశయుం గాంచుము, క్షేమంబులు గలుగునన్ని చేసెదఁ దలఁచన్. ౧౮౧

క॥ అతఁడు మునివరాశ్రమ మున కతుల ప్రతిష్టతోఁ జను మార్గమును గనె తాఁ జేరి తీవేగ జనియె, మునులకు శ్రేయంబులగు నుపాయంబు లనుచున్.

క॥ ఆదారి చూపి యాశీ, ర్వాదమ్ములు సేసి యనుప ♦ రఘురాముఁడు స మ్మోదమునఁ దేనె వాఁకల, పొదలుగల యయ్యగస్త్యు ♦ వనముం జేరెన్. ౧౮౩

శ్రీరాముఁ డగస్త్యుని చెంత కేగి వచ్చుట.

చ॥ ధరణిఁ ద్రివిక్రముం బలెను ♦ బ్రాఁకి భాషను గొల్చినట్టి స ద్గురు వరుఁడౌ నగస్త్యుఁ డిఁక ♦ సత్త్వకళాలేశులు రామలక్ష్మణుల్ హారువుగఁ గాంచవచ్చె నడి ♦ యారసి పైపయి నుబ్బు మోద సా గరము జగంబునిండఁ బడ ♦ కంజము లాతఁడు గొల్వఁగాఁ జనెన్

ఉ॥ మున్నొకవేళ రక్కసులు ♦ మున్గిన వారిధిఁ జూసి వీరలన్ మన్నిగొనంగ వేఱొకఁడు ♦ మార్గము లేదు కృపన్ వహింపవే యన్న సురాళి కూరిమిని ♦ యంబుధి తోయములెల్ల నొక్కచే తన్నటినుంచి త్రాగి విశ ♦ దంబుగ నుమ్మినవాఁడు పిమ్మటన్ ౧౮౪

తే॥ వంచకుండగు వాతాపి ♦ సంచితముగ, మెసవి జీర్ణించికొని వాని ♦ యసువు దీసి వానియనుజు నిర్వృతుఁ జేసి ♦ ప్రాణికోటి, నెటిని గాచిన ధీరుండు ♦ కలుచవాఁడు

ఉ॥ యోగులు విభ్రమం బొరసి ♦ యుత్కట సంకట మొంది వేఁడను ద్యోగిత సూర్య చంద్రులను ♦ వ్యోమము నంటి పెరింగి యడ్డు విం ధ్యాగముఁ గాలనూని భుజ ♦ గాధిపలోకము దాఁకఁద్రొక్కి వు న్నాగము నెక్కుపొల్కి జత ♦ సంబున నెక్కిన యట్టి జాణఁడున్. ౧౮౬

ఉ॥ పార్వతి పెండ్లి వేళఁ ద్రిభు ♦ వంబుల ప్రాణులు చేరు హేతువై యుర్వర క్రుంగి యోరగిల ♦ నొయ్యన దక్షిణ మేరు మంచు నా శర్వుఁడు కోర దక్షిణ ది ♦ శంగల శైలము నెక్కి ధారిణిన్ సర్వసమంబుగా నిలుపఁ ♦ జాలిన తత్త్వ మహాత్త్వ సత్త్వుఁడున్. ౧౮౭

తే॥ తనియ ముక్కంటి యొసఁగిన ♦ ద్రవిడ భాష, వినిమె నేర్పైన శ్రుతికం బై ♦ వేం[illegible] ఘనుల వాడుకఁ బట్టియుఁ ♦ గవితఁ బట్టి, చింతనము చేసి వెల్లడిం ♦ చిన [illegible]

తే॥ స్వర్గ మర్త్య నాగములందు ♦ సకల జీవ, రాశి నెడఁదల బుద్ధులఁ ♦ గ్రాలు నాతఁ
డితఁడ యని యెల్లరు తలంచు ♦ ధ్యేయవస్తు,తత్త్వమగు రాముఁగాంచును ♦ త్కంఠ వాఁడు

చ॥ వినుతగుణంబుల న్నెగడు - వేదములం బఠియించి పెంచు జ్ఞా
న నికషమందు రాచి జత - నంబునఁ దోయజగర్భుఁడుం మదిం
గనుఁగొనలేని తత్త్వమని - గారము రామునిపైనఁ జేర్చి యా
తనిఁగని పల్కు భాగ్య మది - దక్కుటకున్ ముదమందు నాతఁడున్.

తే॥ అసమదైత్య బలంబను ♦ విసము పేరు, తొట్టి మాయించు మంచి వై ♦ ద్యుండువచ్చె
బ్రదికి రమరులు మునులు జీ ♦ వములఁ గనిరి, ధర్మవర్తనులైనారు ♦ తక్క జనులు

తే॥ ఇతర జీవులఁదిన హరియిం - చు దైత్య, భయద నిర్ఘాత సంఘాత - పాత సదృశ
కోపవహ్నిఁ జల్లార్ప ర - ఘు ప్రవీరుఁ, డంచి తాంబుదమూర్తి యే - తెంచెననుచు.

ఉ॥ తీరుగ సర్వలోకములు - దిక్కులు దుర్గతి నీఁగి సద్గతిం
జేర నుదారతన్ బహు వి - శిష్ట తపఃఫల జాతమైన కా
వేరిని కుండికం గొనుచు - వేడుకఁదెచ్చు నగస్త్యమౌని యా
శ్రీరఘు వీరుఁగాంచి నిల - సిల్లి ముదశ్రులు రాల్చినిల్చినన్. ౧౫౫

తే॥ మస్కరీంద్రుని గనుచు న-మస్కరించి, సీతయును రామలక్ష్మణుల్ - చెలఁగినిలువ
ద్రవిడ భాషాప్రసిద్ధుండు - తనిసి యలమి, స్వాగతము వచియించె స-ద్భాషణముల.

తే॥ యతివరులు పనసలు వల్కయతనిఁ జుట్టి, తమకమండలు జలము మ - స్తమునఁ జిలికి
విరులు సల్ల నగస్త్యుండు - విశదమైన, తన ప్రశాంత వనమునకుఁగొనుచు నేగె. ౧౫౭

తే॥ వీరుఁడాతని పర్ణకు - టీరమందు, నిందు ప్రేమతోఁగొని హార్ఘ - మందియుండ
ఘనతపము సేయు మా తపో - వనముచేరె, తపము పూర్తిగావించి తు - దాత్తచరిత!.

చ॥ అని వచియించు మౌనిఁ గని ♦ యాతఁడు పల్కు సమస్తదేవతల్
మునులును వృద్ధులున్ నృపతి ♦ ముఖ్యులు నావలె మీకృపన్ భరిం
చిన ఘనులేరు లేరు పలు ♦ శ్రేయము లొందితి సప్తలోకముల్
మునుమిడి గెల్చినాఁడఁ బోలు ♦ పున్ గడియించితి జన్మధన్యతన్. ౧౫౯

చ॥ శశిధరసన్నిభుండయిన ♦ సన్ముని రాముని గాంచి యిట్లనున్
వశమయి *యష్టమంగళ గు ♦ ణంబు లెసంగిన రామభద్ర! స
ద్వశము గడించి తండ్రిని య ♦ థార్థ వచస్కు నొనర్చి దండకా
దిశ కరుదెంచు నాఁడె యరు ♦ దేరుదు విచ్చేడ కంచు నెంచితిన్. ౧౬౦

---

*అపహత పాప్మత్వము. విజరత్వము, విమృత్యుత్వము, విశోకత్వము, విజగత్సత్త్వము, అభి
ఘాసత్వము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము, అనునవి అష్టమంగళములు.

తే॥ ఇంద నీవుండు మిట వసి ♦ యించియున్న, మాతపంబు లభీష్టముల్ ♦ పూంతపూచు
క్రూరులగు రక్కసులు వచ్చి ♦ కొడిమెసేయ, వారి వధియించి మాయెద ♦ వసటదీర్తు.

ఉ॥ పాలనమున్ హాలంబు గొని ♦ పాడియె పంటయొనర్చు రాట్సుతా!
శీలము నీతియున్ శ్రుతులు ♦ చెల్వగు ధర్మము వృద్ధి నొందెడున్
మేలు గడింత్రు వేలుపులు ♦ మృత్యువు గొంద్రు నిశాచరుల్ సదా
యోలల నాడు సమ్మద ప ♦ యోధి జగంబు నిజంబు నిల్వమా. ౧౬౨

ఉ॥ అమ్మని యట్లు పల్కి నిని ♦ యాయతబాహుఁడు రాముఁ డిట్లనున్
సమ్మతి మీయనుజ్ఞఁ గొని ♦ చంపెద పోఁకుల దిమ్మనూల్చెదన్
నెమ్మది గూర్తు మీకు నిది ♦ నిక్కము నమ్ముఁడు యాతుధాన సం
ఘమ్ము చరించు దిక్కు కెడఁ ♦ గన్ మునుపేగుట యుత్తమానసన్. ౧౬౩

అగస్త్యుఁడు రామునకు వైష్ణవ ధనువు నొసఁగుట.

ఉ॥ మంచిది పోయిరమ్మనుచు ♦ మౌనివరుండు రమా హృదీశ్వరుం
డంచిత రీతిఁదాల్చు జగ ♦ దప్రతిమాన శరాసనంబు పూ
జించుచు నుంటి సత్కృయ వి ♦ శిష్ట నిషంగము తోడ నిత్తు దు
ర్వంచకులైన వారి సమ ♦ రంబునఁ ద్రుంపుమ యంచు నిచ్చుచున్. ౧౬౪

తే॥ ఈజగములెల్ల నొకతల ♦ యిద్ది యొక్క, తల యనఁగ నొప్పు కత్తియు ♦ దర్పకారి
నగ ధనువుగొని పుర దహ ♦ నంబు సేయు, నసదృశంబగు విశిఖంబు ♦ నమరనిచ్చి.

చ॥ కుజములు సైకతంబులును ♦ కొండలు నెత్తుగఁగల్గి ప్రక్కలన్
సజలములైన వాహినులు ♦ చల్లగనొప్పి ప్రశాంతభూమియై
సుజన మనోభిరామమయి ♦ సూన గుళుచ్ఛ వికాస భాగ్యమై
యజిర వినోదమై పరఁగు ♦ నట్టిది పంచవటీ స్థలంబగున్.

తే॥ అచటఁ దోఁక వడ్లును తేనె ♦ యరఁటి పండ్లు, గలవు కావేరివంటి యే ♦ ళులునుకలవు
జానకిం గూడి యూడ వాం ♦ సలును కలవు, అందు వసియింపఁ దగుదు వీ ♦ వార్యవినుత!

తే॥ అనుడు నీలమేఘ శ్యాముఁ ♦ డతని కెఱఁగి, యాజ్ఞ గైకొని పికవాణి ♦ యైన సీత
యనుజుఁడగు లక్ష్మణుండు వె ♦ న్నంటి రాఁగ, నమ్మునీంద్రు మనస్సుతో ♦ నచటికరిగె.

౪. జటాయు దర్శన పటలము. (౪౮)

ఉ॥ చేరికఁ గల్గి నట్టివియుఁ ♦ జేరక వేఱుగనుండు భూమిభృ
ద్వారము గాంచి యెక్కుచును ♦ దాఁటుచు వేగయుతంబులైన వాః
పూరము లందు తెప్పవయిఁ ♦ బోవుచు దవ్వు తరించి కాంచి ర
వ్వారలు ప్రేమ వేగ పరి ♦ భావితవాయువు నజ్జటాయువున్. ౧౬౫

తే॥ కరఁచినట్టి బంగారంబు♦కరణి నుదయ, గిరిశిఖరముపైఁ జేరు భా♦స్కరుఁడు దిశలు
వెలయఁ గిరణపక్షంబుల ♦ విరియఁజేసి, యున్న మాడ్కి ను తేజుఁడై ♦యున్నవాని.

తే॥ నీలగిరిఁ బోలు కచ్ఛప ♦ నేత పైని, క్షీరవార్ధిలో శశికాంతి ♦ చేరియుండ
నిర్జరులు మథియింపంగ ♦ నిలిపినట్టి, మందరాగంబు కైవడి ♦మలయు వాని. ౧౭౧

క॥ నీలాకాశ వికాసము, మూలంబడ రక్తకాంతి ♦ మొనయు పదములన్
నీలగిరి మీఁదఁ బొడవు ప్రవాళ లతలు పరవు వెరవు ♦ పరవిన వానిన్. ౧౭౨

ఉ॥ లోపము లేనివాఁడు గుణ ♦ లోలుఁడు సత్యయుతుండు శీలి సం
తాపము లేనివాఁడు నెఱి ♦ ధర్మపథంబు లెఱుంగు ధీరుఁడున్
గోపము లేనివాఁడు పెను ♦ కూరిమివాఁడు కుశాగ్రబుద్ధి దు
ర్లాపము లేనివాఁడు సుక ♦ లావిదుఁ డార్యుఁడు దూరదర్శియున్. ౧౭౩

తే॥ అనిశ మింద్రుఁ డంకుశధార♦నెనయుచంచు, పుటముతోఁ గ్రూరరాక్షస♦ఘటములను వి
దారణముచేసి యమునకుఁ ♦ బారణమ్ము, చేసి పిదప గాత్రముల భు ♦ జించు వాని.

తే॥ గ్రహచయము నేలు ధ్రువచక్ర♦గతిఁదనర్చు, రత్నఖచితహారము మెడఁ♦ గ్రాలువాని
మేరు గిరి మీఁద వెలుఁగొందు ♦ మిహిరుఁబోలు,ఘనకిరీటంబుశిరమునఁ♦గలుగువాని

తే॥ వర్ణనాతీతమగు కీర్తి ♦ వఱలువాని, నిరులు నశియింప నుదయించు ♦ నరుణు తనయుఁ
గల్పకాలముల్ త్వరలోనఁ ♦ గడపునట్టి, దినము లట్టులఁ జూచిన ♦ తెఱఁగు వాని.

తే॥ శైలమున నిల్చి యది మోవఁ ♦ జాల కిలకుఁ, గ్రుంగి నట్లుండు తోఁచిక♦కొఱలువానిఁ
గాంచి రామలక్ష్మణులు శం ♦ కాపిలగ్న, హృదయు లగుచు నాతని దరి ♦ కేగి నారు.

క॥ తన ముగియిక తాన వెదకి, కొని వచ్చిన రక్కసేని ♦ కుహనారూపం
బనియును బలియుఁడు గరుడుం, డనియును తెలపోసి చూచి ♦ రలుకన్వానిన్. ౧౭౪

తే॥ దృఢ ధనుష్మంతులును వీర ♦ తేజులైన, రాకుమారులఁగని జటా ♦ రాజియున్నఁ
దాపసులు గారు వేష్కులై ♦ ధరకు దిగిన,సురలొయని జటాయువువారి♦నరసిచూచె

ఉ॥ కాంచితి వాసవున్ సురలఁ ♦ గాంచుచునుందు నలింబు భక్తిమెఁ
గాంచితి మాధవున్ గనక ♦ గర్భుని శంకరు నిట్టివారలం
గాంచను మారుఁడేనియును ♦ కాంచిన సిగ్గిలి మూలదాఁగువాఁ
డంచితులైన వీరి చర ♦ ణాబ్జ పరాగము నేని పోలునే?. ౧౭౫

చ॥ గొనకొని మూఁడులోకములు ♦ కూడ ♦ భరింపఁగఁ జాలు భద్ర ల
క్షణముల దేహముల్వెలయు ♦ కార్ముకవీరులు లక్ష్మిఁబోలు ని
వ్వనజదళాక్షితో హరుల ♦ వైనమునం జరియింపనేల? నా
మనమును మోఱగొన్నగుణ ♦ మాన్యు లదెవ్వరి పుత్త్రులొ కదే? ౧౭౬

ఉ॥ ఒక్కఁడు చూడ నీలగిరి ♦ యొక్కరుఁడో యరుణాచలంబు వే
రొక్కఁడు లక్ష్మికన్నులప్ర ♦ లందపుఁ గన్నులో పద్మపత్త్రముల్
చెక్కిన లద్దముల్ మఱియుఁ ♦ జెన్నగు మొక్కటులెల్లఁ జూడ నా
మక్కువకాఁడు కోసలర ♦ మాపతి పోలికలే కనంబడున్. ౧౫౨

తే॥ ఇట్లు యోచించుచున్నంత ♦ నీరుకులేశు, లతని డాసి రంత జటాయు ♦ వాదరమున
ధనువులం దాల్చి మునులచం♦దమునవచ్చు, వీరులార! మీరెవ్వారు♦వినుచుఁడనుడు.

తే॥ సత్యమే తక్కవేఱు కాఁ ♦ చని కుమార, వరులు ధారణి నేకాత ♦ పత్త్రముగను
దినిజవెరుల గుండియల్ ♦ విస్తరనఁగ, బాలనము సేయు దశరథ♦ప్రజలమనిరి. ౧౫౪

జటాయువు దశరథు మరణము విని శోకించుట.

తే॥ అనుడు నానంద వననిధి ♦ మునిఁగి లేచి, ప్రీతి వారలఁజేర్చి ప ♦ రిష్వజించి
జనకు దీర్ఘ బాహువులు బలి ♦ ష్ఠ ముతె చెప్పు, డింపుమై నన నవ్వార ♦ లిట్టు లనిరి.

క॥ అనుమాటను మఱి తప్పుట, యనుచితమని జనకుఁ డేగె ♦ నమరపురికి నం
చను నంత నాజటాయువు, వనటఁ భరియింపలేక ♦ వ్రాలెఁ ధరణిఁ. ౧౫౬

క॥ ఇరువురు కరములఁ బట్టీ, శ్వారు లేవఁగనెత్తి బాష్ప ♦ జలముల మొగముఁ
బరిమార్జన మొనరింపఁగ, మరలఁ దెలివి నొంది యతఁడు ♦ మఱుఁగుచు వంతఁ

ఉ॥ త్యాగము ఛత్రముఁ శమము ♦ దాల్చిన నిఁగని సిగ్గునొందు క
ల్పాగము చంద్రుఁడుఁ భువియు ♦ నందఁగరాని ప్రమోదమంద, యా
ద్యాగుణపాళి ధర్మమును ♦ నన్నును దుఃఖపయోధి ముంచి మా
కేగతి చూపి పోయితి? నృ ♦ పేంద్ర! యశస్కర! సత్యభూషణా! ౧౫౮

చ॥ జగముల కెల్ల నీడనిడు ♦ ఛత్రము దాల్చిన చక్రవర్తి! యీ
జగములఁ గాచు కార్యమొక ♦ చక్కని వీడి మదీయ మైత్రి నీ
వగఁ బరికింప నేగితివా? పాపపుఁ బుంజమనైన యేను గ్ర
ద్దగ జనియించి ధర్మములఁ ♦ దప్పి యడంగక యుంటి నిచ్చటఁ ౧౫౯

ఉ॥ శంబరుఁద్రుంచు కాలమున ♦ సర్వజగంబు లెఱుంగ నీవు ప్రా
ణంబులు నేను దేహమని ♦ నమ్మఁగఁబల్కుట తప్పవే కదా?
వెంబరయా కృతాంతుఁ డవి ♦ వేకముచేత ననూత్కరంబు భూ
మింబడ దేహముంగొని భ ♦ మించి దివమ్మున కేగ నేమొకో? ౧౬౦

తే॥ కీర్తి వ్యాపింపఁగా నగ్ని ♦ కీలలఁబడి, మాఁడవలయునుగాక యి ♦ ట్లా మ్లేచ్ఛనుల
యట్లు దుఃఖింపఁ దగునె? యం♦చతఁడులేచి, వత్సలార! వినుండని♦పల్కె నిట్లు. ౧౬౧

సీ॥ దక్ష ప్రజాపతి ♦ తనయులఁ గాంచె నేఁ, బండ్ర వారల నొక్క ♦ పగిదినున్న
పదుమువ్వురను కశ్య ♦ పప్రజాపతికిచ్చె, వారిలోఁ దిలకమై ♦ వఱలు నదితి
ముప్పదిమూఁడుకో ♦ ట్లొప్పు సురలఁగాంచె, దితియను సతి పూర్వ ♦ దేవతాళి
నఱువది యాఱుకో ♦ ట్లడరంగఁ గనియెను, దనువను చెలిగనె ♦ దానవులను

తే॥ మనుజతతిఁ గాంచె మతియను ♦ మడఁతె, సురభి, కాంత కామధేనువుతురం ♦ గంబులాది
మృగములం గాంచె, సింహక్ర ♦ మేల గార్ద్ధభాదులను క్రోధవశయను ♦ నతివపడసె.

సీ॥ వినతా వనితగాంచెఁ ♦ బిడుగుల మెఱపుల, నరుణుని గరుడు ది ♦ వాంధములను
కంకంబు లాదిగాఁ గల పెనుపక్షులఁ, దామ్రయన్ పడఁతి యొం ♦ దంగఁ గనియెఁ
బిచ్చుకల్ పూరేళ్లు ♦ బెళవలు కౌఁజులు, మున్నగు పినపిన్న ♦ పులుఁగు తెగలఁ,
గళయను నామె తీఁ ♦ గలు చెట్లుగుల్మముల్, మొదలగు నుద్భిజ్జ ♦ ములను పడసె

తే॥ భయద ఫణములుగల యహి ♦ ప్రతతిఁ గాంచెఁ, గద్రువయను వెలందినా ♦ గములు తక్కు
వానిఁ గనె సుతయనునది ♦ తానరిష్ట, యుడుము లుడుతలు తొండలు ♦ పడసెఁ బుడమి

సీ॥ జలచరంబులఁ గాంచె ♦ నిఱయను నెలనాఁగ, యట్టులా చెలులు చ ♦ రాచరముల
విరివిగాఁ బడసిరి ♦ వినతా సుతులలోన, నరుణుండు రంభ యం ♦ దమరఁ గాంచె
మమ్ము, మాయన్న సం ♦ పాతి నన్ను జటాయు, వంద్రు దివౌకసు ♦ లందు నుండి
తక్కుజాతుల వేఱు ♦ లెక్కించు కాలాన, జనియించి నాఁడ మీ ♦ జనకుహితుఁడ

తే॥ నరుణుఁ డెందెందు వర్తించు ♦ నందు నందుఁ, దిరుగనేర్తు నెదురులేక ♦ దివ్యతేజు
లార! మిము గంటి మీతండ్రి ♦ నారఁ గాంచి, నట్టులయ్యె మనంబున ♦ నలరు మిగిలె

తే॥ అతఁడిటు వల్క రాఘవు ♦ లంజలి గొని, యుబుకు వంతచే బాష్పంబు ♦ లురలఁ గీర్తి
నిచటనిల్పి నాకంబున ♦ కేగుతండ్రి, మరలి రాఁ జూచు కైవడి ♦ మసలినారు. ౧౯౫

ఉ॥ అత్తఱి రామలక్ష్మణుల ♦ నర్మిలిఁ బక్షములందు చేర్చి రా
జోత్తములార! నాకుఁదగ ♦ నుత్తరకార్యములెల్ల మీరలే
యిత్తఱిఁ జేయఁగావలయు ♦ నిద్దఱు మూర్తులకొక్క జీవమై
హత్తిన మిత్రుఁడేగ భర ♦ మైకను దేహము నగ్ని నీఁగెదన్. ౧౯౬

క॥ అను పక్షిరాజు పలుకుల, ఘనులగు రాఘవులు వినుచుఁ ♦ గైమోడ్చి వెనన్
గనులను ముత్తెంబుల యను, పున బాష్పము లురల ననిరి ♦ పొక్కుచు వనటన్.

తే॥ కడఁక మాజీవిత సహాయ ♦ కారివైన, తండ్రి సత్యవాక్యంబుకై ♦ తరలె దివికి
నిప్పుడీవును మము డించి ♦ యేగు నెడల, మాకు దిక్కెవ్వరింక నీ ♦ లోకమందు?

ఉ॥ వీడఁగరాని ప్రేమపద ♦ విశ్రుత రూపులఁ దల్లిదండ్రులన్
వీడితి మాప్తబంధువుల ♦ వీడితి ముద్ధతమా నయోధ్యయున్

పీడితి మెల్లసంపదలు ♦ పీడని కానలలోని కష్టముల్
పీడితి మేను మీవలన ♦ పీడుట పాడియె మీరు సెచ్చటన్?. ౧౯౯

తే॥ అని తపించుచు నిల్చిన ♦ యనఘులఁ గని, యిపుడు నేను దేహము పీడు ♦ టింపు గాక
యున్న మీరయోధ్యకుఁ జేరు ♦ క్రన్న విడిచి, దశరథుం జేరు వాఁడనో ♦ తనయులార!

మ॥ జనకుండుం గాదె దేశికేగఁ బూజ్యమగు రా ♦ జ్యంబీరు పాలింపక
వ్వనికిన్ రాఁగతిమేమి? యేమి జరిగెన్ ♦ జల్కుండు దూపిల్లు నా
మనమున్ నిర్జరదైత్య సన్నగ రిపు ♦ త్ప్రానాథు లేరేని నే
గిరి గాపెంచిరిఁ దీర్చి మీకు నభిషే ♦ కింతున్ మహీంగ్రమ్మలన్. ౨౦౦

తే॥ జనకుఁడైన జటాయువి ♦ సరణిఁ బలుక, నన్న తమ్ముని గ్రేఁగింట ♦ నరయునంత
నతఁడు పినతల్లియగు కైక ♦ కతన జరగు, వృత్తమెల్ల స్పష్టంబుగా ♦ విన్నవించె.

తే॥ తండ్రి సత్యవంతుం జేసి ♦ తల్లి పలుక, తలను దాల్చి రాజ్యమ్మును ♦ తమ్మునకు నొ
సంగు త్యాగమూర్తీ! తండ్రి! సంతసగను, నీ పనుల్ మతి యేరిచే ♦ నెగడు? ననుచు.

తే॥ కమలనేత్రుని చేగియారఁ ♦ గౌఁగిలించి, శిరము మూర్కొని యశ్రువు ♦ లురలఁగాంచి
యోసమర్థ కుమార! నీ ♦ పీసరణిని, పితరునకు నాకు యశము ♦ గాపెంచి తనుచు.

తే॥ గాజులం దాల్చు నొక హంసి ♦ కరణి నున్న, జనకజం గాంచి యీతన్వి ♦ చందమేమి?
కుసుమకోమలి మీతోడఁ ♦ గూడి రాఁగఁ, గారణం బేమి? యనుడు ల ♦ క్ష్మణుఁడు పలికె

చ॥ తమిగమిఁ బోలి ఫక్కొలుపు - తాటకఁ జంపుట గోలె శంభు ధ
ర్మముగొని తుండ్లు సేయుటయు - మైథిలి పెండ్లియుఁ బట్ట భంగమున్
తమ పెపినాగమంబు పితృ - తర్పణముం బొనరించు దాఁక స్ప
ష్టముగ వచించెఁ బక్షికుల - చంద్రముఁ డెల్ల నెఱుంగునట్లుగన్. ౨౦౧

క॥ భోగకర రాజ్యమెల్లను, భోగి కుబుసమూడ్చు పోల్కిఁ - బోవిడిచిన వై
రాగులు మీరీవనమున, నాఁగుఁడు రక్షించుచుండు - నసవరతంబున్

చ॥ అని విహగేంద్రుఁడాడ విని - యార్యుఁడు రాముఁ డగస్త్యమౌని చె
ప్పిన దగు గౌతమీ తట వి - విక్త తలంబున నుందుమన్న న
య్యనఘుఁడు లెస్సయయ్యెఁ దగ ♦ నాస్థలమందె తపంబుసేయుఁ డ
వ్వానిఁ గనిపింతు రండనుచుఁ - బక్షము నీడనె కొంచుఁ బోవుచున్. ౨౦౨

తే॥ అమలహృదయుండు గుణనిధి ♦ యగు జటాయు, వెదుట నున్న పంచవటి న ♦ య్యుద్ధగుణుల
కెఱుక పఱచి చనిన యంత ♦ నినకులేశు, లవ్వనంబున్నఁ జేరి ర ♦ త్యాదరమున. ౨౦౩

ఉ॥ అచ్చటనున్న రాక్షసుల ♦ యాశ్రయ సత్త్వములెల్లఁ జక్కఁగా
నిచ్చ నెఱింగినట్టి విహ ♦ గేంద్రుఁడు క్రొత్తడియైన జానకిన్

మచ్చిక నక్కుమారులను ♦ మాటికి మాటికి వచ్చి పిల్లలన్
ముచ్చటఁ గాంచు నండజము ♦ వోలెఁ గనుంగొనుచుండె నంతటన్. ౨౦౦

౩. ఋష్యాశ్రమ ఘాపటలము. (౧౪౩)

ఉ॥ వీరులు రాఘవుల్ గనిరి ♦ పృథ్వి కలంకృతియై సమస్త సం
భారము లిచ్చి పార్శ్వములఁ♦*పంచ విధంబుల పంట భూములన్
దారిత పాతకంబులగు ♦ దారుల రంజిలి యా తలక్షణో
దార కపిల్వ పద్ధతిని ♦ హారి విశిర్మలయైన గౌతమిన్. ౨౦౧

చ॥ కమల ముఖంబులన్ గలువ ♦ కన్నులఁ గాంచి తరంగహస్తముల్
క్రమముగఁ జాఁచి పుష్పములు ♦ క్రమముగ వారలపై విడుర్చుచున్
భ్రమద విహంగ రావముల ♦ స్వాగతపద్యము లల్లుచుండె గా
లిమి యతిథుల్ రఘూత్తములు ♦ తిన్న రయంబునఁ జేరఁ గాంచుచోన్

ఉ॥ మిక్కిలి ప్రేమ సువ్రతులు ♦ మేదిని నాయక పుత్రరత్నముల్
చక్కటికై వనంబులకు ♦ సాగిన కష్టముఁగాంచి యోర్వలే
కక్కటికంబుచేఁ దరఁగ ♦ లన్ కరముల్ గొని మోఁదుకొంచుఁ జే
రక్కిలినొంది యుత్పల క ♦ టాక్షములన్ వడిఁగార్చె బాష్పముల్. ౨౦౩

సీతా రాముల గౌతమీ తీర విహారము

ఉ॥ నాళయుతంబులైన నలి ♦ నంబులపై వెసఁ జక్రవాకముల్
వ్రాలుట గాంచి రాఘవుఁడు ♦ వారక సీత కుచంబులం గనున్
ఆ లలితాంగియున్ విభుని ♦ యంగద బాహుల సౌరు గాంచి ర
త్నాల మెఱుంగు లీను గిరి ♦ నాయకముం గనుచుండు లీలమై. ౨౦౪

తే॥ హంస యాటఁదొలఁగుట గని ♦ హంసకులుఁడు, సీత నడకను గాంచి హా♦సింప నామె
నీరు ద్రావి నివర్తిలు ♦ గౌరు నడక, గాంచి రాము నడక చూచి ♦ కడఁక నవ్వె. ౨౦౫

తే॥ తీవియలు కదలుట గని ♦ తీవఁబోఁడి, నడుము గాంచె రాముఁడు, సీత ♦ నాథుతనువు
నల్ల కలువల నడిమి యుత్పల్ల వనజ, యుగము నెగడిగ నిట్టట్టు♦లారసి చూచె. ౨౦౬

ఉ॥ అట్టి వినోద దాయక మ ♦ హానది గౌతమి చెంతఁ గొండలం
బుట్టిన నిర్ఝరంబులును ♦ ముచ్చట గూర్చు శకుంత రావముల్
పట్టుగ మ్రోఁగు పంచవటి ♦ బంధుర లీలల లక్ష్మణుఁ డెడం
గట్టిన గట్టి పర్ణకుటిఁ ♦ గాంచి వసించిరి వారలంతటన్. ౨౦౭

* (1) కుఱింజి = కొండయు, కొండక్రింది నేలయు. (2) ముల్లై = అడవియు, అడవి ప్రక్క నేలయు (3) నెయ్దల్ = కడలియు, తీరభూమియు. (4) మరుదం = పంట గాని. (5) పాలై = మరుభూమి.

### శూర్పణఖ రాఘవునిం గాంచుట

ఉ॥ జీవముతోడ దేహమునఁ ♦ జేరి క్రమంబున వృద్ధిఁ బొంది యా
జీవముతోడ దేహమును ♦ జీల్పఁ దలంచి గమించు వ్యాధి రో
గావృతిఁ బోలునట్టిదియు ♦ నచ్చపుఁ బచ్చలకొండవంటి యా
రావణు మూలనష్టుగఁ గ ♦ రంబు వినాశము సేయు జాణయున్. ౨౧౯

తే॥ జేసుకైన వెన్నెలకలును ♦ చిచ్చుగొల్పు, రాహువును బోలు దేహంబు ♦ గ్రాలునదియు
విబుధవరులకు మునులకు ♦ విద్విజులకు, శోక ముగింపు నన్వేషింప ♦ నూను నదియు

తే॥ భావి కలుషంబులకు నొక ♦ పట్టుగొమ్మ, అడవి నెప్పు డొంటరిగఁ జ ♦ ట్టాడుకొమ్మ
వడిగ లోకమెల్లఁ దిరిగి ♦ వచ్చు బోటి, శూర్పణఖ యను బోటి య ♦ చ్చోటికేగె. ౨౨౦

తే॥ చెట్ట తన బంధుగులకు నూ ♦ చించు గోతి, చుప్పనాతి నాకులు నేఁడ ♦ పోఁడుమూకఁ
జంపఁ బాఁప సెజ్జను వీడి ♦ జగతి యందు, నవతరించిన శ్రీరాము ♦ నరసి కాంచె.

చ॥ మదనుఁడె యందమూ రెలుకలు ♦ మాఁడిన దెన్నఁడో! యింద్రుఁడందమా
పొదలవు వేయి కన్నులు! భ ♦ వుండని యందము ఫాలమందు క
న్నొదవదు! నాభి పంకజము ♦ నుండి జగంబుల సృష్టిసేయు ల
చ్చి దయితుఁ డందమా యలరు ♦ చేతులు నాలుగు లేవు కాంచఁగన్.

క॥ భవు కంటి మంటచే నివ్వు, అవు మారుఁడు నాఁటఁ గోలె ♦ న కుదగు తపమున్
దవిలి యొనరించి యిట్టి వ, పువుఁ బొందం బోలుఁ గాక ♦ పొలుపుగ నిలపై. ౨౨౩

మ॥ అసమానంబగు లీల జానువుల నొ ♦ య్యంబాఁకి సొంపైన యి
య్యసమేషు ప్రతిమాన బాహులకుఁ గ ♦ ల్పాగంబు హేమాద్రి యొ
ప్పెసలారన్ సరిగావు బల్లిదములై ♦ యేపారు దిక్కుంభి హ
స్త సమంబుల్ సుకుమార సుందరములై ♦ దర్పించు దోర్దండముల్. ౨౨౪

తే॥ పురుష వర్య బాహువులకు ♦ ముదిరియుష్ణ, నీలగిరిసాటియగుఁ దక్క ♦ శైలములును
రాలుగలయని మేరువు ♦ రసమయంబు, గానిసుమంతయును సాటి ♦ కావు కావు.

తే॥ కమల దళములఁ బోలిన ♦ కన్నులొప్పు, కొండవంటి యీపురుషుని ♦ గురు భుజములఁ
గాంచ నా కనుల్ దీర్ఘముల్ ♦ గాకపోయె, నంతకంటెను వెడంద య్యో - మ్మమరుఁగ దవె!

చ॥ అలవికి మించి కాంతు లల ♦ రారు మనోహరు శౌర్య తేజముల్
తొలఁకెడు నెమ్మొగంబునకుఁ ♦ దోయజముల్ సరి తూఁచరాదు లే
జలజ విరోధి మోమునకు ♦ సాటియె యన్నఁ గలాక్షయం బటన్
గలుగును నిండుచందురుఁడొ ♦ కందొకఁ బొందినవాఁడు చూడఁగన్.

క॥ రాముండిట్లను లక్ష్మణ!, భూమిని పలుకోట్లు రూప - ములు పలుతీరుల్
నేమమున సకలమెఱుఁగఁగ, లేమిటు లననేల? వింత ♦ లేదనఁదగునే?. ౨౩౯

తే॥ ఏమితలఁచి తోఁకేరీతి ♦ నెనయుచుండు, నవయవంబుల సూటిగా♦నరయుదేని
సూక్ష్మభేదముల్ దెలియుట♦చూడలేవె?, యేడు పైఁడిహంసలుపుట్టు♦ తెలుఁగవేమి?

తే॥ లెక్కలేని ప్రాణులలోన ♦ నొక్కతీరు, నొక్క యంతంబు లేదను ♦ చుండు నంత
మీరు మాటాడుచుండ బం♦గారు జింక, దూరమేగునో యని సీత ♦ తొట్రుపడియె.

చ॥ అటువలెఁ ద త్తఱిల్లు జన ♦ కాత్మజ చిత్తమెఱింగి రాముఁ డం
తటఁ గుటిలాలకా! పడము ♦ తక్కక కాంతము యంచు నేగ సం
కటమున లక్ష్మణుండు వెను ♦ కం జన దాఁటఁగ రాని దయ్యమై
తటుకున వచ్చి యొట్టెదుట ♦ దంభముతోఁ గనుపట్టె లేటియున్. ౨౪౨

ఉ॥ తమ్ముని కాంచు జింకఁ గని ♦ తామరసాక్షిరో! దీనిఁ జూడఁ జి
త్తమ్మున నేమియుం బలుక ♦ దాకొన దియ్యది మంచిదే యనెన్
వమ్మగు నేమి? దేవతల ♦ ప్రార్థనముల్ సుకృతమ్ము శేషత
ల్పమ్మును వీడి యీధరణి ♦ భారము దీర్పఁ దలంచి వచ్చుటల్. ౨౪౩

ఉ॥ దీనిని చూడు వత్స! యిది ♦ దేనిని పోలును? ధాత్రి సాటియే
గానము ముత్తెమట్లు రద ♦ కాంతులు గ్రమ్మును శాడ్వలంబుపై
నానెడు నాల్క మించు దొర ♦ యం దగు దేహము మేలి హేమముం
బోనిది మచ్చలెన్నఁ గవి ♦ పుత్త్రిని జోతి నధఃకరించెడిన్. ౨౪౪

ఉ॥ ఈ హరిణంబుఁ దేఱి కను ♦ నింతులకున్ మగవారి కింత సం
దేహము లేక డెందములు ♦ దీనిపయిం జొరఁ బాఱకుండు నే?
యీహాలు లేచుచున్ మిడుత ♦ లేపున దీపముఁ జేరు పోలికన్
దోహాలమందుచున్ వడిగ ♦ దొర్లుచుఁ బోవుచునుంటఁ జూచితే? ౨౪౫

ఆ॥ అన్న యట్లు పలుక ♦ నాజింకఁ గని యిది, మంచి గాదటంచు ♦ మది నెఱింగి
తమ్ముడఁనియె దీనఁ ♦ దనరు ఫలంబేమి?, మరలి చనుట యింక ♦ మంచిదనుచు.

ఉ॥ లక్ష్మణుఁ డిట్లు పల్క శుభ ♦ లక్షణ లక్షిత సీత, యీ లస
ల్లక్ష్మము లొప్పు లేడిఁ బది ♦ లంబుగఁ బట్టి యొసంగఁ జూప జి
త్పక్ష్మలులైన సోదరుల ♦ భావము లూర నయోధ్య కేగి యో
సూక్ష్మమతీ! విరామముల ♦ సొంపుగ నాడుకొనంగ నిమ్మగున్. ౨౪౬

చ॥ అనవుడు నల్లె తెత్తు నను ♦ నంత విచక్షణ దక్షుఁడైన ల
క్ష్మణుఁడు వచించు నార్య! యది ♦ కర్బుర మాయ దురాత్ములైన యా

దనుజులు ధర్మపద్ధతిని ♦ తప్పి చరింతురు వారి మాయలం
దన నిదియొక్కటా ననుచుఁ ♦ దుట్టతుదం దెలియం గలారనన్. ౨౪౮

ఉ॥ తమ్మున కన్న యిట్టులను ♦ దైత్యుల మాయయె యైన మేలె యొ
క్కమ్మునఁ గూల్చి వచ్చెద ర ♦ యమ్మునఁ బట్టిన ధర్మముల్ ఫలం
బిమ్ముగఁ గాంచు నిక్కమగు ♦ నేణమయౌని గ్రహించి తెత్తు రెం
టమ్మున కేమియుం జెడుగు ♦ డాయదు నీవ తలంపుమా యనన్. ౨౪౯

ఉ॥ దీనిని మున్నుగాఁ బనిచి ♦ దీని పిఱుందన నిల్చువారలే
వైనము వారలో? మఱియు ♦ వారల మోసములెట్టివో? యిటుల్
దీనిని పంప నేలొకో? మ ♦ దిం దలపోయ నశక్యమయ్యె దు
ర్మానులు రోయు వేట కోల ♦ మాత్రమ కా దగచాట్ల నిచ్చునన్. ౨౫౦

చ॥ దనుజులు వైరులంచు బహు ♦ ధర్మవిదూరులటంచు మాయలం
బనుపడు వారలంచుఁ దగఁ ♦ బల్కుచుఁ బూను వ్రతంబు వీడఁగా
జనములు నవ్వరేమి? యిటు ♦ జంకుట త్వాదృశుల ధర్మమేమి? యె
ట్లును బలు మంచిదే యగు వి ♦ లోలత యేలని రాముఁ డాడఁగన్. ౨౫౧

ఉ॥ డాసిన కార్యముల్ తగ నె ♦ డంద విచారణచేసి చేత యు
ద్భాసిత రీతిఁ గ్రాలు రఘు ♦ వర్య! మృగంబు పిఱుంద నెట్టి రా
కాసులు నున్న మచ్చర వి ♦ ఘూర్ణ వారల యుక్కడంతు నా
శ్వాసము చెందుఁ డీ రది ని ♦ జంబగు లేడియయేని తెచ్చెదన్. ౨౫౨

మ॥ అని సౌమిత్రి వచించుచుండ నమృతం ♦ బంగారఁగా నొల్కు ప
ల్కున ముద్దై తగు చిల్కవోలె వదరెం ♦ గొంచించుచున్ సీత యి
ట్లనుమానించుచుఁ బట్టి యీయరు గదా ♦ యంచున్ విమోదంబుతోఁ
గనులన్ ముత్తెము లట్లు బాష్పకణముల్ ♦ గ్రమ్మన్ వెసన్ గ్రమ్మఱన్.

## రాముఁడు మాయా హరిణము వెంట నంటుట.

చ॥ చనవు మెయిం గనర్గొనుచు ♦ సాగిన జానకిఁ గాంచి రాఘవుం
డను ననుజా! కురంగమిపు ♦ డయ్యలివేణికి నేన నెవ్వడిం
గొని చనుదెంతు నిచ్చటనె ♦ కూరిమితో సతిఁ గాచియుండు మం
చు నిశిత బాణముల్ ధనువు ♦ సొంపుగఁ దాల్చిచనెన్ వడిన్ వడిన్. ౨౫౪

తే॥ మున్ను వేల్మిఁ జెఱుపవచ్చు ♦ మువ్వురందు, తప్పిపోయిన ♦ వాఁడని తలఁతు వీని
మొగిని గమనింపు మని కేలు ♦ మోడ్చి పలికి, లక్ష్మణుఁడు పర్ణశాల వెల్పలనె నిల్చె.

తే॥ అరసి లక్ష్మణుఁ డనుమాట ♦ నాదరమునఁ, గొనక జానకి కై కొన్న ♦ కోపమునకు
మందహాసంబు గొని మఱు ♦ మాయజింక, వెంబడించెను సుందర ♦ వీరవరుఁడు.

ఉ॥ నేలను నిల్చుఁ జింక మెడ ♦ నిక్కఁ జివుక్కున దాఁటు నింగికిన్
లీలను నేలఁ ద్రవ్వు ఖుర ♦ ళించిన తీరున దూఁకు డాయుఁ బెన్
గాలి మనంబు వేగిరము ♦ గాఁ జను రీతికిఁ గ్రొత్తమార్గ మ
వ్వేళను నేర్పుఁ బాదములు ♦ పేరురముం దగులంగఁ బర్విడున్. ౭౫౮

ఉ॥ చాఁచుచు నెత్తి యీభువన ♦ జాలముఁ గొల్చిన పాదసత్త్వముం
బూఁచి వచింప వేఱొక య - పూర్వ భగోళము గల్గునేమి? తా
నేఁచఁగ నేగినంత వడి - నేగెను జింకయు నింతమాత్రమే
తోఁచును నాఁటి వేగమున - తోరము దెల్ప నశక్యమేరికిన్. ౭౫౯

తే॥ కొండలెక్కు మేఘంబులఁ - గ్రుంకు వెంటఁ, జేర దూరమేగును తాను - సింప డాయు
నిలిచి యున్నట్లు కనఁబడి - తొలఁగిపోవు, పైఁడి యాన వేశ్యల మది - పోలు నట్లు.

చ॥ తొడఁగిన దొక్కటై తుదిని - దోఁచిన దొక్కటి యయ్యె మున్నె త
మ్ముఁడు తలపోసినట్టి తలఁ-పుల్ తగ నామదిఁ దోఁచియున్న ని
క్కడ కిటురాను వట్టిశ్రమఁ - గర్బుర మాయలఁ జిక్కిపొందితిన్
దడయఁగ నేలొకో సదమ - దం బొనరించుట మేలు చూడఁగన్. ౭౬౦

తే॥ వీఁడు మాయావి చేపడు ♦ వాఁడు కాఁడు, చెండుటే కార్యమనుచు సం♦సిద్ధుఁడై స
రాము మది నెఱిఁగిన వాఁడు♦ రయము మీఱ, మాయ నెగిరెను నింగిసి♦ మఱుఁగుపడఁగ

తే॥ రాముఁడాక్షణమందె చ ♦క్రంబు రహిన, మోఘశర మొండు సంధించి♦ మోసగాఁడు
పోవుచోటికి వెంటాడి ♦ పొరిగొనుమని, నారి తెగ దీసి పఱపె స ♦ న్నారసంబు. ౭౬౧

తే॥ ఆ శరంబు మాయావి ఱొ ♦ మ్మంటఁ దాఁకెఁ, దాఁకినంత నోరు దెఱచి♦ దశదశలను
దాఁటిచన లక్ష్మణా! యంచుఁ♦ దద్ద యఱచి, ప్రాణములువీడి మారీచుఁ♦ డవనిఁగూలె

తే॥ నిక్కువపు రూపమునసోఁకు♦ నీల్గఁగాంచి, తమ్ముఁదలఁచియాతఁడు జాణ♦ తారకముగ
వెంట వచ్చునతఁడు ప్రోడ♦ వేయునేల, ప్రాణసముఁడు నేర్పరి యని♦ హర్ష మొందె.

తే॥ దిక్కులదరంగ నఱచుచుఁ ♦ దీటి కూలు, నీచు దేహంబు నచ్చట ♦ నిలిచిచూచి
మున్ను కౌశిక యాగంబు ♦ పూని చెఱుప, నరుగుదెంచు మారీచుఁడే♦ యని వెఱింగె

తే॥ శరముఱొమ్మున నాటఁగ ♦ శ్రమము నొందు, మఱియుఁ దోదైత్యుఁడొనరించు ♦మాయ
నాదు కంఠంబుతో లక్ష్మ♦ణాయటంచుఁ, బిలిచె నదివిని మైథిలి♦ కలఁగునేమొ?. [యందు

చ॥ పిలుపు నిజంబు కాదనుచు ♦ వీఁడె డైత్యుఁడు పల్కునంచు మున్
దెలిసిని నాకు హెచ్చరిక ♦ దెల్పిన తమ్ముఁడెఱింగి తెల్పఁగా

నలమట వీడి సీత హృద ♦ యంబున నూఱట చెందు నంచుఁ దాఁ
దెలిసి యొకింత నెమ్మదిగ ♦ దించె మదిన్ రఘురాముఁ డయ్యెడన్. ౨౧౨

ఉ॥ చావఁదలంచి వచ్చిన ని ♦ శాచరుఁ డీతఁడు గాఁడు మద్గళా
రావము వోలెఁ గూసిన ని ♦ రావము నందు తలంచిచూడ న
ర్థావహ మొండుఁ గల్గు నది ♦ యారటపెట్టక మున్నె వెన్కకుం
బోవుట మంచిదంచుఁ దల ♦ పోసి బిరానఁ జనంగఁ గ్రమ్మఱెన్. ౨౧౩

౮. జటాయు మోక్షణ పటలము. (౨౨౪)

తే॥ రాముఁడట్లు మారీచుని ♦ నాము మడఁచి, వడిగ వచ్చుచు నుండంగఁ ♦ బర్ణశాల
నున్న సీత యా దీనంపు ♦ టులివు విన్న, యంత దిగులునఁ గళవళ ♦ మందె మదిని.

తే॥ పరభృతంబు వృక్షము నుండి ♦ పదరి జాఱి, పడిన వడువునఁ బుడమిని ♦ పడుచు లేచి
కడుపు చెయివెట్టి కలఁచిన ♦ కరణిగాఁగ, విభ్రమము నొంది విలపించె ♦ వివిధగతుల

తే॥ ఏల యజ్ఞానమునఁ బట్టి ♦ యిమ్మటంచుఁ, గోరి యీజీవితము చెడఁ ♦ గొట్టికొంటి
నేదిగతి? ముందు వెన్కల ♦ నెఱుఁగనైతి, యేమి చెడుగుల దుర్విధి ♦ యోచఁగలదొ?

లక్ష్మణుఁడు సీతకు ధైర్యవాక్కులాడుట.

తే॥ వత్స! లక్ష్మణా! సద్గుణ ♦ వార్ధియైన, యన్న రాక్షసమాయచే ♦ నలుగుల పడి
పృథివిఁ దూలె ననుచు నీవు ♦ వినియు నింక, నిచటనే నిలుచుంటివా ♦ యెడఁదఁగొనక

తే॥ అనుడు లక్ష్మణుఁ డిట్లను ♦ నమ్మ! యీ జ, గమున రాముని కంటెను ♦ కడిమియందు
మించు శూరు లున్నారని ♦ యెంచఁదగునె?, ఆఁడుఁదనమున నరయ కి ♦ ట్లంటి గాక.

క॥ జలధులు నిఖిల జగంబులు, కులశైలము లొక్కటగుచు ♦ ఘోరరణంబున్
జలిపిన రాఘవు బలముం, జలియింపం జేయఁ గలవె? చింతింపు మెదన్. ౨౧౯

క॥ పుడమియు జలమును వహ్నియుఁ, గడలును రాఘవుఁడు కినిసి ♦ కాంచినయేనిన్
పొడియై నీఱై పోవవె? తడఁబడి యెవ్వనిగ నతనిఁ ♦ దలఁచితొ తెలియన్. ౨౨౦

తే॥ రక్కసున కోడి కష్టించి ♦ రామదేవుఁ, డిట్లు పిలుచునె? పిలిచెనే ♦ నెల్ల జగము
లట్టె నిలువునఁ గూలవె? యఖిల జీవు, లింతకే మండి మాఁడి ల ♦ యింప కున్నె?

క॥ పలుమాట లేల? దివి భువిఁ, గలవారు నుతించు గరళ ♦ కంఠు ధనువు ము
క్కలుగా విఱిచిన శ్యామల, జలద నిభు నెదుర్చువారు ♦ జగములఁ గలరే? ౨౨౨

క॥ పతియే నొవ్వియుఁ బొరయఁడు, హతుఁడగుటా? త్రిభువనంబు ♦ లడఁగవు రవియున్
గతిదప్పఁ డుదధి యింకదు, మతిమాలిన చింత నొంది ♦ మఱుఁగం దగునే? ౨౨౩

తే॥ ధర్మమున్నది దివ్యులు ♦ తనియఁగలరు, వచ్చు రాముఁడు వైళంబ ♦ వంత వలదు
చచ్చునపుడు రక్కసుఁడట్లు ♦ చావు కేఁక, వైచె నదివిని విభ్రాంతి ♦ పడకు తల్లి!

తే॥ అనుడు మిక్కిలి కోపంబు ♦ నడలు మనము, చంపి నంతటి వేదన ♦ చండ దృష్టి
గలుగు సీత నీ విచ్చట ♦ నిలిచి యుంట, నీతిమంతము గాదని ♦ నెట్టనాడి. ౭౬౦

చ॥ ఒకపరి మైత్రి గూర్చికొను ♦ నుత్తము లక్కట ప్రాణమైన దాఁ
పక యిడువారు చేవచెడి ♦ ప్రార్థన చేసిన యన్న కోరికం
గకవిక చేయు తమ్ముఁడికఁ ♦ గల్గునె నీవలె? దిక్కు లేదు నా
యకుని తలంచుచుం విడుతు ♦ నగ్నిని జీవము లిప్పుడే వడిన్. ౭౬౧

మ॥ అని చెందమ్మి వనమ్ముకై వెదకు చ ♦ క్రాంగిం బలెం గిక్కమై
ఘన ధూమావృత దావ వహ్ని వెదకం ♦ గాంతారముం గూర్చి యే
గిన వైదేహికి నడ్డు వచ్చి వినతిం ♦ గేల్మోడ్చి యో తల్లిరో!
నను మన్నింపు చలంబు వీడుమని దై ♦ న్యం బంది తా నిట్లనున్ ౭౬౨

లక్ష్మణుఁడు రాముని కడ కేగుట

చ॥ మరణము నొందనేల? యను ♦ మానసము మానుము నీ ప్రతిజ్ఞ కున్
వెఱతు మఱేమియుం బలుక ♦ వెక్కసముం ద్యజియించి యుండె యే
మఱక వసింపుమమ్మ బలు ♦ మాయవిధిం గెలువం గలారమే?
యిరవున నిల్మ సేవకుఁడ ♦ నేగుచు నుంటిఁ గలంక వీడుమా. ౭౬౩

తే॥ అదను గని మూపదలు వచ్చు ♦ నమ్మ! మీరు, ప్రభుని యాజ్ఞ నాక్షేపించి ♦ పలుకుచుండ
వెనుక నూయి ముందుగ గోయి ♦ విధము నొంది, మదిఁ దపించెదనని యేగె ♦ ముదల నొంది.

చ॥ నిలిచితి నేని యీయమయు ♦ నిప్పున దూఁకక మానదంచు నే
వెలలితి నేని రక్షణము ♦ వీడ మహాపద చెందునంచుఁ జం
చలుఁ డయి కార్యమేది యని ♦ చానల పల్కుల కుల్కి యిట్లు రాఁ
దలఁచుట పాడియే యనఁ బ ♦ దంపడి యేమని యందు నన్న కున్. ౭౬౪

ఉ॥ పాడి దలంతు నేని యది ♦ భావ్యము భవ్యము గాని, యీమె యె
గ్గాడి మరించు దీనిఁ గను ♦ లారఁగఁ గాంచుట కంటెఁ గర్మచే
నాడికఁ బుట్టి కొందలము ♦ నందెడు వెంగలి యే మఱేమియుం
జూడక యిచ్చటుం వదలి ♦ నూటిగ నేగుటె చాల యుక్తమా

ఉ॥ పనిదె పోవుచుంటి నెది ♦ యేని యవాంత్రము వచ్చునేని స
మ్మానిత రీతి నెల్లపుడు ♦ మమ్ము భరించు జటాయు వున్న వాఁ
డానిక వచ్చి త్రోవఁగలఁ ♦ డంచును పల్మఱు వెన్కఁ జూచుచున్
బానలు వొందుచుం జనె ను ♦ పర్వుల పుణ్యము పండు పండఁగన్, ౭౬౬

## రావణుఁడు తాపసియై సీత కడకు వచ్చుట

తే॥ అదను గనిపెట్టుచున్న ద ♦ శాస్యుఁడంత, వంచనముసేయమదినెంచి♦వాటమగు త్రి
డండమును నారలును జడల్ ♦ దాల్చి జనము, గౌరవించు తాపసి రూపు♦కడఁకనందె.

తే॥ కార్శ్యమును మేని బడలిక ♦ గానఁబడఁగఁ, బాట గతిదప్పక నటించు ♦ వాని మాడ్కి
వీణవంటి కంఠంబున ♦ వేదములను, స్వరము చెడక పల్కుచు ఘన ♦ సరణి తోడ.

చ॥ మెలఁకువఁ బూలు విచ్చుగతి ♦ మెల్లన నేగెడు వాఁడు భూమిఁ జి
చ్చులమిన చోటఁ గాలిడిన ♦ యంగముతో నడతెంచు వాఁడు న
గ్గలమగు వేపనం బలము ♦ కాళ్లు కరంబులుఁ గల్గువాఁడు ని
య్యెల జరయుక్ వరించుటకు ♦ నేవపడం దగునట్టి వృద్ధతన్. ౭౯౦

చ॥ నలినముఁ బోలు తేట నయ ♦ నమ్ములు కచ్ఛపలీల నింద్రియ
మ్ముల యడకమ్ము గూనియును ♦ పొల్పగు జన్నిదమొప్ప నొక్క ని
శ్చల ముని వోలె దైత్యకుల ♦ జాల్ముఁ డరుంధతిఁ బోలు జానకీ
నిలయము చేరె దిక్కులను ♦ నిక్కి కనుంగొని మాటి మాటికిన్. ౭౯౧

క॥ త్రిదశులును భ్రమయునట్లుగఁ, ద్రిదండి యయి రావణుఁడు వి ♦ దేహాతనయ యు
న్న దెసంగని వా తడఁబడఁ, గదిసి యెవరు మీరలనుచుఁ ♦ గడఁకం బలుకన్ ౭౯౨

క॥ సాదగు యోగి యితండని, మోదంబున జనకరాజ♦ పుత్త్రి యతని న
త్యాదరమునఁ గాంచుచు నుమ్ము, దూదార వచోభిరామ ♦ యెద్దకు వచ్చెన్. ౭౯౩

తే॥మదజలముగాఱునట్లుచె♦మ్మటలుగ్రమ్మఁ,దొలఁకువలపునదైత్యుండు♦తొడవుతొడవు
ప్రణుతి పాత్ర పతివ్రతా ♦ రత్నమైన, సీత సుషిమ సుషమ కనుల్ ♦ చెలఁగఁగాంచె.

తే॥వ్యసనమునవాడియున్నయా♦వామ ముఖము,సురసతీ ముఖంబులకం టె♦సొబగుమెఱసె
తన్ముఖమ్మును చూచి నం ♦ తనె సురారి, రెట్టలుప్పొంగి కృశియించె ♦ హృదికలంగె

ఉ॥ వాని కనుంగవల్ విరిసి ♦ పార్థివ పుత్త్రి మనోజ్ఞకంబునం
దాని ప్రసూన మాక్షికము ♦ నాని మదంబునఁ గ్రాలుపుష్పలి
ట్ఛ్రేణివలెన్ బ్రమోదమును ♦ చెందిన వంచు వచింపనేల? య
వ్వాని మనంబువోలె ముద ♦ సాన్నిధి మున్గి తరింప వక్షముల్. ౭౯౪

మ॥ వనజావాసము వీడి భూస్థలికి దీ ♦ వ్యద్రత్న సంకాశమా
తను వల్లిం గొని వచ్చినట్టి చెలి సౌం ♦ దర్యంబు వీక్షింప నా
కను లొక్కిర్వది చాలునే? తలఁపఁ బ్రా ♦ క ద్వేషి చందాన నా
కనిమేషస్థితి నొందు నేత్రములు వే ♦ యైనం గవంజాలునే? ౭౯౫

క॥ ఈరమణి తోడి సుఖ మను, వారిధి దాఁటంగఁ దపము - ఫలముగ నజుచేఁ
గూరిన యాయువు చాలునె, సొరగు మూఁడు నఱ కోటి - సంవత్సరముల్? ౭౯౮

చ॥ దివిజులు దిక్మహీశులు త - దీయసతుల్ రజనీ చరావళుల్
తవిలి భయంబునం గొలువఁ - దక్క-క యీ భువన త్రయంబు ని
య్యువతియె యేల నేనును న-యోక్తుల నీయమ కాలఁ చూప గౌ
రవమునఁ జేయఁ బూనుదు శి - రంబున జీవితమే తరింపఁగన్. ౭౯౯

ఉ॥ వేదన తోడి క్లేశమున ♦ నెల్వెఁ డైన ముఖస్థ శోభయే
యీదివి భూమి గెల్చునన - నించు స్మితంబునఁ గూడియున్నచోఁ
బైదలి మోము గోము గరు - వం బది యెంతగ నొప్పునోకదా?
సోదెగ నీచెలిం దెలుపు - సోదరి కిత్తు సమస్త రాజ్యమున్. ౮౦౦

తే॥ ఇట్టు లవినీతుఁడై మది ♦ నెంచుచున్న, కపటమునిఁగాంచినంతనే ♦ కనులవారిఁ
జేతఁదుడిచికొనుచు దయ ♦ సేయుఁడనుచు, సీత యుపచారవాక్కు-వ ♦ చించియంత.

తే॥ డాసిసం గని యామె వే ♦ త్రాసనంబు, చూపికూర్చుండుఁడన మాయ ♦ తాపసుండు
జింకతోలు త్రిదండంబు ♦ చెంతనునిచి, కొంచుఁ గేశవాయంచును ♦ గూరుచుండె. ౮౦౨

క॥ వృక్షములు గిరులు మృగములు, పక్షులు భయమంది వడఁకి ♦ పాఱె దెసల కా
రాక్షస వరుఁగాంచి హరిణు, లక్షమమునఁ జెదరి కొదరి ♦ యదరుచుఁ దొలఁగెన్. ౮౦౩

తే॥ ఎవరిదీపర్ణశాల? మీ ♦ రెవ్వ? రిందు, గలుగు మునియెవ్వఁడనిదశ ♦ కంఠుఁ డడుగ
నితఁడు వెరవిఁడి యని సీత ♦ యెదఁదలంచి, పలుకఁదొడఁగె మహోదర ♦ భావమెసఁగ.

తే॥ ఓమహాత్మక! కోసల ♦ భూమిపాలు, దశరథేశసుతుఁడు పిన ♦ తల్లికోర్కి-
వెలయఁదమ్ముతో సీయట ♦ వీస్థలమునఁ, గొలుచున్నాఁడతని నెఱుం ♦ గుదురె? యనిన.

తే॥ ఔనవును వినియున్నాఁడ ♦ నరయలేదు, గంగప్రవహించు కోసలఁ ♦ గంటి నొకట
నరిదియగు కాల మడవిలో ♦ జరపుచున్న, వారు మీరేరి తనయలో ♦ పలుక వలతు ౮౦౬

చ॥ అనుకపటంపు మానికి ధ ♦ రాత్మజ యిట్లను మానిచంద్రమా!
అనఘులు సచ్చరిత్రులు మ ♦ హాత్ములు మీవలెనున్న పుణ్యులౌ
మునులయెడన్ మహోదరము ♦ పూను విదేహ ధరాతలేంద్రుఁడౌ
జనకుని ప్రేమపుత్త్రి నను ♦ జానకియందురు రాముగేహినిన్ ౮౦౭

తే॥ కఠినపథముల నడచి వి ♦ క్లమమునొంది, నారు వృద్ధులు ద్వంద్వముల్ ♦ పాఱఁదోలఁ
దలఁచినారలు మీరలే ♦ స్థలమునుండి, వచ్చినారన నిట్లురా ♦ వణుఁడుపలికె ౮౦౮

సీ॥ ప్రాయనలవికాని ♦ వరతనుభాసితుఁ, డింద్రునకింద్రుండు ♦ సాంద్రయశుఁడు
బ్రహ్మవంశజుఁడను ♦ స్వర్గమ్ముతోడ న, మస్తలోకములేలు ♦ మహితగుణుఁడు

వేదవేది రజత ♦ పృథ్వీధరము లీలఁ, బెల్లగించిన భుజ ♦ భీమ బలుఁడు
చౌదంతి కొమ్ము వ ♦ క్షమునకుఁ దొడవుగాఁ, బొసఁగఁ దాల్చిన లోక ♦ వీరవరుఁడు
తే॥ అతనివీథి వాకిట నిల్చు ♦ నట్టివారు, వేలుపులెనుమ్మి యారామ♦వీథులందు
తరువులెల్లను కల్పక ♦ తరువులెయగుఁ, గాపురంబా ప్రభునిది లం ♦ కాపురంబు. ౮౯
సీ॥ పాదంబులొత్తుట ♦ పాదరక్షలుమోచు, పనులు రంభాదుల ♦ పనులె ముగుద!
అడపకత్తెలు పాఁప ♦ పడఁతుకల్ కాళంజి, గొనువారు గంధర్వ ♦ వనజముఖులు
తన చండశాసన ♦ మున భానుచంద్రముల్, శీలముల్ మార్పడఁ ♦ జెలఁగువారు
ఇంద్రాది దేవత ♦ లెల్లరు తనయింటి, కావలివాండ్రయి ♦ క్రాలువారు
తే॥ నాకమునయందు భూమిని ♦ నాగమందు,గల యపూర్వ వస్తువులెల్లఁ♦గడమలేక
యుండునాతని నగరాన♦యువతి! యేమి,చెప్పనేర్తును? విభవ మొ♦చ్చెంబులేదు.౯౦
తే॥ అజుఁడొసంగిన యమితాయు♦వందువాఁడు,భవునిచేఁ జంద్రహాసంబు♦ పడసినాఁడు
గ్రహములంబట్టి చెఱలోనఁ♦గట్టినాఁడు,సకలసద్గుణవంతుండు♦సన్నుతాంగి!. ౯౧
తే॥ మంచినడవడి గలవాఁడు - మహితధర్మ, శాస్త్రవేత్త కందర్పుఁడా - శ్చర్యపడఁగఁ
దగిన పరువంబుగలవాఁడు - తప్పులెన్ని, యజహరాదుల గౌరవ - మడఁచువాఁడు.
తే॥ సకలలోకంబు లందున్న - సన్నుతాంగు, లెందఱోవాని దయగోరి - యెలయువారు
వారికోర్కులఁదాఁ ద్రోచి-వైచి యొక్క-, కాంతఁ బ్రేమించి యామెకై -కాచినాఁడు.
తే॥ అతఁడు పాలించు లంకయం - దాసమెయిని, కొంతకాలంబు వసియింపఁ-గోరి చాల
కాలముండి క్రమ్మఱినాఁడ-లోలనేత్ర!,యనుచుఁ బల్కి యాయమ తలం-పరయఁదలఁచె
తే॥ తనువె భారమంచుఁదలంచు - తాపసేంద్ర!, తపసు లార్యులు కోరంగఁ -దగనిహింస
సేయు నసురల నగర వ- సించుచుండ, వలసినంత కారణమేమి - వచ్చెమీకు?. ౯౫
చ॥ వనముల నిష్ఠమైఁదపము - వారకచేసెడివారి చెంతలన్
మొనసి వసింప కార్యజన - పూజ్యులు రాజులు గల్గు చోటులన్
దనివి వహించియుండకిటు - దర్పితులై బహు దుష్టకార్యముల్
పొనరుచు క్రూరదానవ స - సమూహములోఁ బనియేమినిల్వఁగన్?, ౯౬
చ॥ అనివచియించు సీతఁగని - యంతటఁగ్రై తవమౌని యిట్లు ప
ల్కును.మృగనేత్ర! యీరసము - క్రూరపథంబునఁ బోక హింసయున్
మనుజుల యొద్దనుండునని - తప్పుగ నెంచితి నిర్జరాళికం
టెను దనుజుల్ దురాత్ములెకి-డిందిగ యోగ్యులు మమ్ముబోంట్లకున్.౯౭
ఉ॥ రావణుఁడిట్లు పల్కి- రఘు ♦ రాముని దేవి తపోఽధికుల్ సదా
పావనులైన వారు చెడు ♦ పాపులఁ జేరఁగ రాదయరచు మా

యావులు రక్కసుల్ తలఁచి ♦ నట్టి స్వరూపము దాల్చువారలన్
భావన లేని దాట నటు ♦ పల్కఁగ వించుక వాఁడు కొంకుచున్. ౧౧౮

ఉ॥ ఈయమ శంకనొందెనని ♦ యెంచుచు దానిని కప్పి పుచ్చఁగాఁ
దోయము మార్చి యిట్టులనుఁ ♦ దోయజనేత్రి! బలిష్ఠులైన దై
తేయులు వారికిం బరులు ♦ దెప్పరముల్ ఘొనరింపనున్నచో
న్యాయము దప్పి లోకముల ♦ కాపద గూర్చరు వారలెన్నఁడున్. ౧౧౯

ఉ॥ ఆమె మనస్థిరత్వము ను ♦ రారి యెఱుంగఁగఁ గోరి యిట్లనన్
భూమిజ యిట్లు పల్కు రఘు ♦ ముఖ్యుఁడు కానల నున్న యప్పుడే
యా మనుజాశనావళుల ♦ నందఱఁబట్టి వధించుఁ బిమ్మటన్
క్షేమము చిత్తశాంతి ముని ♦ సింహులు చెందెద రెల్లకాలమున్. ౧౨౦

ఉ॥ నావుడు రావణుండు సుమ ♦ నస్విని! మర్త్యులు రాక్షసాళికిన్
హావడి గూర్చి కూల్తురన ♦ నౌర! శశంబు గజంబుఁ జంపదే?
వావిరి జింక చంపదె య ♦ వారణ ధీరత వారణ ద్విషున్
జేవచెడన్ ఖగాధిపుని ♦ జిహ్మగముల్ వధియింపవే యనన్. ౧౨౧

తే॥ క్రూర ఖర దూషణాదుల♦బారి సమరు, టీరు వినియుండ లేదొ ముని♦సేంద్ర! యనియె
నాఁడు రాముని కైన బ♦న్నంబు దలఁచి, వెడలు దుఃఖాశ్రుకణములఁ♦దుడిచికొనుచు.

ఉ॥ పుణ్యచరిత్ర! శూరులయి ♦ పొల్చు దినేశకులేశ ధర్మ నై
పుణ్యముచేత లంకఁగల ♦ పుణ్యజనుల్ నశియింప నక్షజి
ద్గణ్యులు సజ్జనుల్ క్రమలు ♦ దక్కి సుఖించుట నేఁట రేపటన్
నాణ్యము గాఁగ జూచెదరు ♦ న్యాయ మధర్మ తతిన్ జయింపదే?. ౧౨౩

తే॥ చక్కెరయుఁ దేనె యమృతంబు-చిక్కఁగలిపి, నట్లు సీత పల్కఁగ ముద-మందుచున్న
యసుర మనుజులు గెలిచెద - రన్నమాట, విన సహింపక గరువంపుఁ- గినుకఁ దాల్చి.

చ॥ కినియుచు నొక్కమానవుని - కిన్ సరిగాక సమర్థులైన య
ద్దనుజులు గూలిరందువు గ - దా? దశకంధరు బాహు మారుతం
బున నరుఁడొక్క యూఁపుననె - బూరుగ దూదియుఁ బోలెఁ దూలి యే
వననిధిఁ గూలువాఁడొ కన - వచ్చును రేపె వరాంగనామణీ! ౧౨౪

చ॥ చదురులు పల్కుచున్న వన - జాత ముఖీ! దశకంఠు వేనిగా
నెదఁ దలపోసి యిట్లు వచి - యించితి మేరువు నెత్తఁ గోరినన్
త్రిదివము గూలఁద్రోయఁగ న - రిత్పతి నంక్షుభితంబుసేయ నో
ర్వదహాను నార్పివేయఁగ ధ - రం దలక్రిందుగఁ జేయ నర్హుఁడా. ౧౨౫

ఉ॥ ఈ కరణిన్ వచించు దను ♦ జేశ్వరుతో నృపపుత్త్రి పల్కెనా
నాకవిరోధిఁ బట్టి చర ♦ ణంబులఁ గట్టి యడంచి బందిలో
నూకిన కార్తవీర్యుని య ♦ నూన భుజంబులు వేయి, నొక్క రెం
డే కరముల్ గలట్టి మను ♦ జేంద్ర విరోధియె త్రుంచివేయఁడే?

రావణుఁడు కోపముతో నిజరూపము చూపుట.

ఉ॥ జానకి యిట్లు పల్కఁగ ని ♦ శాచరు కన్నుల విస్ఫులింగముల్
వానగఁ జిందె దిక్కులకుఁ ♦ బర్వె భుజంబు లొకళ్లొకళ్లతో
నూనిక మోఁదె బొమ్మికము ♦ లుప్పరమంటెఁ బయోధిరావ మ
ట్లానికఁ బండ్లుగీఁటె ముని ♦ యాకృతిపోయెఁ జలంబు పెంపుచన్. ౨౨౮

చ॥ ఇతఁడు తపస్వి గాఁడనుచు ♦ నెంచి కలంక వహించి యెవ్వఁడీ
మతకరియంచు లోన లవ ♦ మాత్రమెఱుంగ నశక్యమైన దు
స్థితి గొనునట్లు క్రూర విష - జిహ్మగ మల్క ఫణంబు విప్పి వి
ద్రుతగతిఁ బైఁబడం దొడరు - తోపిక నొప్పెద శాస్యుఁడయ్యెడన్. ౨౨౯

మ॥ అనిరోధుండు యముండుపట్టుకొన స - హ్యాంబెంతయున్ లేని జీ
వునిచందంబునఁ గంపమొంది సురిఁగెన్ - భూపుత్త్రియచ్ఛోభయం
బును పోకార్పఁగ నేరఁ బిల్చు? నుడువం - బోనేమి గల్గున్? వెసం
బొనరింపంగ మఱేమియుండును? తలం - పుంబోవ దేత్రోవకున్ ౨౩౦

మ॥ అమరేంద్రాదులు సేవలంజలుపు బా - హాశక్తిసామర్థ్యముల్
తమినీక్షింపుమ యంచు రావణుఁడు దై - త్యశ్రేణి నిందించెదే
ప్రమదారత్నము గాన మానితిఁగృపా- భావంబునం గానిచో
దెమలంబట్టి కఱుకుక్కనం గొఱికి యేఁ - దిందున్ రుషాశాంతికిన్. ౨౩౧

మ॥ జలజాతేక్షణ! వంగ కెచ్చిరిలు శీ - ర్షశ్రేణిపై శీర్షకం
బుల చందంబున భక్తిపూర్వకముగాఁ - బొంకంబుగాఁ దాల్తు వే
ల్పుల చెల్వాల్ భవదీయ పాదరజముల్ - పోకార్చి సేవింప రం
జిలి పద్నాలుగు లోకముల్ సుఖముమైఁ - జెన్నారఁ బాలింపుమా!. ౨౩౨

సీత రావణుం బదరుట.

శా॥ ఆమాట ల్విని శ్రోత్రయుగ్మకముఁ దా - హస్తంబులన్ మూసి కాం
తామతల్లిక సీత, కుర్కురము పూ - తంబౌ హవిర్భాగముం
బ్రేమం గోరిన రీతిఁ బుణ్యచరితన్ - శ్రీరాము సత్పత్ని న
న్నేమన్నావుర దుష్ట! బాలిశ! నరా - శీ! ద్రోహి! పోఁగాల్పమే?. ౨౩౩

చ॥ తృణమున నిల్చు కంకణము - తీరగు ప్రాణము గోస మానసమై
గుణవతులైన వారు కుల - కోమల ధర్మములం దృజింతురే?
ఫణులను బోలు రాఘవుని - బాణకదంబము నీ శిరంబులం
గణఁకను ద్రుంచుమున్నె పడు - కం దలఁతేని తొలంగి పాఱుమా?. ౮౩౪

తే॥ అనుడు రావణుఁడనుఁ గను బ్బ త్తిరదన,కిణము లొప్పు వక్షమున నీ-యినుఁడు వైచు
విశిఖములు కొండపైఁ బడు ♦ విరుల కరణి, వ్యర్థములు గాక యేమేని♦ఫలముగనునె?

ఉ॥ ఓ వరవర్ణినీ! మదనుఁ ♦ డుత్కట బాధలఁ బెట్టుచుండె నా
యావి కృశింపసాగె నిఁకఁ ♦ బ్రాణము నీయడచేత నిల్చె న
న్నేవిధినైనఁ గావు మమ ♦ రేశ్వర కాంతలకున్ దురాసదం
బై విలసిల్లు భోగముల ♦ నందుమ యంచుఁ బదంబులం బడెన్. ౮౩౬

తే॥ కత్తిపోటుచేఁ బ్రాణము ♦ గ్గలఁగినట్లు, తనువునుండి జీవంబులు ♦ తరలినట్లు
లార్తినొంది జానకి లక్ష్మ♦ణా! యటంచు, నార్య! యంచు నాక్రందింప♦నయ్యదనుస

రావణుఁడు సీతం గొనిపోవుట.

తే॥ తొంటి శాపంబుఁ దలఁచి యా♦ దుష్టదైత్యుఁ, డురుభుజంబుల నానేల♦నొక్కపెట్టఁ
బెల్లగించి సీతను దాఁటి ♦ వెడల నీక, చేతులంజుట్టి రథమునఁ ♦ జేర్చిపెట్టె

తే॥ఉరముపై భయమునఁజేతు♦లుంచుకొనిన, చెలువతనప్రాణములఁగూడఁ♦దెలియదయ్యె
మట్టితో నామె మెఱుపులో ♦ మఱఁగిపోయె, రావణుం డాకసంబున ♦ రథముఁదోలె.

తే॥ అనలమునఁబడ్డపూఁగొమ్మ♦యట్లుసీత, వాడుఁదపియించుదొరలును ♦ వసలఁగుందుఁ
ద్రుళ్లిపడి లేచుఁగాలుసే♦తులు విదుర్చు, దిక్కులం జూచు వెఱగొందు♦దిక్కుమాలి

సీ॥ ధర్మమా! యీ యాప ♦ దను తొలఁగింపవే, యిదిగదా రక్షింప ♦ నదను నీకుఁ
బావనివమ్మ గో ♦ దావరీ దేవి! నీ, వేని దెల్పఁగదె యి ♦ య్యెడరు పతికి
వనదైవతములార! వందనములు మీకు, నాస్థితిఁదెల్పరే ♦ నావిభునకు
శైలంబులార! వృ ♦ క్షములార! పిక మయూ, రములార! మృగ నిక ♦ రంబులార!

తే॥ మొగుళులార! మీకును దయ ♦ పుట్టదేమి?, ఓదినేశ! భవత్కులా♦మోదకరుఁడు
రామునకు నీవు చెప్పఁగా ♦ రాదె? నీకు, లమున కియ్యది యొక్క క♦లంకు కాదె?

శా॥ అన్నా! లక్ష్మణ! యాపదల్ తలఁగ రా ♦ వన్నా! గురు జ్ఞాన సం
పన్నా! నిన్నవినీతినైఁ బనిపితిన్ ♦ మన్నించి వేరమ్ము యా
పన్నన్ రక్షణ సేయుభారమది నీ ♦ పై నుండెఁగాదే? దురా
త్మున్నిచ్చుం బరిమార్పరే భరత శ ♦ త్రుఘ్నుల్ కృపాపూర్ణులై. ౮౪౨

మ॥ భ్రమ గొన్నావు కలంగినావు సుడియన్ ♦ వత్సంబు గోల్పోయి దుః
ఖమునం గుందెడు ధేనువట్లు మిగులం ♦ గ్రందిల్లుచున్నావు గౌ
తమి! నీనెంజిలి చూడఁగా నెఱుఁగుమ ♦ త్ప్రాణేశుతో నీదు పు
ణ్యము పెంపారఁగ గొబ్బునం దెలుపవే ♦ నాదుష్ట కర్మస్థితిన్. ౨౪౩

తే॥ ఎదురుపడు దొనలార! మృ ♦ గేంద్రులార!, పక్షులార! యీభూమితో ♦ వ్రచ్చినన్ను
పట్టు నిరువది చేతులు ♦ పది శిరములు, బ్రుంగి ధరఁబడఁ గాంచిన ♦ వ్వాదురు గాక.

మ॥ ఉరుదుఃఖంబున సీత యిట్టులన నా ♦ యుష్కాలముం గోలుపో
వు రహిం బూనిన రావణుండు తరుణీ! పూఁబోణి! సింగారి! చ
క్కెర బొమ్మా! నను మానవుల్ గదిసి యా ♦ క్షేపించి గెల్పొంది నిన్
వెరవారన్ విడిపించు వారె? యని న ♦ వ్వెం జేతులం దట్టుచున్. ౨౪౪

ఉ॥ రావణు పల్కులన్ వినిన ♦ రాముని దేవి దురాత్మ! నీచ! మా
యావి మృగంబుఁ బంపి భవ ♦ దంతకు రాఘవు దవ్వుచేసి యే
యావల నన్ను బట్టితి కు ♦ లాపశదా! యనిసేయు తెంపు నీ
కావిధినున్నఁదో లకు శ ♦ తాంగము నిల్పుము మాటలేటికిన్?. ౨౪౫

ఉ॥ వీరుఁడవై తివేని పెను ♦ భీతిని దొంగిలనేల? పంద! నీ
వారలు రోషమూనఁగ భ ♦ వత్సహజాతకు ముక్కుగోసి యా
తీరున వారిఁజంపు రణ ♦ ధీరులు కానన వీథియందె యు
న్నారని గాక కుర్కుర గు ♦ ణంబున వచ్చితివేల? బాలిశా! ౨౪౬

చ॥ అనుటయు దైత్యుఁడిట్టులను ♦ నబ్జముఖీ! విను నన్ను బోటికిన్
మనుజులతోడ నాహవము ♦ మానక చేసిన నిందరాదె? రు
ద్రుని ఘనశైలమెత్తిన యు ♦ దూఢ భుజంబులు దొడ్డ న్యూనతం
జెనయవె? వంచనమ్మె తగు ♦ చెద్దుము మానవపాళి పట్టునన్. ౨౪౭

చ॥ అది విని సీత నిర్దయత ♦ నావడి చేసెడి క్రూరదైత్య దు
ర్మదులకు శత్రుసమ్ముఖము ♦ క్రాలుట లోపము వారితోడ బె
ట్టిదపు దురంబు సేఁతయు బి ♦ డెంబగు సాధ్వుల మోసగించు టొ
ప్పిద మగు నిట్టిపాపులకు ♦ వీర్యము మాన మనంగ నున్నదే? ౨౪౮

### జటాయువు రావణు నడ్డగించుట.

సీ॥ అనునంత దుష్టాత్మ! యరిగెద వెచటికి?, నిలుమంచుఁ గాలాబ్ద - నినద లీల
గర్జించి నిప్పులు - గ్రక్కు కన్నులతోడఁ, బిడుగులఁ బోలిన - నుడులతోడ
మేరుగిరియె లేచి - మింటఁదిరుగుచున్న, దాయనన్నొప్పు కా - యంబుతోడ
శంపాభమౌ బలి - ష్ఠంపుఁ జంచువుతోడఁ, గొండకొండయు ధాఁకి - పిండిగా

తే॥ జలధి చెలరేఁగి భూమితోఁ - గలసిపోవ, నిలయవాయువ్వుకై వడి - వీచుచున్న
పక్షమారుతమునఁదరు-వ్రజము విఱుగ, గరుడుఁడని పుట్టలనుభుజం-గములుచొరఁగ

క॥ ఱెక్కలఁ బుట్టిన కరువలి, నక్కజముగఁ బైకి నెగసి ♦ యాకసమందుం
గ్రిక్కిఱిసి తూలు మృగములు, మక్కెక్కఁగ మిన్ను మిగుల ♦ మాఱుపు చెందన్

క॥ అరదమున ధరణిజం గొని, యురవడి నెటకేగు వాఁడ ♦ వుండు నిలుము నీ
గరువం బడఁచెద నీచా!, తెరువు గలదె నీకుఁ బోవఁ ♦ దేఁకువ? ననుచున్. ౫౬

తే॥ ద్రోహిరావణుఁ దలలతోఁ ♦ ద్రుంపనెంచి, యొజ్జకాళ్లులు మస్తక ♦ మెజ్జకుతిక
తోడఁగైలాసగిరి వోలె ♦ దొడ్డ తెల్ల, తనువుతోడ జటాయువ ♦ త్తఱిని వచ్చె.

క॥ బిడ్డా! భయపడకు మనుచు, నడ్డముగా నిలిచి యసుర ♦ నదలించుచు వీఁ
డెడ్డెతనమూని తాఁకం, డొడ్డాడెన యనుచు నుంత ♦ యూఱట పడుచున్. ౫౭

చ॥ చెడితివి నీవు బంధులకుఁ ♦ జేటొనరించితి దైత్యనాథ! యీ
పుడమి కుమారి సీత నిటు ♦ మోఱకు బుద్ధిని పట్టి తెచ్చితే?
విడువుము వీడవే ననువు ♦ వీడుట నిక్కము జీవితంబు గో
రెడు జనులెవ్వరేనియుఁ జ ♦ రింతురె యిట్టికుమార్గ వర్తనన్?. ౫౮

క॥ ఖరదూషణాది వీరుల, దురమునఁ బొలియించి పితర ♦ దొరకుఁ దనియ నిం
దురవుగఁ బెట్టఁగ నాతఁడు, నరుసముతోఁ గొనుట యెఱుఁగ ♦ వా? యవివేకీ!

తే॥ కోప ఘూర్ణిత మదకరి ♦ కొప్పరింప, శిలలు వైవఁ దలంచితే? చెనఁటి! పక్షి
యేడ? నను చంపుటేడని ♦ యెంచితేమి? విసము మ్రింగియు బ్రదుకును ♦ విశ్వసింతె?

క॥ హరిణములు పులులఁ గాంచిన, కరణిని దిక్పతులు జనులు ♦ కాలుండును దా
శరథులఁ జూచుచు నుందురు, వెరవేఁకివి నీవు బ్రతుకు ♦ వెంటయుఁ గలదే?

క॥ సుతసోదర సహితముగా, హతమాటకు నింతకంటె ♦ నధికమగు దురా
గతమును కలదే? కుగతికిఁ, గతమిది, యే జన్మమునకుఁ ♦ గలుగవు శుభముల్. ౫౯

క॥ ఈ నరవరులు త్రిమూర్తుల, లో నగ్రియు లాత్మలగుట ♦ లోకములో నె
వ్వానికిఁ బోల్పఁగ నగు? నిది, మానుగఁ దెలియంగలేక ♦ మత్తుఁడవై తే? ౬౦

క॥ అమరులఁ గాచిన నరవరు, కొమరుఁడు కోదండ ధరుఁడు ♦ కోత్తల నడరన్
సమయించుఁ దప్పదీ వీ, యమ విడి పరుగిడుము నేనె ♦ యతనిం జేర్తున్. ౬౧

తే॥ బ్రహ్మయిచ్చిననయాయువు♦ భర్గుఁడొసఁగు, ఖడ్గమునుమాయమంత్రముల్ ♦కడఁకతెల్ల
సత్యవంతుఁడౌ రాఘవు ♦ సాయకములు, బయలు వెడలు నంతవఱకే♦ బలయుతములు

తే॥ అనిన విని దైత్యవల్లభుఁ ♦ డౌఘు గఱచి, కనుల నిప్పు లురలఁ జూచి ♦ గ్రద్ద! నీవు

త్రోవ వీడుము కాదేని ♦ యీవు పోగడు, వారిఁ జూపుము తలగిల్లి ♦ వైచు వాఁడ
తే॥ శిత శరాళిచే నీయొమ్ము ♦ చీల్చికొనక- త్వరగఁ దొలఁగుము నిలువకు ♦ తప్తలోహ
గత జలం బది క్రక్కెనఁ ♦ గ్రక్కుఁగాక, యీమధురవాణి మీకడ ♦ కింక రాదు.
తే॥ ఇట్టు లసుర పల్కఁగఁ గోప ♦ మినుమడించి, సీతఁగని జటాయువు, తల్లి! చెనఁటిమొడలు
ఖండ తుండ ములగు; మహా ♦ క్రందనంబు, వలదు మనవారు లేరను ♦ వంత వలదు.

ఉ॥ కన్నుల నీరు ముత్యముల ♦ కైవడి యొమ్మునఁ జింద నేడ్వకో
యన్నుల రాణి! యీఱడిలి, యారయు తాలఫలౌఘు గుచ్ఛము
ట్లున్న శిరంబులీ పదిన ♦ మున్నతి మున్నితఁడేలు దిక్కులన్
భిన్నములై నిరాసములఁ ♦ బేర్చి పడం గనుమంచు నుగ్రుఁడై. ౧౬౬

చ॥ ఎఱకల బల్మిచే నశని ♦ యేపునఁ జావఁ బడంగఁ ద్రోసి య
మ్మొఱకు తలల్ ధరం జదియ ♦ మోఁదుచు ముక్కునఁ గన్నులూడ్చఁగాఁ
బెఱుగు జటాయు వయ్యసుర ♦ వీరుని తేరిని వీణెపెక్కుముల్
విఱుగఁగఁ దన్ని తోల్దొలుత ♦ వేల్పుల దీవన లందె నత్తఱిన్. ౧౬౭

ఉ॥ ఎన్నఁడు నిట్టిభంగ మెరి ♦ యింపని దైత్యమనంబు దిగ్గనన్
గన్నులు క్రాఁగు లక్కవలెఁ ♦ గట్టెఱు పొందగ సర్వలోకముల్
క్రన్నన సంచలింప దశ ♦ కంధరుఁ డయ్యెడ బిట్టు నవ్వుచుం
బన్నుగ వంచె భ్రూకుటిల ♦ బంధము తోఁ దనదొడ్డచాపమున్

ఉ॥ క్రొన్నెలరేకవంటి నెఱి ♦ కోఱలు దైత్యుడు చిత్రజల్లుగాఁ
బన్నిన బాణజాలములఁ ♦ బక్షమరుత్తునఁ గొన్ని దూల్చుచుం
గొన్నిటి గోళ్లతోఁ జఱచెఁ ♦ గొన్నియముండును భీతి నొందఁగా
భిన్నము చేసెఁ జంచువుల ♦ భీమబలుండు జటాయు వయ్యెడన్. ౧౬౯

ఉ॥ క్రూర భుజంగమంబులను ♦ గొబ్బునఁ గైకొన వచ్చు పక్షి రా
డ్వీరుని వోలె గృధ్రపతి ♦ డీకొని రక్కసి బొమ్మిడీకముల్
తేరిపయిం బడం బద హ ♦ తిం దొరలించుచుఁ గర్ణకుండలాల్
వేరిమి డుల్చి పైకెగిరె ♦ వెక్కసమంది సురారి చూడఁగన్. ౧౭౦

చ॥ దనుజుఁడు పట్టరాని బెడి ♦ దంబగు కోపముతో బదేను మా
ర్గణముల నాజటాయువు ను ♦ రమ్మున నాటఁగఁ నేసి వెండియున్
ఘన విశిఖమ్ములం దనువు ♦ గాసిలఁ జేయ ఖగేంద్రుఁడప్డు క్రుం
గెన యని వేలుపుల్ మిగుల ♦ ఖేదమునొందిరి పిచ్చలించుచున్. ౧౭౧

ఉ॥ గాయములందునుండి వడిఁ ♦ గాఱెడి శోణితపు ధారతోడ న
త్యాయత సత్త్వయుక్తుఁడు జ ♦ టాయువు చూడఁగ ముక్ఖరాద్యన్న

క్త్రోయధి నుండి తెల్లనగు ♦ తోయదమొండు ద్రవంబు గొంచు నా
ప్యాయముగా జడిం గురియు ♦ వైనము దోఁచె నభస్స్థలంబునన్. ౪౨౧

ఉ॥ ఊరుపు పుచ్చి కోపమున ♦ నుగ్రముఖుండయి పక్షిఱేఁడు దే
వారి భుజంబు లిర్వది న ♦ ఖావళి అక్కుచు దూఁటి ముక్కుతో
వారక ఱెక్కలం జఱచి ♦ వాని మహోజ్జ్వల తారహార యు
క్స్ఫార విశాల వక్షమునఁ ♦ బ్రబ్బిన కంకట మంటఁ జించఁగన్. ౪౨౩

చ॥ ఎరియుచు రావణుండు కరి ♦ నేషు శతంబునఁ బక్షిఱేని పే
రురమును గాఁడ నేసిన ముహూర్తము లోననె చింతనొందు ని
ర్జరులును మోదిలం బులుఁగు ♦ రాయఁడు దైత్యుని వింటినారి ని
బ్బరమునఁ బట్టి లాగెఁ దన ♦ బంధుర చంచువుతో బలంబునన్. ౪౨౪

తే॥ ఈశుతోడఁ గైలాసంబు ♦ నెత్తినట్టి, లావరి శరాసనము నోట ♦ లాగి కొంచు
నింద్ర ధనువుతోఁ దెల్లని ♦ సాంద్రమేఘు, మట్లు వెలసె; నాతని బల♦మరయ వశమె?

మ॥ వెను చూపింపని వక్షముం బొరయు నా ♦ వేగంటిఁ బొఱింగఁ జే
సిన దైత్యేంద్రుని విల్లు శూలిధనువుం ♦ జెండాడు శ్రీరామ చం
ద్రున కుం దండ్రిగ నొప్పి యాజికి సుమి ♦ త్త్రిండైన పక్షీంద్రుఁ డు
క్కున నోటంగొని కాళ్లతో విఱిచె ది ♦ క్కుల్ చూచి మేల్మేలనన్. ౪౨౫

తే॥ లోక కంటకుఁడైన యా ♦ నాకవైరి, విల్లు విఱుగుట గని కోప ♦ వివశుఁడగుచుఁ
ద్రిపుర సంహారకారకో ♦ ద్దీప్తమైన, శరమువంటి శూలమువైచె ♦ జగము వడఁక.

ఉ॥ శూలము తన్ను చంపునని ♦ స్రుక్కక నీడజ రాజు కాంచి నా
మేలిమిఁ జూడుమంచుఁ గడు - మేకొని వక్షముతోడఁ దాఁకఁగా
వేలుపు లిద్ది సాహసము ♦ విస్మయ మంచు వచించి చేతులన్
బోలఁగఁ దట్టి కేఁకలిడి ♦ బోరన నార్చిరి మెచ్చులాడుచున్

చ॥ వెల చెలియింటికిం జనిన ♦ పేదను బోలె, సతీమతల్లి వ
త్రిలని గృహంబునం దతిథి ♦ బృందమువోలెఁ, బరేశు చింతయే
చెలువము గాఁగ నొప్పు ముని ♦ సింహునిగాంచిన యొప్పులాఁడి చూ
పుల వలెఁ, గ్రమ్మఱిల్లె వ ♦ డిఁ బోయిన రావణు శూలమత్తఱిన్. ౪౨౬

చ॥ కినుకను వేఱుకై దువును ♦ కేలఁ గొనం గమకించు నంతలో
నన రథచోదకుం జదిపి ♦ నాలుక వెల్వడ మూర్ఛ మూఁడ్చి రా
వణుఁడు కలంగి వందురఁగ ♦ వాని ముఖంబులు రక్తసిక్తమై
మున్నుఁగఁగ లక్ష్యముంచి తగు ♦ పోఁడిమితోఁ బయివైచె నాతలన్, ౪౨౭

తే॥ విసరికొట్టిన తలఁగాంచి ♦ వెక్కసమగు, బిడియమును కక్కసంబును ♦ పెనఁగొనంగ
రావణుఁడు దండమునఁ బక్షి♦రాజుఁ గొట్టె, బర్వతమువలె భువిఁ బడెఁ♦బక్షిఱేఁడు.

తే॥ అంతఁ దీక్ష్ణదృష్టియును వెన్నంటఁ జాల, నట్టి వేగంబుతోఁ దాన ♦ స్యందనంబు
నడపుకొని పోయె దానవ ♦ నాయకుండు, సీత పుంటిపై నిప్పించు ♦ చెన్నునొంద.

ఉ॥ ప్రుక్కడి దైత్యుఁ డేగుటయు ♦ భూమిజ దుఃఖముఁగాంచి చెచ్చెరన్
నిక్కిమహోద్ధతిన్ మెఱవ ♦ ణించుచు శోకము నొంద కమ్మ! యీ
టక్కరిఁ గూల్తు నేనని జ ♦ టాయువు దివ్యుల సంతసంబుతో
నెక్కడ కేగెదంచు దను ♦ జేంద్రు శతాంగము నడ్డగించుచున్. ౮౮౩

చ॥ బలమున వాని దండమును ♦ పట్టి తటాలున లాగివైచి వా
జులఁ దన శాత చంచువున ♦ జొత్తిలఁ బొడ్చి వధించె జీవితం
బులు గొను మృత్యుదేవతయు ♦ భూరిభయంబునఁ గేలుదోయి కం
పిలఁ గొనియెన్ రథం బవల ♦ భిన్నము చేసెఁ దదున్నతుల్ సెడన్. ౮౮౪

చ॥ అరదము నుగ్గుచేసి భుజ ♦ హంకృతి మాపి శరాసనంబులన్
గరముల నూడ్చివైచి రణ ♦ కర్మము సాగక చేసి లోభులం
బొరసిన ద్రవ్యరాశి క్రియఁ ♦ బొల్చు నిమంగములన్ సరాలునన్
గెరలిపడంగ లాగికొని ♦ కీడ్పడఁ జేసె జటాయు వాలనిన్. ౮౮౫

చ॥ చలమున వాని శీర్షములఁ ♦ జక్కగ మోఁది శ్రమంబు గూర్చి బా
హులపయి ఱొమ్ముపై శితన ♦ ఖోత్కరశక్తిని ఱక్కముక్కుతో
నలిగులిసేయ దైత్యకుల ♦ నాథుఁడు సుక్కుచు విహ్వలించుచున్
నిలిచినఁ గాంచి నీ బలము ♦ నేరుపు నింతయె యంచుఁ గేరఁగన్.

క॥ ఉగ్రుఁడయి దైత్యనాథుఁ డు, దగ్రత హారుఁడిచ్చు చంద్ర ♦ హాసము పెలుచన్
వ్యగ్రమతిఁ బూని వానిని, నిగ్రహమున నేసె విబుధ ♦ నివహము బెదరన్. ౮౮౭

చ॥ అపజయ మెట్టిదో యెఱుఁగ ♦ నట్టి జటాయువు వృద్ధుఁడౌట మో
క్షపదము చేరువాఁడగుటఁ ♦ గ్రవ్య భుగీశ్వర చంద్రహాస సం
తపన మహోగ్రతన్ బలము ♦ దక్కి సురేంద్రుని వజ్రధారచే
విపుల గరుచ్ఛిదం బయిన ♦ పృథ్వీధరం బనఁ గూలె నేలపై. ౮౮౮

చ॥ ఎఱకలు త్రుంగి మేదిని ప ♦ యింబడె గృధ్రవిభుండు దేవతల్
పరుగులు వాఱి రెచ్చటికొ ♦ పార్థివనంధన దిక్కులేనిదై
సురిఁగె నటంచుఁ జిత్తముల ♦ శోకము నందిరి తాపసేంద్రు ల
తఱిని సువర్ణ పుష్పములు ♦ దండడి రాలెను కంకరాజుపై. ౮౮౯

ఉ॥ రావణుఁడార్చె వాగుర ♦ నొంటంగి దగుల్కొను లేడివోలె భూ
దేవి తనూజ విహ్వలత ♦ దీల్పడె నూర్చె వడంకె నొచ్చె దుః
ఖావిల తప్తచిత్తయయి ♦ యాదరువా కొమ త్రుంగిపోవఁగాఁ
దీవియవోలె నేలఁబడి ♦ తేఱక మిక్కిలి కుంది దూపిలెన్. ౧౯౦

తే॥ నన్ను కాపాడ వచ్చిన ♦ నయగుణుండు, గృధ్రరాజు గతించె ది ♦ క్కెవ్వరింక
ననుచు జానకి మిక్కిలి ♦ యంగలార్చె, నాదరువుపోవ వెల్లువ ♦ సలయుభంగి. ౧౯౧

చ॥ తెలివి యొకింత లేక గుణ ♦ ధీయుతు లక్ష్మణు పల్కులన్నిరా
కలనముచేసి కోపమునఁ ♦ గాఱులు పల్కితి సాగనంపి త
త్ఫల మిపు డొందితిం దవిలి ♦ బానటయైన జటాయు వీల్గెఁ గా
వల మది యెట్టి కష్టముల ♦ పాల్పడఁ జేయునొ! యేమి చేయుదున్? ౧౯౨

చ॥ శరణ మొసంగి రక్షణము ♦ సల్పఁగ వచ్చిన యాతఁ డీల్గుటా?
నరకమునొందఁగాఁ దగిన ♦ సంజుడుదిండి జయంబు నొందుటా?
కరకరిపాపమే జయము ♦ గాంచునె? ధర్మమె యోడిపోవునే?
ధరఁగల సర్వశాస్త్రములు ♦ దబ్బఱలే? సుకృతంబు వ్యర్థమే? ౧౯౩

ఉ॥ కొంకక యేను బేలనయి ♦ కోరుటఁ బట్టియె దూరమేగు వీ
రాంకవరేణ్యులార! తగు ♦ న్యాయపథంబున నేగువారికిం
బొంకపు మార్గదర్శియగు ♦ పూతచరిత్రుఁడు తండ్రికంటెు ని
ర్వంకలఁ బ్రీతిశాలి యగు ♦ పక్షివరేణ్యుని చూడ రండిటన్ ౧౯౪

తే॥ క్రొత్తడి తనంబు చెడఁగొట్టు ♦ కొనకయుంట, నాప్రయత్నమేయైన, నీ ♦ న్ననువు సెందు
రాముకోదండమునకు నే♦ రాణఁబొచ్చు, వంశమునకబ్బె నాచేటు♦వలనఁబబ్బు. ౧౯౫

తే॥ కొడుకుకై ప్రాణములువీడు ♦ కోసలేంద్ర!, మైత్రికై ప్రాణములువీడు ♦ మాననీయు
నజ్జటాయువు దివిఁబరి ♦ ష్వంగసుఖము, గొసఁగఁబిలిచితే? తా నిన్ను ♦ గూడవచ్చె.

తే॥ ఒఱలుచిటులుండు జానకి ♦ నెఱికలు తెగి, సడు జటాయువుఁగని శేరి♦సయిని మట్టి
పెళ్లతో నంసమున నామెఁ♦బెట్టికొనుచు, గగనవీథిని పఱచె నా♦క్రవ్యభుజుఁడు ౧౯౭

తే॥ చెనఁటి యాకాశ వీథిని ♦ శీఘ్రగతిని, జరుగఁ గన్నులు మనసును ♦ గిరగిరమని
తిరుగ ధృతిచెడి ♦దిక్కులు♦ తెలియకుండ, తన్ను మఱచి జానకిచేష్ట♦దప్పియుండె. ౧౯౮

తే॥ పిదపనిసుమంత, తెప్పిటి ♦ విహగవిభుఁడు, కుంటిదెసఁగాంచి దైత్యుండు♦మిగులవేగ
మునను జనకనందిని గొని ♦ పోవుటరసి, మనసు తపియింపఁగుంది యి♦ట్లనియెఁ దుదకు.

క॥ లేరెరి తనయు లిచ్చట, రారెరి ధరాత్మజాత ♦ రావడి యుడుపం
గ్రూరాత్ముల రాక్షసుల, నేరీతిం గూల్చు వారొ? ♦ యెయ్యది తెరువో?. ౨౦౦

క॥ రాకాసులఁ బరిమార్పఁగఁ, గాకుత్స్థులు జగతిబద్ధ ♦ కంకణులగుచో
సీకరణితగునె సీతకుఁ, గైకేయి కడంక యెంత ♦ గావించెఁ మదిన్?. ౯౦౧

క॥ పరమాత్ముఁడె రాఘవుఁడై, పరఁగె నసురవధముసేయఁ ♦ బాపాత్ముఁడు కా
వరమున నిటువంచించెను, పురుషోత్తము నెదుట నిలువఁ బోలియకయున్నె?. ౯౦౨

క॥ నాముద్దుల తనయుఁడు శ్రీ, రాముఁడు రక్కసులనెల్లఁ - గ్రచ్చఱఁజంపున్
దామరస జన్మశాపము, చే మానిని దాఁక వెఱచుఁ ♦ జెనటి యసురయుఃన్. ౯౦౩

క॥ జనకజ రక్కసిచెఱఁబడె, ననిసేయఁగఁ దగినతెక్క ♦ లఱువ్రైనన్
వనితారత్న సతీత్వం, బనునెఱకలు త్రుంగవనుచు ♦ నారట ముడిగెన్. ౯౦౪

ఉ॥ సత్తువ తగ్గి ఱెక్కలును ♦ జాఱఁగ సీత చెఱన్ వదల్పలే
కత్తిన సిగ్గు రాఘవుల ♦ యందలి ప్రేమయు మానసంబులోఁ
గ్రొత్తలువాఱ నిద్రగొను ♦ కోపునఁ గన్నులు మూసియుండె లో
నుత్తలపాటుతోఁ దెలివి ♦ యొయ్యనఁ దప్పకయుండె ధీరతన్. ౯౦౫

తే॥ త్వరగఁ బదిలంబుగాఁగ రావణుఁడుజనక,తనయఁగొనిపోయియామెను-తాఁకవెఱచి
విసమువంటి రాకాసుల - పిండునడుమఁ, బందినుంచె నశోకికా - వనమునందు. ౯౦౬

### లక్ష్మణుఁడు రాముఁ గానఁ బోవుట

తే॥ అచట హేమకురంగంబు - నంటిపోవు, ననఘురాఘవు క్షేమంబు - నరసిరాఁగ
సీతయంపిన సౌమిత్రి - చెలువునింక, నరయఁబోదము వారల - మఱవనగునె? ౯౦౭

క॥ జానకి నొంటిగ విడుచుట, చే నేమగునో యటన్న - చింతను సీతా
జాని విడఁ గాంతి మాసిన, యానగరము వీడు - భరతు నంగముతోడన్. ౯౦౮

క॥ సాగరమున నౌకంబలె, వేగిరమున నడచి రాము - వీక్షించి మన
స్సాగరము నడఁచి పరిము, త్సాగరమున మునిఁగెఁగనులు - తనివింబొందెన్. ౯౦౯

క॥ తడఁబడి భీతిం బొరయఁగ, నెడముగు మారీచురవము - నెఱుఁగమి వలనన్
బుడమి తనయ బెగడెడునని,యెడఁదఁదలఁచు రాముఁడతని-నెలమింగనుచున్. ౯౧౦

ఉ॥ దేహముతోడ మానసముఁ ♦ దీఱని విక్లమమంది వచ్చె సం
దేహముతోడ మానసముఁ ♦ దీఱని విక్లమమందు నాకడన్
మోహముతోడ మానసము ♦ మూర్ఛిలఁ దొందఱ పెట్టి పంపవై
దేహియె కారణంబగు వి ♦ ధిం దొలఁగింప జనుల్ సమర్థులే? ౯౧౧

చ॥ అని తలపోయుచున్న తన ♦ యన్నను డాసి నమస్కరింపఁగా
ననుజుని కౌఁగిలించుకొని ♦ యత్తరపాటున వచ్చుటేలనన్

వినుటకు వింతయైన ధ్వని ♦ వీనులఁ జేరఁగ నుమ్మలించి మ
జ్జనని భయంబు నొందెఁ బలు ♦ చందములన్ దగవ్రాఁది పల్కినన్.

ఉ॥ నీవరశక్తి ధైర్యముల ♦ నేనెఱిఁగింప వినంగ నొల్లకే
పోవక యుందువేని పడి ♦ పోయెదఁ జిచ్చున నంచుఁ గానలో
దావముఁ గూర్చి పోవునెడ ♦ ధర్మము కాదని యందు నిల్వలే
కీవగ నామెఁగావ మది - నెంచితి నంచనుజుండు పల్కఁగన్. ౯౦౩

ఉ॥ చావఁగనున్నఁదప్పునొకొ? - సంకటముల్ దొలఁగంగ నూఁకు నే
ర్పేవిధి లేని దక్కట! వి ♦ హీనమతిం బదరె న్నిజంబుగాఁ
గావలి లేనిచో నెడరు ♦ గల్గును వచ్చిన యాపదావళుల్
పోవవు వేఱునేయుటకుఁ ♦ బూనిన సోఁకుల తంత్ర మియ్యదా. ౯౦౪

ఉ॥ నీయెడఁ దప్పులేదు గుణ ♦ నీరధి! ధీ రహితాత్మ సీత నీ
వాయెడఁ బల్కు పల్కుల న ♦ నాదృతి చేసెను నేఁదలంచి న
ల్లోయది పూని నన్ జెఱచె ♦ నే యని యెన్నఁడు నేని డెంద మ
త్యాయతమై కలంకమతి ♦ నందని రాముఁడు కుందె నెమ్మదిన్. ౯౦౫

ఉ॥ కాలము త్రోవఁగా ఫలము ♦ గల్గదు జానకిఁ గాంచు పిమ్మటన్
దూలును చింత వేఱొకట ♦ దోరదయంచు వచించి క్రించరన్
జాలగ దవ్వు నారసము ♦ చందమున న్నడతెంచి లోల వ
క్రాలక సీతయుండిన మ ♦ హావనమున్ దరిసించి యయ్యెడన్. ౯౦౬

శ్రీ రాముఁడు సీతలేమికిఁ జింతిలుట.

ఉ॥ శ్రీరఘువీర శేఖరుఁడు ♦ చింతను పర్ణకుటీరమందు కాం
తారమునందు నెచ్చటను ♦ ధారణి కన్యక జాడ గాన క
ట్లూరక భ్రమాన్పడ న్నిలిచె ♦ నొత్తిలి కాయము జీవువీడి ని
స్సారత నొంది పిమ్మటను ♦ సంకట మందుచు రోయు కైవడిన్. ౯౦౭

ఉ॥ జీవితవాంఛపై విసుగు ♦ చెందిన రాఘవ సార్వభౌముఁడ
ద్దేవిని కానమి న్నిలిచె ♦ దివ్యనిధిం దనకంచు డాఁపఁగాఁ
జేవిడఁ జోరుఁడొక్కరుఁడు ♦ చేరి ధరాస్థలిఁ గొల్లగించి కొం
పో వెతనొంది దిగ్భ్రమము ♦ పొంది యలంగెడు దీను కైవడిన్. ౯౦౮

చ॥ తిరుగఁగఁ జొచ్చె భూమియు న ♦ దీనదముల్ కడు సంచలించె సా
గరములు ఘూర్ణిలెన్ గిరులు ♦ క్రక్కదలెన్ దొలివేల్పు కన్నులుం
దిరిగెను సూర్యచంద్రులును ♦ దిక్కఱి త్రోవలఁ దప్పినారు శ్రీ
వరుఁడు తపింప నెయ్యది భ్రమ ♦ వంబుగ నిల్వఁగఁ జాలుఁ జెప్పుమా?:

శా॥ కోపంబూనునొ పాడిపైఁ? దనదయం • గోపించునో? పాపముం
గోపంబారఁగఁ జూచునో? త్రిదశులం • గోపించునో? పఠానులం
గోపస్ఫూర్తిని కాంచునో? శ్రుతులపైఁ • గోపించునో? వేనిపై
గోపంబూనునొ? యేమియౌనొ? యనుచుం • గుందెన్ జగజ్జాలముల్.

చ॥ సకలము డిందె లోకవిభు - చక్కని గర్భము సొచ్చువేళలోఁ
గకవికచెంది లోకములు - క్రన్న విపర్యయ మొందుకై వడిన్
సకల జగచ్ఛరణ్య గుణ - జాలుని రాము మనంబు వేఁగఁగా
మెకములు కొండలుం జనము - మేదిని నాకము చెందె దుఃఖముల్. ౯౨౧

ఉ॥ కాంచుము తేరి చక్రము ది - గంబడి పోయినదారి యియ్యెడన్
గాంచుము దేవిఁ దాఁక భయ - కంపితుఁడై భువిఁ బెల్లగించుటల్
కాంచఁగరాదు కార్యమిటఁ - గాడ్పడి యజ్ఞులపోల్కి నిల్చినన్
కాంచఁగ నౌను వారు దవు - గాఁ జను ముందని లక్ష్మణుండనన్. ౯౨౨

రామలక్ష్మణులు సీతను వెదకుచుఁబోవుట.

చ॥ సరియని రామచంద్రుఁడును - చయ్యన నాయుధముల్ ధరించి పెం
దెరువును పట్టి ప్రాఁకులవ - నీ ధరముల్నలఁగంగ వేగమై
నరదము భూమిమీఁదఁ జని - నంతకు దుర్గమ కాననస్థలిన్
దరియుచు దాఁటుచుం గడఁక - తక్కక యేగె ననుంగుఁదమ్ముతో. ౯౨౩

చ॥ ధరణి శతాంగ చక్రముల - దారియు గుర్తులు తేలిపోయి యం
బరమున నేగినట్లు నడి - పాఱుటచే వ్రణమందు నీఁకె పో
టారసిన లీలఁ దోఁపఁ గన - నోపుట కెయ్యది మార్గమంచు నం
బురుహవిలోచనుం డనఁ బ్ర - పూర్ణ గుణాంబుధి లక్ష్మణుండనున్. ౯౨౪

శా॥ అన్నా! చూడుము తేరు దక్షిణదిశా - ప్రాంతానకుం బోయిన
ట్లెన్నంగాఁదగు నీశరంబు పొడవే - యీవ్యోమ మార్గంబు నీ
కన్నుల్ బాష్పము గార్చుచుండ నెదియుం - గాన్పించునే? పోదమీ
తెన్నుంబట్టి యుదంతముల్ తెలియనౌఁ - దెల్లంబుగా మీఁదటన్.

చ॥ అన నది యుక్తమంచు వసు - ధాధిప వర్యుఁడు తమ్ముతోడ యో
జనములు రెండు దాఁటిచని - చక్కటి నొక్కనగేంద్రమే ప్రభం
జనహతిఁ దల్లక్రిందులుగ - జాటినకై వడి వీణెటెక్కె మొం
డనువుగ ధారణిం బడుట - యల్లనఁ గాంచెను సంశయించుచున్. ౯౨౬

చ॥ కని జనకాత్మజాతకయి - కయ్యము గల్గిన దియ్యెడన్ భరం
బున దనుజాళితో విబుధ - ముఖ్యులకంచుఁ దలంచి తుండ మ

ర్దనమునఁడాలు ప్రీలఁగని - తద్దయుఁ గన్నుల బాష్పబిందువుల్
తొనఁకఁగ లక్ష్మణుంగని సు - దుఃఖముతో రఘురాముఁ డిట్లనున్. ౯౭

చ॥ అరయుము లక్ష్మణా! జనకుఁ - డైన జటాయు కరాళ తుండ దు
ర్భరహతిచేతఁ ద్రుంగినది - రాజిత సత్త్వముచే నెదుర్చు న
ప్పరమగుణాబ్ధి కేమిగతి - పాటిలెనో? యొకరుండు దేహముల్
వరలెను వార్ధకానఁ బలు - వత్సరముల్ కడద్రోచె నావుడున్. ౯౮

ఉ॥ మంచిదె తండ్రి చాల మతి - మంతుఁడు వృద్ధుఁడు సత్త్వశాలియున్
గ్రంచరనేగి యాతనిని - క్రాంతము వారల నడ్డగించుచున్
మించి నిశాటులం దునిమి - మేలుగ సీతచెఱన్ వదల్చు యో
చించుచు నిట్టులుంట సాగ-సే యని తమ్ముఁడు పల్క రాముఁడున్. ౯౯

ఉ॥ జాలమొనర్ప కేగుటయె ♦ చక్కటియంచుఁ దలంచి భూమిపై
గాలివలెం జరించుచును ♦ గాలిపటంబు క్రియన్ భజించి జం
ఘాలురు రామలక్ష్మణులు ♦ కార్ముకమొక్కటి యింద్రచాపముం
బోలెఁ బయోధి వీచికయుఁ ♦ బోలెఁ దునుంగుట గాంచి రచ్చటన్. ౧౦౦

ఉ॥ తమ్ముఁడ! కాంచితే ధనువు ♦ ధారణిఁబడ్డది దేవదానవుల్
క్రమ్మి పయోనిధిం జిలుకు ♦ కవ్వపుఁగొండను బోలు సత్త్వుఁడుం
దమ్ములఁబొందుఁ బోలిన ప్ర ♦ తాపము గల్గిన యజ్జటాయువే
యమ్మెయిఁ ద్రుంచెనంచు సమ ♦ రావనిఁజూచుచుఁ బోయిరిద్దఱున్. ౧౦౧

తే॥ మఱియుఁగొంతదూరముపోయి ♦ మరలఁగనిరి, శూలమొక్కండునారాచ ♦ జాలమున్న
తూణములు రెండు కొండల ♦ తుండులట్లు, పడి విరాజిలు టాశ్చర్య ♦ భరితులగుచు.

తే॥ మఱియుఁగొంతదూరముపోయి ♦ వెలుఁగుగొలుప, సూర్యచంద్రులురిక్కలు ♦ సొరిదిఁజేరు
కరణినున్న బొందడమును ♦ కానయెల్లఁ, గ్రమ్ముకొనఁ జీల్చివైచుట ♦ గాంచిరచట. ౧౦౩

తే॥ ప్లవన జవన తురంగముల్ ♦ పడినచోటు, సారథియుఁ దలదెగిపడి ♦ చచ్చుతావు
వానియనుచరుల్ కెడసిన ♦ తానములును, పంక్తికంఠుఁడు పోలిన ♦ పట్టుగనిరి. ౧౦౪

తే॥ ప్రళయవేళను భానుబిం ♦ బములు పెక్కు, లుర్విఁగూలిన కరణి ర ♦ త్నోజ్జ్వలత్ప్ర
శస్తకుండలములు విభూ ♦ షణచయంబు, తెరలుటంగని కేలువి ♦ దిర్చికొనిరి. ౧౦౫

తే॥ అంగదములు కుండలములు ♦ హారరత్న, మకుటములు పెక్కులున్నవి ♦ మనజనకుఁడు
వృద్ధుతోఁ బోర నిల్చిన ♦ వీరవరులు, శరభములఁ బోలుపెక్కండ్ర ♦ జాడ దోఁచె. ౧౦౬

తే॥ శ్రీశుఁడిట్లన లక్ష్మణ ♦ సింహమువిని, తలలుచేతులు పెక్కులై ♦ తనరుకతన
తండ్రితో ననిసేసిన ♦ దైత్యవరుఁడు, దశముఖుండని నాథుదిఁ ♦ దలఁతు నని యె

తే॥ తమ్ముపలుకులు నమ్మిడెం ♦ దమ్ముకనులు, నిప్పులురలంగఁ జూచుచు ♦ నెగచినడచు
రఘువరుఁడు రుధిర సాగ♦రమునఁదేలు,నురుతరాద్రినాఁ,జనుజటా♦యువునుకాంచె.

జటాయువుంగాంచి రాముఁడు చింతిలుట

ఉ॥ తత్తఱమంది రాఘవుఁడు ♦ తామరఱేకులవంటి కన్నులం
జొత్తిలు బాష్పముల్ తెరవు ♦ చూపఁగ నీయక యడ్డువెట్టఁ దా
నొత్తిలి తండ్రికై వడిన ♦ నూత్కర వైఖరి నొప్పు పక్షిరా
జోత్తముపైఁ బడెన్ భవుకి ♦ లోచ్చయమందొక యంజనాద్రినాన్. ౯౩౯

తే॥ గడియసేపు రాముఁడు సొమ్మ ♦ గాంచియుండె, లక్ష్మణుం డశ్రుమిళితజ♦లంబుచల్ల
నలినదళలీల గల నయ ♦ నములుదెఱచి, మెల్లమెల్లన నిట్లని ♦ పల్లటిల్లె ౯౪౦

చ॥ పితరులఁ జంపుకొంచుఁ ♦ బృథివీస్థలి నెవ్వఁడు తొల్లి నావలెన్
బ్రతికెను? ముస్నె కన్నపితృ ♦ పాదుని పీడితి మాకుఁగాఁగ నీ
శతి ననువుల్ త్యజించితివి ♦ తండ్రివి నీవు నిఁకేది దిక్కు? దు
ష్కృతినగునేను మీయెడఁ బ ♦ రేతవిభుండనుగా జనించితిన్. ౯౪౧

చ॥ జననిని బోలు ప్రేమగుణ ♦ శాలివి భావి నెఱుంగ కిట్టులే
ననయము నొందితిన్ దెలివి ♦ నందని జానకి కీడు ద్రోవఁదో
డెనయుక రొంటిమై నిడుమ ♦ నెన్నక మిత్రఋణంబు దీర్చితో
క్కనికినిగాని నేనిఁక వ ♦ గం గడియించుట యే ఫలంబుకై ?. ౯౪౨

ఉ॥ ఏనును తుచ్ఛజీవముల ♦ నీఁగియె యుందును చూడలేని స
న్మానుల దుఃఖముల్ దొలఁప ♦ మాటయొసంగితిఁగాన జీవముల్
పూనినవాఁడ ప్రామానివలెఁ ♦ బొల్చి సుకృత్యము చేయకున్నచో
నీసరజన్మముల్ నిలుప ♦ నిచ్ఛవహింప ధరాతలమ్మునన్ ౯౪౩

చ॥ తరుణి చెఱం దగుల్పడుట ♦ ధర్మచరిష్ఠుని నిన్ను చంపు ము
ష్కరుఁ డసువూని యుండుటయు ♦ గాదిలి తండ్రివి మమ్మువీడుటల్
మెరమెరనింప హస్తమున ♦ మేరువువోలిన విల్లుపూని చి
త్తరువు క్రియం జలింపక వి ♦ తంబఱి నిల్చిన వాఁడఁజెల్లరే!. ౯౪౪

మ॥ ననుబోల్కిరితిగల్గు వారు గలరే - నాకెంబుగాఁ బ్రాకృతం
బనుభోగించుచునున్న సీత గనుగో - నవ్యాహతస్థైర్యముల్
దనరం జూపి కృతార్థతంగొను మహా - త్మా! యొక్కనీచుండు ని
న్ననుమానింపక కూల్చిపోవ నిఁక శౌ - ర్యం బుండియుం గాల్పనే ౯౪౫

తే॥ పలువితంబుల నృపుఁడిట్లు - పనవిచిత్త, వికలతం జెందె;సౌమిత్రి - వెగడుకుడిచె;
నపుడు సుంత తెలివినొంది-యండజేంద్రుఁ, డూర్పుపుచ్చుచు నిర్వర-నొగినిగాంచె.

తే॥ రాఘవులఁగని సమ్మద - స్రములుగురియ, తెగినఱెక్కలు ప్రాణంబు - తివిరిసప్త
భువనములఁ బొందుపోలికఁ-బొంగినింద-పాపిపై చితినినియల్లఁ-బలుకఁదొడఁగె. ౯౪౭

జటాయువు రామలక్ష్మణులకుఁ గర్మప్రభావము దెలుపుట.

ఉ॥ పుణ్యచరిత్రులార! పాలి ♦ వోవు శరీరము వీడ నుంటి నా
పుణ్యవశంబునం దెలియం ♦ బొందితి మిమ్మని చేరఁ బిల్చి యా
పుణ్య జనేశు శీర్షములఁ ♦ బొడ్చిన ముక్కున భానువంశ రా
డ్గణ్యుల మస్తకంబుల రు ♦ టంబుగ మూర్కొని వెండి యిట్లనున్. ౯౪౮

ఉ॥ వంచనచేత జానకికి ♦ వచ్చె దొసంగని మున్నె యెంచితిన్
జంచలనేత్ర నొంటి నుట ♦ జంబున వీడితిరేల? యన్న ధ
ర్మాంచిత మూర్తి లక్ష్మణుఁడు ♦ హావడి కారణమెల్లఁ దేటగా
వించి వచింప నాతఁడును ♦ వీనులు క్రుంగ వినంగ లేమికిన్. ౯౪౯

తే॥ వెండి మోమును గన రామ♦విభుఁ డెఱింగి, తెలుపఁ జెవికడ సౌమిత్రి♦తెలియఁ బలుక
విని గ్రహించి కుమారులు♦వెగడు పడక, యుండునట్లు పల్కఁగ నెంచి♦యొయ్యననియె

తే॥ క్రొత్తగా నొక్క-రెద్దియుఁ♦గూర్పలేరు, జన్మ సుఖ దుఃఖములు కర్మ♦సంచయమునఁ
గలుగు నని యెఱుంగక యున్నఁ ♦ గర్మములను, బుద్ధిచే జయించుట యెట్లు♦పొసఁగు

చ॥ విధి కృతమంచు నెంచఁదగు ♦ పీడలు గల్గినవేళ మానసం [జెపుఁడ? ౯౫౦
బధికముగాఁగ నొవ్వఁ దన ♦ యక్కఱ మానుట ధీరధర్మమే?
బుధనుతమైన లోకమును ♦ పోఁడిమి సృష్టి యొనర్చి నట్టి యా
విధికిని మస్తకం బొకటి ♦ వీడఁగఁ జేసిన కర్మ మల్పమే?. ౯౫౧

మ॥ సుఖదుఃఖంబులు గల్గువేళ తొలఁగం ♦ జూడంగ నొనట్టిదే?
మఖ విద్వేషి కపాలియై తిరియఁగా ♦ మార్పించె రాహు గ్రహ
ప్రఖరాళీ గ్రసితుల్ రవీందులు, చెడున్ ♦ వర్ధిల్లు శుభ్రాంశుఁడీ
నిఖిలాండంబులు కర్మచేతఁ బొడమున్ ♦ నిల్చున్ నశించున్ దుదిన్.

క॥ చెడుగులు వచ్చుట తీఱుట, పుడమి జనుని పూర్వ కర్మ ♦ మున నగు నిక్కం
బిడుమల నింద్రుఁడు పెక్కులు, కుడువఁడె తొలి? మీరు వినరె♦గురుశాపమునన్?.

ఆ॥ సాటిలేని యోధ ♦ శంబరాసురునిచే, నిర్జరాధిపుండు ♦ నింద నొంద
నపుడు వాని గూల్చె ♦ నజు పట్టి మీతండ్రి, కర్మవశమున యున్ని ♦ గలుగుఁ జూవె.

ఉ॥ వీరవతంస! జానకిని ♦ వీడుటయున్ దనుజాళి ధర్మవృ
త్తిం జరించి త్రెంచుటయు ♦ మిక్కిలి ఖేదము సంఘటించె ని
ర్ధారణి సజ్జనావళికి ♦ దానిఁ దొలంపుము క్రూరదైత్యులన్
ధీరత సంహరింపుము క ♦ దింపుము కీర్తిని నిల్పు ధర్మమున్. ౧౫౬

ఉ॥ భూమిఁ బెకల్చి యెత్తికొని ♦ భూమిజఁ గైకొని పోవుదైత్యు నా
స్థేమముఁ జూపి పోరితిఁ దు ♦ దిన్ దనుజేంద్రుఁడు శంభుఁ డిచ్చు ప్రో
ద్భీమ కరాసిచే జతను ♦ వీసరవోవఁగ నిట్లు చేసె నా
కీ మరణార్తి గల్గినది ♦ యిప్పుడె రాజకులావతంసమా! ౧౫౭

## శ్రీరాముఁడు దివిజులపైఁ గినుకఁ గొనుట.

క॥ ఆమాటలు చెవిఁబడ శ్రీ, ధాముని కనుదోయి రక్త ♦ధారలఁ గురిసెన్
భీమముగ భ్రుకుటి ముడివడె, ధూమముతో నగ్ని లేచెఁ ♦ దొట్రిలె జగముల్. ౧౫౮

చ॥ నిలుకడ దప్పె ధాత్రి ధర ♦ ణీధరముల్ పెటిలెన్ దినేశ చం
ద్రులు గ్రహముల్ గతుల్ బెడియఁ ♦ దోయజగర్భుఁడు లెక్కడెన్ జగ
ద్విలయము నాకము న్వడఁకె ♦ దిగ్గజముల్ బెదరెన్ సమస్తముం
దెలిసికొనెన్ రఘుప్రవరు ♦ దీపిత సత్త్వపరాక్రమ స్థితుల్. ౧౫౯

తే॥ ఎవరిపై వ్రాలునొక్కొ యీ♦యీర్ష్యయనుచు, జగములెల్లను బెగడొంది♦సంచలింపఁ
బొగయు నిప్పును వెలువడ ♦ భూరి భీక, రముగ నట్టహాసంబుతో ♦ రాముఁ డనియె.

చ॥ తెలివి యొకింతలేని యొక ♦ తెక్కలి దైత్యుఁడు నాసతీమణిన్
బలమునఁ గొంచుఁ బోవ నొక ♦ పాటిగ మీరిటు గాఁగ నుంత భీ
తిలని దిశావృతంబు జగ ♦ తీ తలముం గని యూరకున్న ది
వ్యులఁ బరిమార్తు నిప్డె కని ♦ యూఱట నందుమ తండ్రి! యీయెడన్.

ఉ॥ రిక్కలు రాల సూర్యుఁడును ♦ ప్రేల సభస్థనలి నిప్పు గ్రమ్మఁగా
నొక్కటఁ బంచ భూతములు ♦ నుర్వి చరాచర జీవ కోటులున్
ప్రుక్క సమస్తలోకములు ♦ చూర్ణముగా దిశలుం బగుల్లుగా
నుక్కటి ద్రుంగుచుండఁగ స ♦ ముత్సుకతన్ గను తండ్రి! యిత్తఱిన్.

చ॥ అని రఘుపుంగవుం డడర ♦ నంబుజ మిత్త్రుఁడు మేఘ మండలం
బున నడఁగారె దిక్కరులు ♦ పొక్కుచుఁ బాఱె జగంబులెల్ల జం
కెనయును బిమ్మిటిం గొనిన ♦ ఖేదము చెప్పఁగ నేల? దిట్ట ల
క్ష్మణుఁడును జంకెనన్న నుడి ♦ చాలదొ? తక్కటి యేల పల్కఁగన్?. ౧౬౩

జటాయువు రామునకుఁ గర్తవ్యము దెలిపి ముక్తుఁడగుట.

ఉ॥ రాఘవు కోప జృంభణ భ ♦ రంబు జటాయువు గాంచి యిట్లనున్
నీ ఘనకోపముం విడుము ♦ నిర్జరులున్ ముని చంద్రులున్ వరా
ఘౌఘ భవద్బలంబునన ♦ మోఱకు సోఁకుల పోరుసీఁగి దుః
ఖౌఘములం ద్యజింతురు దు ♦ రాత్ముల వేఱొక రీతి దోర్తురే?. ౯౬౪

చ॥ అజుని వరంబుచే మదము ♦ నంది దురాత్ముఁడు చేయు చేఁతల
క్కజముగ నాయెడం దెలిసెఁ ♦ గాదె? మఱొక్కటి యేల చూపఁగన్?
భుజగులు వేల్పులు న్నరులు ♦ పూజ్యుఁడు బ్రహ్మయు వానిసేవలన్
గుజగుజవోవ, ధర్మమును ♦ గోరి చరించెడు వారలుందురే?. ౯౬౫

ఉ॥ వైరులయొద్ద సేవకుల ♦ వైఖరి స్త్రీలవలెం జరించుచున్
భూరి సుఖంబుల న్విడిచి ♦ పొక్కుచుఁజావక వేల్పులెల్ల మున్
శ్రీరమణుండు పాల్కడలిఁ ♦ జిక్కిన వేళ ననుగ్రహించి దే
వారుల నేమఱించుచు ద ♦ యన్ సుధ యీయఁగ నుండి రింతకున్.

ఉ॥ బాహుబలాఢ్యులార! వర ♦ వర్ణినిఁ గానల నొంటి డించి మా
యా హరిణంబు వెంటఁ జని ♦ యచ్చపు మీకులగౌరవంబు సం
దాహ మొనర్చినార లది ♦ తప్పక మీదగు తప్పుగాక సం
దేహములేల? మానవులు - దెప్పిన వారల నేరమానొకో? ౯౬౭

ఉ॥ కావునఁ గోప మందకుము - కాంత యరుంధతి వంటి సీత దుః
ఖావలిఁ బాపి వేలుపుల ♦ యంగద క్రుంగఁగఁ బాడి వర్ధిలన్
రావణుఁ గూల్చి లోకముల - రక్షణసేయుమ యంచుఁబల్కి తా
పావిల మానసుండయి ద ♦ యాళు జటాయువు మూసెఁగన్నులన్. ౯౬౮

మ॥ విహగశ్రేష్ఠు వినీతి సంభృత వచో ♦ విన్యాసముం మూర్ధమం
దహరేశాన్వయుఁడూనె నాత్మ పితృవా ♦ క్యాళింబలెన్; ధర్మ సం
గ్రహముం దైత్య వధంబు ముఖ్యమగు నా ♦ కర్తవ్య మిచ్చోఁ గ్రుధా
బహుళ వ్యాహృతులేల యంచు నుడిగెన్ ♦ బ్రజ్ఞాయుతుండై వెసన్.

మ॥ శ్రమగొన్నారలు బాధ నొందితిరి ని ♦ శ్రాంతిం గొనుం డేను పోఁ
డిమి మీయాజ్ఞ శిరమ్మునం దునుచు కం ♦ టిన్ వేఱు నాకేది మో
దము గల్గించును? సీత నెచ్చటికి నా ♦ దైత్యుండు కొంపోయెఁ? ద
ద్క్రమముం దెల్పుఁడు నా జటాయు వలసెన్ ♦ దప్పెన్ స్మృతిన్ మీఁదటన్.

మ॥ అరవిందాసన శంకరాదులును సర్వా ♦ మ్నాయముల్ వేని పా
ద రజంబుర గనుఁగొంటకై శ్రమములన్ ♦ దైవాఱఁగా నోర్చియున్

బొరయం జాలవొ యట్టి రామ చరణాం ♦ బుల్ గాంచి ధన్యాత్ముఁడై
దొరసెన్ శాశ్వతమోక్ష లక్ష్మి విహగేం ♦ ద్రుం డాత్మ సాక్షాత్కృతిన్.

మ॥ అటఁ బక్షీంద్రుఁడు ముక్తినొందఁగ నిలిం ♦ పాదుల్ రఘుశ్రేష్ఠు లు
త్కట శోకావిలచిత్తు లైరి యల కాం ♦ తార ప్రదేశంబు సం
కట పాటొందె మృగాళితోఁ దరులతో ♦ హ్మా భృత్యసమూహంబుతో
బటు దుఃఖంబున శీర్షమందు కరముల్ ♦ బంధించె లోకావళుల్. ౯౭౨

మ॥ శ్రమలం బొందితి దుష్టరాక్షసునిచే ♦ శౌర్యంబు గోల్పోయితిన్
దమినై ఘోర తపంబు సేయుదునొ? దై ♦ త్య శ్రేణి మర్దింతునా?
యమినై ప్రాణములం ద్యజింతునొ? మహా ♦ యం బెయ్యదో తెల్పు శ్రే
యములం గూర్చెడు తండ్రిఁ గోలుపడి యె ♦ ట్లింకింతు జీవంబులన్?. ౯౭౩

మ॥ అను నన్నంగని తమ్ముఁడిట్లను మహా ♦ త్మా! నిత్యతేజా! పురా
తన కర్మంబుల నింద సేయఁ దగునే? దాయంబు రెచ్చెన్నఁ జిం
తను పొందన్ ఫలమున్నె? రక్కసులఁ గ్రో ♦ ధం బాఱఁ జక్కాడి యా
వెనుకన్ దుఃఖము నొందఁగాఁదగు మదిన్ ♦ వీక్షింపుమా తత్త్వమున్.

శా॥ అన్నా! మీరు మదిం గలంగి కడు దై ♦ న్యంబూని విభ్రాంతి నా
పన్నుల్ మావదినెన్ విడన్ దలఁతురే ♦ బందీకృతన్? బుద్ధి సం
పన్నుండా మనతండ్రి గీటడఁచు క్రి ♦ వ్యాదున్ వడిం జంప కి
ట్లెన్నన్ శోక పయోధిఁ గ్రుంకుచుఁ దపం ♦ బీ కొంటయుం బోలునే?

మ॥ అనుజ శ్రేష్ఠుని వాక్కులొప్పు విని ♦ దైన్యంబున్ విసర్జించి యా
దనుజ శ్రేణి వధించు టే తగవుగాఁ ♦ దర్కించి సౌమిత్రితో
మనుజాధీశుఁడు పల్కు సీతనికి నం ♦ స్కారంబు గావింతమా
తనుజన్ముల్వలె నౌర్ధ్వ దైహికములం ♦ దాత్పర్యమేపారఁగన్. ౯౭౬

తే॥ అని యగురు చందనేంధనా ♦ లరసి తెచ్చి, పేర్చి దర్భలు పఱచి పై ♦ విరులు సల్లి
యరణి మథియించి యనలంబు ♦ నెరియఁ జేసి, విమల జలమున స్నానాది ♦ విధులు దీర్చి

చ॥ కరములఁ బట్టి యెత్తి తగఁ ♦ గాష్ఠము పేర్పునఁ జేర్చి వేద వి
ద్వరుఁడు రఘూద్వహుండు శ్రుతి ♦ పద్ధతిఁ దక్కక చేసి యవ్వలన్
శిరము కెలంకునం గొఱవిఁ ♦ జేర్చి దహించి కొలంకులోనఁ గ్రుం
కి రహిని తర్పణాదులను ♦ గీష్పడ కుండఁగఁ జేసి నెమ్మదిన్. ౯౭౭

తే॥ పితరులకు నెల్లఁ దర్పణ ♦ విధులు తీర్చి, యించుక జలంబు తాఁ ద్రావి ♦ తృప్తినొంద
బ్రహ్మ మొదలుగ నెల్ల జీ ♦ వ ప్రతాన, మును సంతృప్తి వహింపుచే ♦ మోదమంది

మ॥ జయ శీలుండగు రామ భూవరుఁడు శౌ ♦ ర్య ప్రక్రియల్ దీర్చి సం
శయముల్ మాని నిశాట మర్దన మహా ♦ సత్కీర్తిం బ్రకాశింప ని
శ్చయ సంతోషమునం జలిర్చెఁ గ్రతు భు ♦ క్సంఘుంబు, భానుండుఁ ద
త్క్రియఁ దానుం బొనరింప నేగెననఁ గ్రుం ♦ కెం బశ్చిమాంభోనిధిన్. ౧౦౦

౯ అయోముఖీ పటలము (౧౦౧)

చ॥ సరగున రామ లక్ష్మణులు ♦ సంజను తత్థ్సలి వీడి కారు చి
చ్చు రవులు వెల్గుచేఁ దెరువు ♦ చొప్పు గనంబడ నొక్క సల్లనౌ
గిరివరమందు చేరి రటఁ ♦ గీల్కొనె నిం్రదు జయించి రేఁగు రే
దిరుగుడు మూఁకలట్లు కడుఁ ♦ దెట్టియలై యిరు లగ్గలించుచున్. ౧౦౧

ఉ॥ అయ్యెడ కానలున్ గిరులు ♦ సన్నియుఁ దేనియ చింది వాఁగులన్
గ్రయ్యఁగ దుఃఖమొందు క్రియఁ ♦ గాసఁగ నయ్యను వారి చింతతో
నెయ్యు జటాయుపాతమును ♦ నిండిన కోపము నాస తెల్వియున్
డయ్యుటయుం బెనంగొని యె ♦ డందల మిక్కిలి నొంచి యూరిచెన్. ౧౦౨

మ॥ ఘన విజ్ఞానము లేని మూఢుఁడు తగం ♦ గర్మంబుచే నొందు సం
జననంబుంబలె రేయియున్, ఘృతము నో ♦ జం బోయ వగిల్లు న
గ్నిని పోలెం గడు వేడి యూర్పులు పెరిం ♦ గెన్, నిద్రరాదయ్యె రా
మునకు న్నిందిత రీతి దార జనకుల్ ♦ ఘోరాపులం బొందుటన్. ౧౦౩

రాముఁడు సీతం దలంచికొని పరితపించుట.

తే॥ రాము నేత్రపద్మంబులు ♦ రాత్రులందు, ముడుఁగకుండుట సీతయున్ ♦ జలధి కన్య
వీడి యుంటకో? తన్ముఖ ♦ విధుని చూడ, కుంటవలననో? మది తన ♦ యొద్దలేదొ?

తరల॥ అతని కన్నుల బ్రమోలఁ గన్పడి ♦ నట్టులున్న వసుంధరా
సుత వరాకృతి కప్పు కుప్పలు ♦ శోషిలం బొలుపారెఁ దా
మతిని నిబ్బరమంది లక్ష్మణు ♦ మాడ్కి తెప్పలు వ్రాల్ప క
ట్లతివ రూపు నిమేషణ స్థితి ♦ నంది కాంచుచు నుండఁగన్. ౧౦౪

తే॥ మైథిలాత్మజా శోభాయ ♦ మానమైన, మోము గాంచితి నని తాను ♦ మురియునట్లు
మలయపవనసర్పముఁ ప్రాఁకు ♦ మలచక్రియను, కాంతిగల చంద్రబింబంబు ♦ కానఁబడియె.

చ॥ అతనుఁడు పొంచియున్న తెర ♦ నవ్వలఁ ద్రోచి జగంబు తెల్లనా
యతమతిఁ గాంచు నట్టులు ర ♦ యంబునఁ జేసిన చంద్రకాంతులు
ద్ధతి భుజగంబు ఘోరవిష ♦ దంష్ట్రిలతోడ వియోగ బాధిత
ప్రతతిని కాటువైచి పలు ♦ వంతలు గూర్చెడు నట్టు లేసరెన్. ౧౦౫

చ॥ జనకజ లేని చింతయు వి ♦ నంబును చల్లెడు చంద్రుపీడయుఁన్
వెనఁగొన నేమిదోఁచక వి ♦ భిన్నతనొందె ఫణీంద్రువంటి ప్ర
న్నని మృదురోమరాజి నలి ♦ నన్ముని మించిన మోము పాలఁ బో
లిన పలుకుల్ గలట్టి లవ ♦ లీ లలితాంగిఁ దలంచి కుందుచున్. ౯౮౭

క॥ పెదవులఁ గఱచుచు నిట్టూ, ర్పొదవ భుజము లదర నిన కు ♦ లోత్తముఁడు మదిన్
మదగజము విఱిచివై వఁగఁ, గుదివడు లేఁగొమ్మవంటి ♦ కోమలిఁ దలఁచున్. ౯౮౮

ఉ॥ వంచిన నింటితో వడిగ ♦ వచ్చును వచ్చునటంచు దిక్కులం
కించుచుఁ జూచె నేమొ కిల ♦ కించితవర్తన నంచు లోన భా
వించుచు వార్థిపై నిరియు ♦ వీచికలంబలె నెచ్చుకొన్న గా
వించెడు నూర్పుతోఁడఁ బల ♦ వించె మదిం బయ లుబ్బకుండఁగన్. ౯౮౯

తరల॥ మెఱుపుఁ బోలిన వక్రదంష్ట్రలు ♦ మీఱు భీకరరూపుఁడై
వెఱపు పుట్టఁగ నిల్వునిల్వని ♦ వెక్కసించుచుఁ బంక్తికం
ధరుఁడు డాసినవేళ జానకి ♦ తత్తఱించెనొ? సోలెనో?
విరసిరం గొని విహ్వలించెనొ? ♦ భీతి నన్నుఁ దలంచెనో? ౯౯౦

తరల॥ విషధరంబు గ్రసించుచుండఁగ ♦ విన్ననై విధువై ఖరిన్
విషమ సంస్థితినొందు మైథిలి ♦ వీరుఁడేలొకొ రాఁడు నా
విషయమే యిఁక విస్మరించునొ? - విశ్రవస్సుతు ధాటికిన్
విషధరాభ శరీరుఁ డల్కెయొ ♦ పీడనంచుఁ దలంచెనో? ౯౯౧

తే॥ అనుచుఁ బరువును ప్రేమంబుఁ ♦ దనకు జ్ఞప్తి, పఱుపఁ గష్టమునొందిజీ ♦ వములుకలఁగ
దైన్యమందిన శ్రీరామ ♦ ధాత్రివరుఁడు, తలరి నాకింక విల్లు కా ♦ వలెనె? యనును

తే॥ ధనువు నెగ దిగఁ జూచి మం ♦ దస్మితంబు, సేయు భుజగిరులం గాంచి ♦ చిన్నవోవుఁ
జెలువఁ గాపాడలేమికి ♦ సిగ్గునొందుఁ, గడకు రాఁగల నిందకుఁ ♦ గలఁగి జంకు. ౯౯౨

తే॥ మంద పవనునిచే మేను ♦ మలయు మండ, నావరారోహ కులసతి ♦ నన్ను పాసి
పరితపించెనొ ప్రాణముల్ ♦ పాసెనేమొ, యనుచు నిట్టూర్పులొనరించు ♦ నటమటించు

క॥ జగములఁ గావఁగఁ బూనితి, మగువ నొకతెఁ గావలేక ♦ మఱుఁగుచు నుంటిన్
జగజెట్టి గానె యేనని, నగు సిగ్గిలు నలఁతనొందు ♦ నవయుం గుములున్. ౯౯౩

క॥ నుసలును తమ్ముఁడు పఱచిన, కిసలయములు మాఁడిపోవఁ ♦ గెడపును నూత్న
వ్యసనము వర్ధిల్లఁగ మా, నసముం దపియింప బ్రమయు ♦ నలఁకువ నెందున్. ౯౯౪

ఆ॥ కమలములను పోలు - కనుల తెప్పలు వ్రాల్చి, కల్పకాలములను - కడపు నతఁడు
నిసి ముగింపు గనఁడు - నెలఁత లేమిఁయొ? యభి, మానమునసనో? కతము - కానరాదు.

క॥ అన్నా లక్ష్మణ! దివసము, లన్నియు మాసు సమములగుట - యరయుదు గద నే
డిన్నియమమ్మున నిన్నటి, కన్నను నిసి దీర్ఘమైన కత - మెయ్యదియో?. ౯౯౯

క॥ చెలి మోము సాటి నెనయుమి, నలఁగుదు సిగ్గునను దిన ది - నంబు మలయుచుఁగ్
నెలఁతేఁడా! నాసతి ముఖ, జలజము మఱుఁగగుదు నేఁ డె - సంగెదు కడిమిన్. ౧౦౦౦

క॥ గగనమున నుండి సూర్యుఁడు, పొగడొందిన తనకులంబు - పొలుపు నమసి నేఁ
డగడొందె ననుచుఁ జింతను, జగతీస్థలి దాఁటి యువలఁ - జని మరలండో? ౧౦౦౧

ఆ॥ ఇనుఁడు పుట్టకుండె ♦ నేల? పవన్వంతు, సుట్టములను రథముఁ ♦ గూడఁబట్టి
కట్టి రావణుండు ♦ కారాగృహంబున, నుంచఁబోలుఁ గాక ♦ యున్న రాఁడె? ౧౦౦౨

ఆ॥ ఉడుకఁబోలుఁ మధ్య ♦ మెప్పారు జానకి, కానకుండు పొడవు ♦ గలుగు రాత్రి
తోడ లోకలయము ♦ తోఁతెంచు జాడలే, యెఱుఁగనయ్యె మదికి ♦ నింతనిజము. ౧౦౦౩

తే॥ తాపసులకుఁ గ్లేశముఁ గూర్చి ♦ ధాత్రియందు, ప్రాణులం జంపి తిను దైత్య ♦ వరులు బ్రతికి
యుండురేనియు ధర్మవు ♦ నూఁదియున్న, వారు నిల్తురే? తగవున ♦ వఱలు నేది? ౧౦౦౪

ఆ॥ చెఱకు వింటఁ దేంట్ల ♦ శింజిని నెక్కించి, విరి శరములఁ బూని ♦ వేయఁ దొడఁగె
మారుఁ డంబరంబు ♦ మఱుఁగుననిల్చిరా, ఘువుని మనసు తలరి ♦ కలఁగిమలఁగ. ౧౦౦౫

ఉ॥ వీడిన దానిఁ గైకొనఁగ ♦ వీ లిసుమంత లభించునేని యా
వీడినదానికై జతను ♦ వేకొను మానవుపోల్కి రాముమై
ప్రోడిమిఁ గాంచి మానసము ♦ పొక్కఁగ మారుఁడు కుండె మున్ను తా
నాడిక రుద్రుకంటి సెగఁ ♦ దాఁకిన మేనిఁ దలంచి పొందఁగన్. ౧౦౦౬

తే॥ నీలనీరదశ్యాముని ♦ నెమ్మనమ్మునఁ, దూఱి యారాత్రి శూలమై ♦ దూసిపోవఁ
గమల గర్భుని కల్పాంత ♦ కాలమట్లు, కడచెఁ జీఁకట్లు కొండల ♦ గవుల కేగె ౧౦౦౭

ఉ॥ క్షీరపయోధిఁ దా వలచు ♦ శేషుని శయ్యను నిద్రవీడి నీ
తారమణీ మణీ విరహ ♦ దాహ రసాంబుధి మున్గుచున్న యా
వీరుఁడు నీడజాది వన ♦ విశ్రుత నాదము తోడఁ దన్నిషం
గారవమొప్ప లేచె: నటు ♦ గ్లక జీవులకున్నె నిల్కడల్? ౧౦౦౮

చ॥ నెమిళులు జింకలున్ గరులు ♦ నెమ్మది జంటలుగాఁ జరించుటల్
తమకముచుఁ గాంచు రామునకు ♦ ధైర్యము నిల్చునె? తేనె కోకిలం
బమృతము వీణ వేణువు వ ♦ రాంగ రసాలముఁ గేరు క్రమ వా
క్యములు గలట్టి మైథిలిని ♦ కానలఁ గోల్పడి కుందకుండునే? ౧౦౦౯

చ॥ [illegible]లతెలవాఱఁ గాంచియును ♦ తేఁకువ జానకి యించు పల్కులన్
దెలియుని రామచంద్రునకు ♦ నిన్న జలేజముపై వసించు హం

